శ్రీరస్తు

ఎఱ్ఱాప్రెగడవిరచిత

# నృసింహపురాణము

శతావధాని శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారిచే

పరిష్కృతము



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచే బ్రకటితము.

1960

# పీఠిక

లక్ష్మీనరసింహావతార మను ఈపురాణకథను ప్రబంధముగా వ్రాసినతఁడు కవిత్రయములోని ఎఱ్ఱన. రామాయణారణ్యపర్వశేష హరివంశము లితని యితర కృతులు. వీనిలో రామాయణము నామావశిష్టము. ఆనందరంగరాట్ఛందము ఎఱ్ఱాప్రెగడ రామాయణమును సంక్షేపరామాయణ మని వ్యవహరించుచు అందలి కొన్ని పద్యములను ఉదాహరించుచున్నది. ఈ సంక్షేపరామాయణము మూల మేదో తెలియదు. కాని నేఁడు కొందఱు పరిశోధకులు ఇందలి పద్యములు చాల భాస్కరరామాయణములో కలిసిపోయె నని గాలించి పయికిఁ దీయుచున్నారు. నిజము నిలుకడమీఁదఁ దెలియును.

## ఊరు - పేరు

ఎఱ్ఱాప్రెగడ యూరు పాకనాటిలో గుడ్లూరు. ఇందు నీలకంఠుని దేవళము కలదు. విప్రనారాయణచరిత్ర రచించిన మల్లయ 'ఎఱ్ఱయ చెదల్వాడనిలయుఁ' డని చెప్పెను. (1-13. వి ప్ర.) దాన ఎఱ్ఱయ గుడ్లూరు వదలి చెదలువాడను నివాసముగాఁ జేసికొనె నని ఊహింపవలయును. ఇతని తల్లి పోతమ్మ. తండ్రి సూరన్న. ఇతనిది శ్రీవత్సగోత్రము. ఆపస్తంబ సూత్రము. ఇతఁడు శివభాగవతుఁడు. [1]లక్ష్మీనరసింహావతారమును బట్టి [2]ఎఱ్ఱయవంశవృక్ష మిటులు నాటుకొనె నని చెప్పవచ్చును.

భీమన

బొల్లన | పోలమ [భార్య]

ఎఱపోతన్న | పేరమ [భార్య][3]

బొల్లన, పోలన, జన్నన — సూరన — పోతమ [భార్య]

ఎఱ్ఱాప్రెగడ

---

1. చూ. అరణ్య. 7-469. 2. 1-15. లక్ష్మీనరసింహావతార పీఠిక.
3. ప్రేకమ అని శ్రీ వీరేశలింగముగారి పాఠము.

## కాలము

ఇతఁడు హరివంశమును వేమభూపాలునకు అంకితమిచ్చెను. వేమభూపాలుఁడు పోలయ వేమారెడ్డి. ఇతఁడు అనవేమారెడ్డి తండ్రి. ఇతఁడు ప్రతాపరుద్రుని ప్రభుత్వకాలమున ఒక సేనానాయకుఁడు. ప్రతాపరుద్రుఁడు చెఱపట్టఁబడి కొంపోబడిన పిదప 1320 మొదలుకొని 1349 వఱకు ఇతఁడు రాజ్యము చేసెను. కావున ఎఱ్ఱాప్రెగడ ఆనాఁటివాఁడు. అనఁగా ఇప్పటికి సుమారు ఆరువందల సంవత్సరముల క్రిందటవాఁడు.[1] హరివంశ పీఠిక చూచునది.

## గురువు-తండ్రి-తాను

ఎఱ్ఱయ గురువు శ్రీశంకరస్వామి[2]. ఇతఁడు కామకోటి మొదలగు పీఠములకు చెందిన ఆచార్యుఁడు కాఁడు. మఱి నిత్య శివరాత్రి వ్రతపరుఁడగు శైవాచార్యుఁడు.[3] ఈయన శైవాచార్యుఁడు కాఁ డనియు శృంగేరిపీఠపు శంకరాచార్యులనియుఁ గొందఱు వ్రాసిరి. ఇఁక ఎఱ్ఱన తండ్రి సూరన ఆరాధ్యుఁడు[4]. ఇఁక ఎఱ్ఱన శంభుదాసుఁడు. అటులయినను విష్ణువిద్వేషి కాఁడు విష్ణుభక్తుఁడు[5]. ఎఱ్ఱన తాత ఎఱపోతన

---

1. శ్రీ వీరేశలింగముగారి కవుల చరిత్ర చూ. 2. చూ. లక్ష్మీ 1-18. పీఠిక. 3. ఉ. యామము లెన్మిదింట నియతాకృతిఁ బ్రత్యహముం శివార్చనా, రామత యొప్ప నిత్య శివరాత్రి వ్రతంబుగఁ బూని. లక్ష్మీ. 1-11 పీ. బసవపురాణమును సంస్కృతీకరించిన శంకరారాధ్యుఁ డెవరో తెలిసికొనవలెను. 4. శా. ప్రాజ్ఞప్రస్తుత భవ్య భోగవిభవ స్ఫారాత్ముఁ డారాధ్య వర్యాఖ్యుండు...లక్ష్మీ. 1-25. పీ. 5. క...శంభుదాసుం డనఁగాఁ, బరఁగిన కోదండగణా, దరసంభృత శౌమనస్య ధన్యుఁడ వెందున్. లక్ష్మీ. 1-18. పీ.

'కబ్బము లల్లుట నీకు వెన్నతోఁ బెట్టినది[1]. ఆరణ్యపర్వ శేషము పూరించి ప్రబంధపరమేశుఁడ వైతివి[2]. బహుపురాణములును ధర్మశాస్త్రమును ఎఱిఁగినవాఁడవు' అని ఎఱ్ఱనతో ననెను.[3] వేమ భూపాలుఁడు సకలభాషాకవిత్వ విశారదుఁడవు అని ఎఱ్ఱయను ప్రశంసించెను[4]. ఇఁక ఎఱ్ఱన తన్నుగుఱించి 'సకల లోకైక విదితుఁ డయిన నన్నయభట్టమహా కవీంద్ర సరస సారస్వ తాంశ ప్రశస్తి దన్నుఁ జెందుటయు' అని తాను జెప్పు కొనియెను[5]. విద్యా బల మింతగా నున్నను ఎఱ్ఱయ వినయమునఁ గాళిదాసును మించినవాఁడు.

వ. 'కతిపయాక్షర పరిగ్రహ జనితం బయిన నైసర్గిక చాపలంబు కతంబున' (లక్ష్మీ. 1-11.)

ఇతని సౌజన్యము ముని మూర్ధన్యము, ఒజ్జల కితఁ డడి గఱ్ఱ[6]. సచ్చరితుఁడు. నిత్య సౌమ్య మతి. ధీరోత్తముఁడు[7]. ధర్మైక తత్పరుఁడు. శివ చిత్తుఁడు[8]. తన దైవమునకు దుష్టుని గాలి ఎక్కడ తగులునో యని వీవనతో విసరఁగలవాఁడు.

ఉ. ఎక్కడి దద్దు భూతియును నెమ్ములు సొమ్ములు భిక్ష జీవనం
బొక్కటి కట్టఁ జీరయును నుండఁగ నిల్లును లేదు నిక్కవం

---

1. క... ప్రబంధరచనా । ప్రావీణ్యము నీకు సహజ పరిణత సిద్ధం । బై వెలసినయది. లక్ష్మీ. 1-. 20. ప. 2. లక్ష్మీ. 1-17. ప. 3. సరస బహు పురాణ ధర్మశాస్త్రకథావిస్తరవేదివి. లక్ష్మీ. 1-19. 4. హరి. పూ. 1-37. 5. అరణ్య. 7-469. 6. క. గురు భజన పరాయణుఁడు...వినయోదయ భరితుఁడు. (లక్ష్మీ. 1-18. ప.) 7. హరి. పూ. 1-37. 8. ...ధర్మైక తత్పరుఁడు.....శివపదాబ్జ సంతత ధ్యాన సంసక్త చిత్తుఁడు. అరణ్య. 7-469.

వి క్కఱకుం దపస్విజను నేఁచిన నయ్యొడు నేమి యంచుఁ దా
నొక్కని శర్వునిం బఱుపనొల్లఁడు దైత్యుఁ డనాదరంబునన్.
లక్ష్మీ. 1-124.

## రచనకు బీజము

ఏదో ఒక మహాప్రబంధము వ్రాయవలయు నను కుతూహలము ఎఱ్ఱయకు ఉత్కటమాయెను. ఒక క్షణము సమాహితచిత్తుఁడై కూరుచుండెను. అపుడు తాత ఎఱపోతసూరి భావమున ఆవిర్భవించి 'నాయనా నీవు ప్రబంధపరమేశ్వరుఁడనఁగా ఆరణ్యపర్వశేషమును నిర్వహించితివి. ఇపుడు నా ప్రియదైవమగు అహోబలేశ నరసింహుని అవతారమును స్తుతింపుము' అని ఆదేశించెను. ఎఱ్ఱయ పులకించెను. అతని మనసు వికసించెను. అతని కనులు విచ్చెను. అతఁడు అద్భుతానందరసమూర్తియాయెను. 'ఇది యీశ్వర శాసనము. నా తాత ప్రాచీన మునులవంటివాఁడు. నీవు నాపేరివాఁడవని నన్నెపుడును ఆదరించుచుండును. ఆ మహాత్ముఁడును ఉభయకవిత్వప్రౌఢుఁడగు నాతండ్రియు విష్ణుప్రశంసచే పవిత్రమైన నా ప్రబంధము వలన సంతోషింతురుగాక' అని అనుకొనెను. ఈ లక్ష్మీనరసింహావతారరచన కుపక్రమించెను.

## ప్రబంధమా లేక పురాణమా!

ఎఱ్ఱయ యీ లక్ష్మీనరసింహావతారమును ప్రబంధమనియు[1]. కావ్యమనియు[2]. విశేషించి విజ్ఞానవాఙ్మయ మనియు[3].

---

1. ఇట్లు మహాప్రబంధ కల్పనా కుతూహలాయత్తం బగు లక్ష్మీ. పీఠిక. 1-14. 'అతీర్థం బెఱిఁగింపుమాకుఁ బరమోదాత్త ప్రబంధోక్తులన్.' 1-5. 2. శ్రీకర కావ్యరూపకన్. లక్ష్మీ. పీ. 1-28. 3. ఈ విజ్ఞానాత్మ వాఙ్మయం బన. లక్ష్మీ. పీ. 1-26. మొదలగునవి. చూ.

వ్యవహరించెను. మఱియు ఈ ప్రబంధమునందు.....'అనుచు ననేక విధంబులఁ బ్రహ్మాదులందు విజ్ఞానపరవశుండై పలుకుచున్న పలుకులు' 5-73

'తన తనిగాలిసోఁకునఁ జాలఁ జిగురొత్తు
చతుర మనోజ్ఞ విజ్ఞాన లతలు.' 5-157

'పురుషాకారము తోఁడ నున్న శిఖియో పుంస్త్వంబు లేదో యటే
తరువో పుత్తడిరూపొ చిత్రమును చైతన్యంబు శూన్యం బొకో
విరసత్వంబుల ప్రోవొ నిశ్చల కళావిజ్ఞాన సర్వస్వమో.' 1-11.

అని యితఁడు విజ్ఞానశబ్దమును శ్రీ, కల్యాణ[1] శబ్దములతోఁ పాటు ఇనుమిక్కిలిగా వాడును. ఈ విజ్ఞానము భక్తిప్రధాన మయినది[2]. ఇందు నాలుగై దాశ్వాసములు జ్ఞానభక్తి భరితములు. కాఁగా ఈతఁడు ఉపయోగించిన ఈ జ్ఞాన విజ్ఞానశబ్దములు పరమేశ్వరోద్దిష్టములు; ఆ పరమేశ్వరుఁడు ఈ ప్రబంధమున నామరూపములు కల నరసింహస్వామి.

## దీనికి మూలము

ఈ లక్ష్మీనరసింహావతారమునకు మూలము బ్రహ్మాండాది పురాణములు.

వ. 'మహర్షులు...అఖిల పురాణేతిహాసంబులు పరిపాటి వినుచుండి బ్రహ్మాండపురాణంబునఁ దీర్ఘ భాగశ్రవణంబు సేయు సమయంబున'

కథారంభ. 1-1.

వ. 'బ్రహ్మాండాది పురాణోక్తంబయిన శ్రీ నృసింహావతారం బను పురాణంబుఁ దెనుఁగుబాసఁ బ్రకటింపవలయును.' చూ. లక్ష్మీ. 1-27. కీ.

1. చూ. హరివంశము. 2. ప్రసన్నభక్తి నయ వాఙ్మయం. లక్ష్మీ. 1-16.

కాని బ్రహ్మాండపురాణములో ఈ కథ అల్పాల్పము. ఎట్టిన దేవశ్రవునిచే

క. వినుము పెద్దలచే మును, వీను లలరఁ దనకరంబ విన్నవిధంబుల్[1]
మానసమున నున్న తెఱంగుఁ, గానుపునం గన్న క్రమముఁ గథన మొనర్తున్.
చూ. లక్ష్మీ. 1-24. కథారంభ.

అని చెప్పించెను. కావునఁ గొంత కల్పించినటులు మన మూహింపవలసియున్నది. ఆ కొంతలో ఈ క్రిందికొంత చేరదు. ఏలనఁగా ఇందలి నాలవ యాశ్వాసమును, ఐదవ యాశ్వాసములో కొంతపాలును విష్ణుపురాణమునందలి నృసింహావతార విషయక ప్రశ్న ప్రతివచనములకు ఆంధ్రీకరణము. ఇది భార తాంధ్రీకరణమువంటిదే. ఉదా.

పఠ్యతాం భవతా వత్స సారభూతం సుభాషితం,
కాలే నైతావతా యత్తే న దోద్యుక్తేన శిక్షితమ్.
శ్రూయతాం తాత వక్ష్యామి సారభూతం తవాజ్ఞయా,
సమాహితమనా భూత్వా యన్మే చేత స్యవస్థితమ్.
అనాది మధ్యాంత మజ మవృద్ధి క్షయ మచ్యుతం,
ప్రణతోఽస్మ్యంతసంతానం సర్వ కారణ కారణమ్.
1. అంశ. 17. సర్గ. 13, 14, 15.

ఉ. "పాఠుఁడ యింతకాలమును బాయక యొజ్జలయొద్దనుండి నీ
వే పఠిదిం బఠించి తది యేర్పడఁ బ్రస్ఫురితార్థ సారమై
తీపులు వీనులం గురియ దివ్య సుభాషిత రత్న మొక్కటు
ద్దీపిత ధీ విజృంభణ విధేయత యొప్పు నుపన్యసింపుమా.

---

1. ఆ. భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు, శూలికైనఁ దమ్మిచూలికైన
విబుధ జనులవలన విన్నంత గన్నంత, తెలియవచ్చినంత తేటపఱతు.
భాగ. 1-19.

క. అనుటయుఁ బ్రహ్లాదుం డి, ట్లనియెను నీ యాన తిచ్చి నట్టిద యహహ్యా
వినిపించెద నా మది మెచ్చిన యర్థం బవధరింపు చిత్తప్రీతిన్.

సీ. ఆదియు మధ్యంబు నంత్యంబు నెవ్వాని కరయ లేదని చెప్పు నాగమములు
పొడమటయును లేక పొదలుటయును లేక తఱుగుటయును లేక తనరు నెవ్వఁ
డెవ్వనివలనన యెంతయు సంభవస్థాన సమాహార దశలు చెందుఁ
గారణంబుల కెల్లఁ గారణంబై యెవ్వఁ డుపగత కారణుండై వెలుంగు

ఆ. నమ్మహానుభావు నచ్యుతు నవికారు, నమిత తేజు విష్ణు నాదిదేవు
నాశ్రయించినాఁడ నధిప యింతయ కాక, యితరమైన యర్థ మెఱుఁగ నేను"

... ... ... 4. ఆ. 5, 6, 7.

విద్యాబుద్ధి రవిద్యాయా మజ్ఞానా త్తాత జాయతే,
బాలోఽగ్నిం కిం న ఖద్యోత మసురేశ్వర మన్యతే?
తత్కర్మ యన్న బంధాయ సా విద్యా యా విముక్తయే,
ఆయాసా యాపరం కర్మ విద్యాఽన్యా శిల్పనైపుణమ్.
తదేత దవగ మ్యాహ మసారం సార ముత్తమం,
నిశామయ మహాభాగ ప్రణిపత్య బ్రవీమి తే.
న చింతయతి కో రాజ్యం కో ధనం నాభివాంఛతి?
తథాపి భావ్య మే వైత దుభయం ప్రాప్యతే నరైః.
సర్వ ఏవ మహాభాగ మహత్త్వం ప్రతి సోద్యమాః,
తథాపి పుంసాం భాగ్యాని నోద్యమా భూతిహేతవః.
జడానా మవివేకానా మశూరాణా మపి ప్రభో,
భాగ్య భోజ్యాని రాజ్యాని సం త్యనీతిమతా మపి.
తస్మా ద్యతేత పుణ్యేషు య ఇచ్ఛే న్మహతీం శ్రియం,
యతితవ్యం సమత్వే చ నిర్వాణ మపి చేచ్ఛతా.

... ... ... 1. అం. 19. సర్గ. 40-46.

క. మిడుఁగు అని తలఁచు బాలుఁడు
మిడుఁగుఱుఁబుర్వుఁ గని మీన మిడికెదుజనుఁడున్

పోఁడుగునఁ దగు ప్రో వింతయుం
జడనిధిగాఁ జూచు నవుల జాఱని తెలివిన్.

వ. అట్లగుటం జేసి.

క. పెదవిద్య లెవ్వియును భవ, ముదుపఁగలే వాత్మబంధ ముడుపునదియ యొ
క్కఁడువిద్య యట్టివిద్యలు, దొడఁగు పనియు మంచిపని విధూతకలంకా.
4-161.

క. ఇది యంతయుఁ దగఁ గనుఁగొని, మది నిస్సారంపువిద్య మరగక బంధ
చ్ఛిదఁ జేయు నాత్మవిద్యకు,నొదవఁదొడఁగినాఁడ నుడుగ నుద్యమ మెట్లున్.
4-162.

సీ. ఉద్యోగముల కెల్ల నొదవును ఫలసిద్ధి యెవ్వాఁడు తొలుమేన కొంతచేసె
నంతియ వానికి నబ్బు నిబ్భవమున శ్రీలు విద్యలు సెల్లమేలు నాత్మఁ
గోరనివాఁడును గోరి యోపినయంత నుత్సహింపనివాఁడు నొకఁడు గలఁడె
కూరత లేక యుదారత లేక యే తెలివియు లేక యే తెలుఁగు లేక

గీ. యూరకుండెడు నీచుల కొదవు గరిమ
వారివెరవున నెయ్యది వచ్చుఁ జెపుమ
యయిన నుద్యోగి గావలె నండ్రు బుధులు
భాగ్య మిట్టిది యని కానఁబడదుగాన. 1-163.

క. కావున ముక్తికి యత్నము, గావింపఁగవలయుం సమత గల్గుటఁ గోరం
గావలయు నెప్పుడును స,ద్భావంబున సమతయెవ్విధంబండ్రేనిన్. 1-164.

ఇందు మొదటి మూఁడాశ్వాసములలోని వర్ణనాదులలో ఇతరానుకరణము లేనిచో అవి స్వకపోల కల్పితములు. మఱియు గోపాల నారాయణ అండుకోబాంబాయి. ప్రకటించిన నరసింహపురాణమునకును దీనికిని పొత్తు లేదు.

## వాస్తవ కథ

హిరణ్యకశిపుఁడు మహాపరాక్రమము గల రాజు. ఇంద్రుఁడును మఱియొక బలశాలి. ఇతఁడు ఇలావృతవర్షమునకు రాజు. ఇలావృతమునకు స్వర్గమని పేరు. ఇలావృతవర్షము నందలివారికి దేవతలని పేరు. హిరణ్యకశిపుఁడు ఇంద్రునితో

పోరి స్వర్గమును ఆక్రమించుకొనెను. దేవత లతనికి భీతి చెంది మనుష్యవేషములతో తిరుగఁదొడఁగిరి. అపుడు భారతవాసులకు మనుష్యులని పేరు. వారు మనుప్రజలు. పూర్వకాలమున మనుష్యశబ్దార్థ మిప్పటివలె ఇంత వ్యాపకము కాదు.

హిరణ్యకశిపుఁడు విష్ణుసమకాలికుఁడు. ఈ విష్ణువు వామన విష్ణువునకు వెనుకటివాఁడు. ఇలావృతమునకును ఉత్తరమున నున్న క్షీరోదతీరభూములకు (?) ఇతఁ డేలిక.

ప్రహ్లాదునకును తండ్రికిని పడలేదు. హిరణ్యకశిపుఁడు కొడుకు నెంతయో హింసించెను. ప్రహ్లాదుఁడు విష్ణువు నాశ్రయించెను. తుద కెటులో ఈతండ్రి కొడుకులనడుమ సద్భావము ఏర్పడెను. హిరణ్యకశిపుఁడు అనుతాపము చెంది ప్రహ్లాదునెడల వాత్సల్యము పూనెను. ధర్మజ్ఞుఁడగు ప్రహ్లాదుఁడును తండ్రిని పరమభక్తితోఁ[1] జూడ మొదలిడెను. నృసింహుఁ డేల హిరణ్యకశిపును వధించెనో విష్ణుపురాణము చెప్పదు. నృసింహుఁడు స్తంభమును బద్దలు కొట్టుకొని ఆవిర్భవించుటయు విష్ణుపురాణమున లేదు.

---

1. ఇత్యుక్త్వాంతర్దధే విష్ణు స్తత్ర మైత్రేయ పశ్యతః,
   స చాపి పున రాగమ్య వవందే చరణౌ పితుః.
   తం పితా మూర్ధ్న్యుపాఘ్రాయ పరిష్వజ్య చ పీడితం,
   జీవసీత్యాహ వత్సేతి బాష్పార్ద్రనయనో ద్విజ.
   ప్రీతిమాం శ్చాభవ త్తస్మి న్ననుతాపీ మహాసురః.
   గురుపిత్రో శ్చకారైవం శుశ్రూషాం సోఽపి ధర్మవిత్.
   పిత ర్యుపరతిం నీతే నరసింహస్వరూపిణా,
   విష్ణునా సోఽపి దైత్యానాం మైత్రేయాఽభూత్పతి స్తతః,

   విష్ణు. 1. అం౨౦

మృగయావిహారమున హిరణ్యకశిపుని ఒక సింహము, చీల్చిచంపియుండును. ఇతఁడు విష్ణువిద్వేషి కావున ఆవిష్ణువే సింహరూపమున హిరణ్యకశిపుని చంపె నని కల్పన చేసియుందురు, అని వాస్తవవాదులు అందురు. ఇది అధునాతనుల హిస్టరీ. ఇఁక మన గ్రంథమునందలి

## కథాశరీరము - రసము

మొదటి మూఁడాశ్వాసముల కథాశరీరము భిన్నరసములయు భావములయు ఉదయాస్తములచే సుళ్లు తిరిగెను. ఏ రసమునకును నిలుకడ లేదు. పిదప (శ్రీనృసింహా)రౌద్రమున కంగముగా అంకురించిన ప్రహ్లాదుని భక్తి మాత్రము హిరణ్యకశిపు ద్వేషాదులచే పల్లవించి పుష్పించి ఫలించెను. ఆ భక్తి జ్ఞాన సమకక్షమై వెలసెను. కావున నీ ప్రబంధము కలగాపులగమై పురాణమని పేరు పొందెను.

ఈ కథకు బ్రహ్మమానస పుత్రుల శాపము బీజము. హిరణ్యకశిపు వధ కార్యము. భగవంతుఁడీ శాపమును

'శత్రుండు నిరంతరంబు ను(మ)ద్గతంబైన హృదయంబునం దస్మదీయ సాదృశ్యంబు తనకుఁ గావలయుంటం దలంచుటఁ దత్ప్రకారంబు సాయుజ్య సంపత్కారణంబు.' 1-101.

అని విశేషించెను. దీని కనుగుణముగా ఎఱ్ఱయ హిరణ్యకశిపుని చిత్రింపలేదు. హిరణ్యకశిపుఁడు 'ఏను జగము లెల్ల నేలువాఁడ. విష్ణుఁ డనఁగఁగలఁడె వేఱొకండు? నేనే పరమేశ్వరుఁడను' అని యీా మొదలుగా నను. వాత్సల్యమే లేని అతని హృదయము భయాదులచే భ్రమర కీట న్యాయముగా భాగవతమునందలి కంసాదుల హృదయమువలె భగవంతునికి గూఁడు కాలేదు. ముమ్మొదట—

"ఊహింపఁగాఁ గార్య మొకటి యేమేనియుఁ
గలుగు నూరక వీర లలుగువారె" 1-93

అని మాత్ర మనును.

నిధన సమయమునందును హిరణ్యకశిపుఁడు జయుఁడని పాఠకులకు జ్ఞప్తి కలుగదు. శాపమునకు భగవంతుఁడు చెప్పిన ప్రతిఫలము ఇంచుకయు ముట్టదు. భగవంతుఁడు ప్రహ్లాదునితో నీతండ్రికి ఉత్తమలోకప్రాప్తి యగునని మాత్రము చెప్పెను.

ఇందు కరుణ వీర రౌద్రాద్భుత శృంగార రసములు ఉన్నను ఈ ప్రబంధము వర్ణనీయుఁడగు నరసింహమూర్తి వలె శృంగార 'వీర కరుణాద్భుతానేకరస నికర సంకుల ప్రకార దుర్నిరూపోపప్లావమై' యున్నది. (5-82) పౌరాణికమగు నీకథ కథ పాళముగా నడపుచో నటులు కాక తప్పదు. దానఁజేసియే గద్యమునం దెఱ్ఱయ 'లక్ష్మీనరసింహావతారం బను పురాణకథ యందు' అని వ్రాసెను. చెదలువాడ మల్లన అప్పకవి మొదలగువారు ఈ లక్ష్మీనరసింహావతార మను ప్రబంధమును నృసింహ పురాణమనియే వాడిరి. ఈ పేరిలో సౌలభ్య మున్నది కదా. తండ్రి పెట్టుకొన్న పేరును పొడ్డుపెట్టి, లోకులే బొడ్డుకోసి, పెట్టు పొట్టి పేరులు మన మెఱిఁగినవే. మఱియు భీమన నృసింహపురాణ మొకటి కల దని వినికి.

'భీమన నృసింహపురాణమున'

క. మానవ నాథుఁడు గంగా, స్నానానంతరము సకలదానములు మహీ
దీను లగువిప్రకోటికి, నేనా దయతోడ నిచ్చి శివు సేవించెన్. 3-252

సీ. నరనాథ యతని దానమ్ములచేత న
వాప్తకాములు గానివారు లేరు 3-362

సీ. ఈశాపు నీలంపుగోడను దను వింత
గనుపట్టు తీవంచు కంబములను 3-56.

(ఆ. రంగ. ఛంద)

అని కలదు. హరిభట్టు నారసింహపురాణ మొకటి యున్నది.

## అష్టరస వాదియా?

ఉ. ఆడుదు రెల్లప్రొద్దు లలితాభినయంబున దేవకామినుల్
పాడుదు రింపు వీనులకుఁ బండువుసేయఁగ వేడ్కఁ గిన్నరుల్
గూడి సమగ్రతత్త్వరసగోష్ఠి సుఖింతురు యోగిబృందముల్
క్రీడ యొనర్తు రష్టరస కీర్తన భంగిఁ బ్రపన్ను లయ్యెడన్. . 1-61

అను వైకుంఠ వర్ణనలో అష్టరస ప్రసక్తియే కలదుగాన, ఇతఁడష్టరసవాది యని యనుచో ఈ ప్రమాణము దుర్బలము. వెలసఁగా ఈ ప్రపన్నులది భక్తి కావున ఇది ప్రకరణానుగతము.

శాంతరసము లే దని యెవరు ననరు. మహాభారతము శాంతరసప్రధాన మగు మహాకావ్యము. దానిఁ గొంత తెలిఁగించిన ఎఱ్ఱయ అష్టరసవాది యనుట అతని తల్లి గోత్రాలని యనుట. శాంతము, రసము కాదను పక్షము రూపకములలో. ఇంతియ కాక ఇట 'ఇష్టరస' అని పాఠాంతరము. ఈ పాఠమే సాధు పాఠము. చూ. నృ. పురాణము 1-48.

## పోతన

సంస్కృత భాగవతమున ప్రహ్లాదకథ ప్రసిద్ధము. పోతన వలన ఆంధ్రలోకమున సుప్రసిద్ధము. మొన మొన్నటివఱకు తెలుఁగునాట బాలుర కందఱకును కంఠస్థము. స్త్రీలు చల్లచిలుకుచునో మెల్ల యలుకుచునో యీకథను కోయిలల కుగ్గుపెట్టుదురు. ఆంధ్రభాగవతమునకు మాతృక యగు సంస్కృతభాగవతములోని విజ్ఞానవాక్యములకును, విష్ణుపురాణమునకును పోలికకలదు. విష్ణుపురాణము భాగవతమునకు మూలము కదా.

ఎఱ్ఱయ పద్యములు కొన్ని పోతన పోఁతలోఁ బడి పద్మముల వలె విప్పారెను.

ఆ. కుడిచినపుడు నిద్ర గూరినయప్పుడు, మేలుకొనినయపుడు మెలఁగినపుడు.
విష్ణుకీర్తనంబు విష్ణుచింతయ కాని, పలుకఁ డొండు బుద్ధిఁ దలఁపఁ డొండు.
లక్ష్మీ. 3-151.

శా. పానీయంబులు ద్రావుచుం గుడుచుచున్ భాషించుచున్ హాసలీ
లానిద్రాదులు సేయుచుం దిరుగుచున్ లక్షించుచున్ సంతత
శ్రీనారాయణ పాదపద్మయుగళీ చింతామృతాస్వాద సం
ధానుండై మఱచెన్ సురారిసుతుఁ డేతద్విశ్వమున్ భూవరా.
భాగ. 7-123

ఉ. ఊషర బీజముల్ భసితయోజ్యఘృతంబులు షండ కన్యకా
న్వేషణముల్ పయోధిగత వృష్టికతుల్ మృగతృష్ణికాంబుగం
డూషలు దుర్గకానన కరోరిత చంద్రిక లేడమూక స
ద్భాషలు విష్ణుమంగళకథావిముఖాత్ముల కష్టజన్మముల్. లక్ష్మీ. 5-24

శా. అంధేందూదయముల్ మహాబధిర శంఖారావముల్ మూక సద్
గ్రంథఖ్యాపనముల్ నపుంసక వధూకాంక్షల్ కృతఘ్నావళీ
బంధుత్వంబులు భస్మహవ్యములు లుబ్ధద్రవ్యముల్ క్రోడ సద్
గంధంబుల్ హరిభక్తివర్జితుల రిక్త వ్యర్థ సంసారముల్ భాగ. 7-168.

సీ. వాసుదేవుని పాద వనరుహంబుల భక్తి
తగదను తండ్రియుఁ దండ్రి గాఁడు
వేదచోదితమైన విష్ణుధర్మమునకుఁ
గోపించు గురుఁడును గురుఁడుగాఁడు
భవదుఃఖములు మాన్పఁ బ్రభువైన హరిసేవ
నెడలించు హితుఁడును హితుఁడుగాఁడు
పరయోగమతమగు వైష్ణవజ్ఞానంబు
వదలిన చదువును జదువుగాదు

గీ. కేశవాకారలీలలం గీలుకొని మం
దంబుఁ బొందని తలఁపును దలఁపుగాదు
మాధవస్తోత్ర ఘన సుధా మధుర రుచులఁ
జిలుక కుండెడు జిహ్వయుం జిహ్వగాదు. లక్ష్మీ. 5-22.

నిషేధరూపమగు ఈయర్థము పోతనపోతలో అర్థాంతరసంక్రమితవాచ్యధ్వనియై సుందరశబ్దమూర్తిని ధరించి యిటులు వెలువడెను:—

సీ. కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకునిఁ జూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము
విష్ణు నాకర్ణించు వీనులు వీనులు
మధువైరిఁ దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు
పురుషోత్తమునిమీఁది బుద్ధి బుద్ధి
తే. దేవదేవునిఁ జింతించు దినము దినము
చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడి గురుఁడు గురుఁడు
తండ్రి హరిఁ జేరు మనియెడి తండ్రి తండ్రి. భాగ. 7-169.

ఇట్టి వ్యంగ్యరచనకును ఎఱ్ఱనయే పోతనకు త్రోవ చూపెను.

క. హరిభక్తుల తపము తపము
హరిభక్తుల జపము జపము'...... లక్ష్మీ. 2-33.

ఉ. అడఁగబోయినప్పు డసురాత్మజుఁ డంబుజనాభు నవ్యయుం
బాడుద మాదిదేవు పదపంకజ పూజలు సేసి భక్తిమై
నాడుద మచ్యుతైక శరణాగతులం గని కర్మబంధముల్
వీడుద మంచుఁ బల్కుఁ గడు విస్మయ మందఁగఁ దోడిబాలకుల్.
లక్ష్మీ. 3-149.

క. ఆడుదము మనము హరిరతిఁ, బాడుద మేప్రొద్దు విష్ణుభద్రయశంబుల్
వీడుదము దనుజసంగతిఁ, గూడుదము ముకుందభక్తకోటిఁ సూటిన్.
భాగ. 7-248.

వ. ...హిరణ కశిపు ప్రహ్లాదవిషయ నిగ్రహానుగ్రహావేశ వ్యతికర విషమ సంరంభదుర్వారగర్వారంభ భీషణాభిరూప సంస్థానంబును...లక్ష్మీ. 5-32.

వ. ...ప్రహ్లాద హిరణ్యకశిపు రంజన భంజన నిమిత్తాంతరంగ జేగీయ మాన కరుణా వీర రస సంయుతుండును...— భాగ. 7-285.

సీ...ఆ. అంబుజోదర ధ్యానత, త్వరత యొకటి కాని బాలకుండు......
లక్ష్మీ. 3-147.

సీ. ...గీ. అంబుజోదర దివ్య పాదారవింద
చింతనామృతపాన విశేషమత్త
చిత్తము........ భాగ. 7-124, 154

ఇట్టివి ఇంకను పెక్కు లుదాహరణీయములు కలవు. వీనివలన ఎఱ్ఱన్న పోతన్నకు అన్నయని తెల్లము.

## భావుకత

ఇందలి క్షీరసముద్రము వైకుంఠము భగవానుఁడు వసంతము పానగోష్ఠి నరసింహమూర్తి మన కనుల ప్రేలుదురు. ఎఱ్ఱయ భావనావిహంగము నడుమనడుమ మూలాధారము నుండి సహస్రారమునకును, భూమినుండి స్వర్గమునకును ఎగురుట యావర్ణనములం దెడనెడ మనము కనుఁగొనఁగలము. ఎఱ్ఱయ జన్మతః కవి. భావుకత అతనికి పరివేషము. అతని కవితా శయ్య పుష్పగుంభితము. హృదయము రసప్రస్రవణము. ఈ పాట వినుఁడు.

ఉ. పొందవు దుఃఖముల్ భయము పొందదు పొందదు దైన్య మెమ్మెయిన్
బొందవు తీవ్రదుర్దశలు పొందుఁ బ్రియంబులు పొందు సంపదల్
పొందు సమగ్రసౌఖ్యములఁ బొందు సమున్నత కీర్తు లెందు గో
విందపదారవింద పదవీ పరిణద్ధ గరిష్ఠ చిత్తులన్. 2-31

పద్య మెంత అప్రయత్నముగా నడచునో.

క. సనకుఁడు సనందనుండును, సనత్కుమారుఁడు సనత్సుజాతుండనఁగా
   ముని వరులు వనజభవు నందను లేతెంచిరి ముకుంద దర్శన వాంఛన్. 2-82

అర్థమున కనుకూలముగా ఛందస్సు ఎటులు పరుగిడునో?

మత్త. రండు పోదము రెండు వేగమ ప్రస్ఫురత్కులిశాయుధా
   ఖండ ఖేలన హేతి భీతి నగ ప్రజాభయ దాయితా
   చండ చండ తరంగ సంభ్రమ సంప్రవర్ధిత వార్ధికిన్
   బుండరీకదళాక్ష మందిర భూమికిన్ మహానేమికిన్. 2-145

ఎత్తి చూపుటకుఁగాని, ప్రయత్నించి తెలిసికొనుటకుఁగాని పని యుండనంతగా ఇతని కవిత్వమునం దెచటఁ జూచినను సౌంద ర్యము తరంగితమగుచుండును.

తరంగములు లేచిపడుచు, నురుఁగుల కాంతి ప్రసరించుచు, పగడపుఁదీగలు అటు ఇటు కొట్టుకొనుచుండ—బడబాగ్ని తోడి సముద్రుఁడు చేతులాడించుచు, అట్టహాసము చేయుచు, జడలు విదిర్చుచు ఫాలనేత్రముతో తాండవించుచుండు శివుని వలె నతనికిఁ గనుపట్టును. 1-34. హిరణ్యకశిపుఁడు నీట నిల్చి చేయు నుగ్రతపమునకు కమలి, కములిని కన్ను మూసెనఁట. అతని వెచ్చ యూర్పులకు నీ రిగురఁగా మాఱటగా మంచు నీరుకురిసె నఁట. అతని తపము తెఱఁ గంతయు నిదుర లేక సరసి నల్లఁ గల్వల కన్నులతో చూచుచున్న దఁట. 2-21. దిగ్దంతుల దంత ములు ఊడఁబెఱికి బ్రహ్మాండ మను వాద్యమును వాయించుచు ముక్తాప్రాలంబములు కల రాకాశశాంకుఁ డఁట హిరణ్యకశిపుఁడు! 2-4. మలయపవనుఁడు వేసఁగికి కలఁగి తలఁగిపోనేరక తాల వృంతములలో తల దాఁచికొనె నఁట 3-69.

పెద్ద ఉత్ప్రేక్షను అతిశయోక్తిని పెద్దగాఁ జెప్పుదురు. స్వభావోక్తిమాత్రము తక్కువ తిన్నదా? చూడుఁడు, వేసవిలో

పగలు తెలతోఁటనీడలు బ్రాఁతి యయ్యెఁ
బగటిలును రేలు తనుగాలి బ్రాఁతి యయ్యె
రేలు వెన్నెలబయళులు ప్రియము లయ్యె
రేలుఁబగళులు నిద్రలుఁ బ్రియము లయ్యె. 3-73.

ఇప్పటి ప్రభుత్వమున నిషిద్ధమైన పానగోష్ఠిని పట్టు కొందము. ఒక సుందరిచేతి పానపాత్రమునఁ బడి చందమామ గడగడలాడుచున్నాఁడు. ఎందుల కందురా, వినుఁడు. ఆసుందరి మోమునందమునకు కన్నవెట్టిన దొంగ కాఁడా ఆ మామ? ఇపుడు పట్టు పడ్డాఁడు. ఇఁక వడవడ వడఁక కేమి చేయును? 3-97. ఇఁక వెన్నెలలోనికి పోదమా? అది రాత్రి యను తలఁపు పుట్టనీక, తమ మను మాట వినసీక, అవ్యక్త యను శంక నంకు రింపనీక అంతఃకరణమునకు బ్రహ్మానందముగా నుండ లేదా? 3-91. ఇఁక బ్రహ్మమునే చూతము. అది పాఁపపొనుపున పండి యున్నది. మంచుకొండ నెత్తమునఁ గ్రమ్మిన నీటి మబ్బు చాయకు నుపమేయము దాని సోయగము. అది విజ్ఞానమునకు నిర్దేశము. ఒక పెడ సగుణము, ఒక పెడ నిర్గుణము. వెరసి ఉభయము. 3-14.

'జ్ఞానినా ముపకారాయ త్రిధా రూపం ప్రభు ర్వహేత్
సగుణం నిర్గుణం చైవ తస్మా త్సగుణ నిర్గుణమ్.'

అను సూత సంహిత యిచ్చట గుఱుతు వచ్చెడిని. ఎఱ్ఱాప్రెగడకు పరమేశ్వరునియెడఁ గల అభిజ్ఞత ఎంత లోఁతో అంత విరివి. అది విశేషించి మూఁడవ యాశ్వాసమున అంగవర్ణనము సంమనను, దర్శనముల ఊఁతతోఁ జేసిన భగవత్ స్తుతియందును, ఐదవ

యాశ్వాసమున స్తంభోద్భవవచనమునందును, దండకము నందును [1]కనఁబడును. దర్శనముల ప్రాపుఁజేసి, స్తోత్రమున సాంఖ్యప్రస్తావములో ఈ దిగువపద్యము కలదు,—

శా. దృష్టాదృష్టఫల స్పృహావిముఖులై దిక్పూర్వ తత్త్వక్రియా
సృష్టిం బ్రస్ఫుటతీవ్రబోధమున నుత్సేకించి యవ్యక్త సం
సృష్టిం బాసి నిరస్తవైకృతు నుదాసీనాత్ము షడ్వింశు వి
స్పష్టైశ్వర్యుని నిన్ను సాంఖ్యు లెలమిన్ భావింతు రాత్మేశ్వరా!

"ఓ పరమపురుషా! సాంఖ్యులు ఇహపరలోకభోగముల ఆశకు పెడ మొగము పెట్టి ఆకాశము మొదలుగాఁగల తత్త్వముల సృష్టిని (దిక్ఛబ్దమిచట ఆకాశపరము)నిశితజ్ఞానముచే దాఁటి, అవ్యక్తసంబంధమును (సంసృష్టి=తిలతండులముల కలయికవంటి కలయిక) వీడి, నిన్ను వికారదూరునిగను ఉదాసీనునిగను షడ్వింశునిగను అనఁగా ఇరువదాఱవ తత్త్వముగను, తలఁతురు" అని అర్థము.

వేదాంతులమతమున జ్ఞానేంద్రియము లైదు, కర్మేంద్రియము లైదు, భూతము లైదు, శబ్దాదివిషయము లైదు, మనోబుద్ధ్యహంకారప్రకృతిచిదాభాసు లైదుగురు. వెరసి ౨౫. ఇరువదాఱవవాఁడు పురుషుఁడు.

ఈపద్యమున ఉదాసీనుఁడగు సాంఖ్యపురుషుఁడు ఇరువది యాఱవవాఁ డని చెప్పఁబడెను. అనఁగా ఇదియే పరతత్త్వము లేక తత్త్వాతీతము.

## ౨౫ తత్త్వములు

సాంఖ్యము ఏమి చెప్పునో చూతము. సాంఖ్యకారిక,—

'మూలప్రకృతి రవికృతి, ర్మహ దాద్యాః ప్రకృతి వికృతయ స్సప్త
షోడశక శ్చ వికారో, న ప్రకృతి ర్న వికృతిః పురుషః.'

---

1. ఈ చోటుల నన్నిఁటను ఈ ముద్రణమునను పెక్కు అపపాఠములు కలవు. సుపాఠములకొఱకు వేచియుందము.

అనియు, సాంఖ్యసూత్రము,—

'సత్త్వ రజస్తమసాం, సామ్యావస్థా ప్రకృతిః, ప్రకృతే ర్మహాన్, మహతోఽహంకారోఽహంకారా త్పంచ తన్మాత్రా ణ్యుభయ మింద్రియం, తన్మాత్రేభ్యః స్థూలభూతాని, పురుష ఇతి పంచవింశతి ర్గణః.' (౧-౬౧)

అనియు ఇరువదియైదు తత్త్వములనే చెప్పెను. 'పంచవింశ ఆత్మా భవతి' అను శ్రుతి యిందుల కుపష్టంభకము. ఇటులగుచో ఈ షడ్వింశుఁ డెవఁడు ?

## విద్యారణ్యులు

సర్వదర్శనసంగ్రహమున విద్యారణ్యులు సాంఖ్యదర్శనము ఇరువదేనుతత్త్వములను చెప్పెననియు, పాతంజలదర్శనము

'ప్రధానాదీని పంచవింశతి తత్త్వాని ప్రాచీనాన్యేవ సమ్మతాని.షడ్వింశస్తు పరమేశ్వరః క్లేశ కర్మ విపాకాశయై రపరామృష్టః పురుషః స్వేచ్ఛయా నిర్మాణకాయ మధిష్ఠాయ లౌకిక వైదిక సంప్రదాయప్రవర్తకః సంసారాంగారే తప్యమానానాం ప్రాణభృతా మనుగ్రాహక శ్చ.'

(=సాంఖ్యము చెప్పిన ప్రధానాదులగు ఇరువదియయిదుతత్త్వములే యోగదర్శనమునకును సమ్మతములయినను, ఇరువదియాఱవవాఁడు పరమేశ్వరుఁడొకఁ డున్నాఁడు. అతఁడు క్లేశాదులచే అంటఁబడఁడు. అతఁడు ఇచ్ఛామాత్రమున నిర్మాణకాయమధిష్ఠించి [1]లౌకిక వైదికసంప్రదాయములను నడపును. మఱియు సంసారాగ్నిలో దహించుకొనిపోవుచుండు జీవుల ననుగ్రహించును.)

అని యోగము ౨౬ తత్త్వముల నొప్పెననియు చెప్పెను. ఇటు లితఁడు చెప్పుటకు

'క్లేశకర్మ విపాకాశయై రపరామృష్టః పురుషవిశేష ఈశ్వరః' (౧-౨౪)

---

1. ఒకపరియే ఒకటిగాని పెక్కులుగాని శరీరముల నిర్మించి వానియం దునికిగొని అని అర్థము.

అను యోగసూత్ర మాకరము. మఱియు యోగదర్శనమ్మా పూర్వసిద్ధుం డనంబరగు హిరణ్యగర్భు నంగీకరించును. (మా. 3-౪౫-యో. ద. వ్యాసభాష్య) సాంఖ్యసూత్రమునను ఇట్టి యీశ్వరుఁడు అనఁగా బ్రహ్మాండమును సృజించువాఁడు కలడు.

> 'స హి సర్వవి త్సర్వకర్తా.' (3-౫౬)
>
> 'ఈదృశేశ్వరసిద్ధిః సిద్ధా.' (3-౫౭)

యోగదర్శనమును సాంఖ్యదర్శనమును చెప్పిన యీ యీశ్వరుఁడు జన్యేశ్వరుఁడు. దాననే అనిత్యుఁడు. కొందఱు సాంఖ్యులీశ్వరు నొప్పరు. వారు నిరీశ్వరులు. దానఁజేసి విద్యారణ్యులీ స్వల్పభేదము నాశ్రయించి, షడ్వింశుని ఈశ్వరుని విడివిడిగా చెప్పియుండనోపును.

## ౨౬ తత్త్వములు

ఇది యిటులుండఁగా భారతము సాంఖ్యముననే ఇరువదాఱు [1]తత్త్వములుగాని, యోగమున ఇరువదేనే తత్త్వములని యిటులు చెప్పుచున్నది,—

> ............యోగానాం... .....
>
> పంచవింశా త్పరం తత్త్వం పశ్యతే న నరాధిప,
>
> . ... ... ... ...

---

1. క్షరంబగు నవ్యక్తంబు దొలఁగిన పంచవింశకుం డక్షరం బనం బరఁగు నక్షరంబునకుం బరంబైనదానిం బెక్కండ్రెఱుంగరు సాంఖ్యసూత్ర దర్శకులు గాంతురు క్షరాక్షరపరంబు లప్రబుద్ధ బుధ్యమాన బుద్ధంబు లను నిర్దేశంబులు గలిగియుండుఁ బరతత్త్వనిర్దేశంబునం బొల్పు షడ్వింశకంబు బుద్ధంబును విమలంబును నప్రమేయంబును సనాతనంబునునై పంచవింశకంబును చతుర్వింశంబునుం గనుచు వెలుంగు. (శాంతి ౬-౫౬.)

బుద్ధ మప్రతిబుద్ధిత్వా ద్బుధ్యమానం చ తత్త్వతః
• బుధ్యమానం చ బుద్ధం చ ప్రాహు ర్యోగనిదర్శనమ్[1]

వావిళ్లవారి ప్రతి. శాంతి (307)

యోగులిరువదేనవతత్త్వముకంటె నింకొకతత్త్వమును చెప్పరు. స్వరూపమెఱుఁగమి బుద్ధుఁడు (పురుషుఁడు) బుధ్యమానుఁడు అనఁగా తెలియఁబడుటకు విషయమగుచున్నాఁడు. కావున యోగులు బుధ్యమానుని బుద్ధునే చెప్పుదురు. [2]అనఁగా తెలియఁబడుదానిని (అవ్యక్త), తెలిసినవానినిమాత్రమే (పురుష) చెప్పుదురు.

ఇఁక అనుశాసనపర్వ మన్ననో,—

అథ మూర్ధసు(ని) యః ప్రాణాన్ ధారయేత సమాహితః
బుధ్యమాన మవాప్నోతి ద్వ్యావస్థం న సంశయః.[3]

1. అవ్యక్తము పురుషుఁడు అను రెండుతత్త్వములనే స్వీకరించు నెడల విధినిషేధ మోక్షప్రతిపాదకమగు శాస్త్రమెవరికి? కావున జీవునిఁగూడ విడిగా నొకతత్త్వముక్రింద స్వీకరింపవలయునని యోగముదెస సాంఖ్యుల ఆరోపణ. ఇది భారతము సాంఖ్యమును తనపక్షముగాఁ జేకొని చేసిన ఆరోపణ అని వేఱ చెప్పనక్కఱలేదు. 2. తిక్కన దీనిని తెలిగింపలేదు. 3. వావిళ్ల ప్రతి. అనుశాసన. ౯౮-౧౧౦.

క. ఈ దైవతముల నన్నిఁటి, సాదరమునఁ గనుచు యోగి యచలితనిష్ఠన్
వేదమయా మూర్ధగతుం, డై దక్షత పేర్మి నిలుపుఁ బ్రాణము లచటన్.

గీ. అపుడు బుధ్యమానునిఁ గను నవ్వరిష్ఠ
తత్త్వ మవ్యక్త మందు తద్దగ్ధి యగుఁ బ్ర
బుద్ధుఁ డాతని నతని నబుద్ధుఁ డెఱుఁగు
చుండునివి యాత్మదశ లతఁ డొకఁడ యనఘ!

ఆ. క్షరుఁడు నక్షరుండుఁ బరుఁడును నందు ర
విఁనుతదశలఁ బంచవింశకుఁడు ప్ర
బుద్ధనాముఁ డతఁ డబుద్ధినిఁ గనుఁ బుర
షవిధముగను బ్రకృతి సంగ మెఱుఁగు.

క. విను షడ్వింశుఁ డబుద్ధుం, డనఁ జను వాఙ్మనసములకు నందక యుండునికిం
దనఁ గా నాతత్త్వంబుం, గనిన ప్రబుద్ధుండ యతఁడు కామధ్వంసీ!

బుధ్యమానా[1] ప్రబుద్ధాభ్యాం న బుద్ధ ఇతి పఠ్యతే
బుధ్యమాన మబుద్ధశ్చ నిత్యమేవానుపశ్యతి
వికారపురుష స్త్వేష బుధ్యమాన ఇతి స్మృతః
పంచవింశతి తత్త్వం తత్ ప్రోచ్యతే నాత్ర సంశయః.
యది బుధ్యతి చైవాయ మన్యోయ మితి భాస్వరః
న ప్రబుద్ధోఽనువర్తేత పానీయం మత్స్యకో యథా.[2]

సనత్కుమారుఁడు శివునకు యోగమును వివరించుచు ఈశ్లోకములచే బుధ్యమానుని ప్రబుద్ధుని అబుద్ధునిఁ జెప్పెను. కాఁగా యోగమునఁగూడ ఇరువదాఱుతత్త్వములు తేలినవి. ఇది పూర్వాపరవిరోధము. వావిళ్లవారి ముద్రణమున ఈయధ్యాయములు రెండు మూఁడు ప్రక్షిప్తములని తోఁచెడిని. దీనికి నీలకంఠ వ్యాఖ్య లేదు. పూనా ప్రతిలో ఈభాగము లేదు.

అనుశాసన మీయధ్యాయమునసే,—

చతుర్వింశతి మేవాత్ర కేచి దాహు ర్మనీషిణః. 27
కేచి దాహు స్త్రయోవింశం యథాశ్రుతి నిదర్శనం,
వయం తు పంచవింశం వై తదధిష్ఠానసంజ్ఞితమ్. 28
తత్త్వం సమధిమస్యామ స్సర్వతంత్ర ప్రలాపనాత్. 29

క. అరయఁగఁ దత్త్వము లనునవి
యిరువదినాల్గండ్రు కొంద ఱిభదనుజహరా
యిరువదిమూఁ డనుటయుఁ గల
దిరువదియే నండ్రు వానికే యెట్లన్నన్. (అను. ౪-౧౭౩.)

1. ప్రబుద్ధ అని పాఠాంతరము. దీనికే తిక్కన తెలిఁగింపు అనుగుణము. 2. తెలిఁగింపులో అబుద్ధుఁ డని యుండుటవల్ల పాఠాంతరమేదో ఇచట నుండియుండును. చూ. అను. ౪-౨౦౦, ౨౦౧.

అనియు, శాంతిలో,—

'ఆత్మానం బహుధా కృత్వా తాన్యేవ ప్రవిచక్షతే.' (౩౦౮-౧).

ఆత్మను మాయచే విశ్వతైజసప్రాజ్ఞ విరాట్సూత్రాంతర్యాములనుగా విభజించి, విభజించిన ఆరూపములనే తత్త్వములనుగా చూతురు. కాని ఆత్మ ఒకటే తత్త్వము.

అనియు,

'ప్రబుద్ధులగు సాంఖ్యులును యోగులును బుద్ధికిం బరంబై పంచవింశతి తమంబైన యాతత్త్వంబు నాలోకింతురు ... (౬-౩౪.)

అనియు చెప్పుట సాంఖ్యయోగవేదాంతదర్శనములను సమీక్షించుటకని తోచును. ఈదిగువ కోష్ఠకముచూచిన నిది తెల్లము.

| ఉపని | క్షర | అక్షర | అన్య |
|---|---|---|---|
| గీత | క్షర | అక్షర | పురుషోత్తమ |
| శాంతి (సాంఖ్య) | బుధ్యమాన (అవ్యక్త) | అప్రబుద్ధ | బుద్ధ |
| ...(యోగ) | బుధ్యమాన | — | బుద్ధ |
| అనుశాసన | బుధ్యమాన | ప్రబుద్ధ | అబుద్ధ |
| సాంఖ్యదర్శన | అవ్యక్త | — | పురుష (జీవ, ఈశ్వర) |
| యోగదర్శన | ... | — | ... |

'సీ. ప్రకృతియుం గుణములు ప్రకృతి జన్యంబగు
వికృతి సప్తకమును విను వికార
ములు పదియాఱును నై కలిగిన యాప్రోవు
మాధవ ! నీస్థూలమహిమ వీని

కలిరిత్తుఁ డిరువదే నవు తత్త్వ మీ వని
సాంఖ్యులు సూక్ష్మదర్శనులు బుద్ధిఁ
గని చెప్పుదురు .................'

(హరి. ఉ. ౬-౭౫)

అని వ్రాసియు; ఎఱ్ఱయ యీ ౨౬ వ తత్త్వమును ఆనుశాసనిక పర్వమునుండియో పురాణాంతరమునుండియో గ్రహించి యుండును.

## నానుడ్లు

తెలుఁగువారితోఁ బుట్టిన నాను డ్లెఱ్ఱయనోట నీట మొలచిన తామరవలె, మనోహరముగా నుండును. ఈ దిగువ నుదాహరించిన సామెతలనుమణులతో తాపటము చేసిన ఆ యా పద్యములను జదివినచోఁ బ్రకృతార్థమున కవి ఎంత నైగనిగ్యము కూర్చెనో స్ఫుటము కాఁగలదు.

'కుంటలోఁ దామర మొలచిన క్రియ.' 3-127.
'బలియుం డింట బానిసనైనఁ దెలుప వెఱతురు.' 3-47.
'ముఁ దేండ్ల లేని సద్బుద్ధి ముప్పదేండ్ల లేదు.' 3-151.
ఒక గడ్డు మఱిగిపో నేమి యగున్?' 4-25.
'నిప్పునఁ జెద లంటునె?' 4-32.
'నోరు మూయఁ బెదతల వ పోయెదు.' 4-37.

## భాషా జాతీయములు

ప్రతిభాషయందును జాతీయపదములు కుప్పతెప్పలుగా నుండును. కవులు సంగ్రహించినవి కడుఁగొలఁది. గొప్ప కవులు ప్రకరణానుగతములయినవానినిమాత్రమే వాడఁగలరు గదా. ఇవి భాషకు ప్రాణమువంటివి. వీని కొక నిఘంటువు

వ్రాయుట ఆవశ్యకము. నన్నయ తిక్కనలవలె నెఱ్ఱయకూడ వీని నచట నచటఁ జక్కఁగా వాడెను.

| | |
|---|---|
| 'సాలు కాదునే ?' | 2-28. |
| 'మాకు దిక్కు' | 3-50. |
| 'వాఁడు నాకు, వానికిఁ గలనేను.' | 3-56. |
| 'అమ్ముడు వోయినట్లు' | 3-62. |
| 'కులవల మొక్క దైవమునకు నెక్క ననఁగ.' | 3-75. |
| 'విల చెడిలి రోరి.' | 4-15. |
| 'పాపు మడిసె.' | 4-28. |
| 'చే చఱచికొంచు.' | 4-170. |
| మీఁదికి మూరెఁడు వేర్చి | 5-95. |

## ప్రయోగవిశేషములు

'కనినకంటె 3-138. చెప్ప ననియె నిదె యొజ్జలు 4-13. అతని మచ్చరంబునఁ గన్నదియ తలఁపఁ జేలమో 5-28. తా రొకరులఁ గోరరు 5-56. ఏల కలుగఁడు 2-30. ఒలసిన నరు గొంత కాల మునికియు 4-64. మాన్పఁగల యంతయు నింకను నాఁడి చూతమే .5-7. ఇంతమాత్రమునకు 1-93. ఎందేని. ప్రకృతి సత్యములు కరణి......అట్టి యంభోధి 1-25. ఇది నన్నయ వాడుక.

ఉ. ఇంబుగ సర్వలోక జను లెవ్వనియేని ముఖామృతాంశు బిం
బంబున నుద్భవంబయిన భారత వాగమృతంబు కర్ణరం
ధ్రంబను నంజలిం దవిలి త్రావుదు రట్టి మునీంద్రలోక వం
ద్యుం బరముం బరాశరసుతుం బ్రణమిల్లి కరంబు భక్తితోన్.

ఆది. 1-76.

ఈ 'ఎందేని, ఎవ్వనియేని లోని ఏని అట్టి,' శబ్దములు నిత్య సంబంధము కల యత్తచ్ఛబ్దములవంటివి. ఇట విశేషము అను ప్రయుక్తమగు 'ఏని.' చూ.

వ. ఎయ్యేని వేల్పు నాహ్వానంబు సేసెద నవ్వేల్పు.' అర.7-324.

ఇందులకు భిన్నముగను నన్నయ వాడెను.

వ. 'ఎందేనినుండి యొక్క మహామహుండు...వచ్చి' ఆది. 3-130.

ప్రశాస్త్రి. 4-14.

దేవబలంబు సిద్ధంబగుట యవలంబింపవలయుట నాకుం దోంచిన కర్జంబు.

2-138.

## దోషాభాసములు

సీ. 'ఏను దియ్యమున నటించిన' - ౧

అనునెడ ఇంచు గాగమ యతియు,

క. ఆదియు మహామయు.........ఎఱుఁగం

3. గాఁ దరము/గాదు...... 1-39.

క. ఆదేవు దివ్యమహామం... ..ఎఱుఁగం

4. గాఁ దరమె...... 1-64.

మ. 'ఓం । డోకటక్...రిపులక్ ఘోరాజి'

ఈ యతులును.

ఉ. పీఁపున నబ్ధి నొక్క పృథివీధరముం దగ నుండా ల్చె నంచులక్ష్మిపతి. 4-181.

అను పద్యములందు ప్రాససాంకర్యమును

క. వేదములాదిగఁ గల యష్టాదశవిద్యలకు నీవ స్రష్టవు కర్తవ్

బోధకులును ...... 3-30.

అను పద్యమున దధ ప్రాసమును

'పద్మజాతు' 2-28.

అనునెడ నగాగమాభావమును చూపట్టును. ఇవన్నియును నన్నయకును తిక్కనకును సమ్మతములే. 'ఉ. కాదన కిట్టిపాటి' అను నన్నయ పద్యమున సంబోధనమును సంబోదనముగా మార్చి, బుధధాతు ల్యుడంతమని సమర్థించువారు ఈపద్యము నందలి 'బోధకులు' గమనించి సింహావలోకనము చేసికొనవలసి యుందురు. కానినాఁడు దీనిఁగూడ బోదకులుగా దిద్దవలసి యుందురు.

క. ఆపన్నగముఖ్యులఁ దన, వీఁపునఁ బెట్టుకొని కఱచె విపినములు మహా
 ద్వీపంబులు గిరు లలఘుది, శాపాలపురములు చూపెఁ జని యాతనికిన్.
 ఆది. 2-42.

క. ఆదశరథసూనుండు వ, గాధిజలం బింకఁ జేసి యొకశరమునఁ గ్ర
 వ్యాదవిభుఁ దునిమి సీతను, మోదంబునఁ జేకొను సురపుంగవు లెన్నన్.

ఎఱ్ఱాప్రెగడ సంక్షేపరామాయణము అని ఆనందరంగ రాట్ఛందము (పుట. 82. 3 ఆ. 65.) ఈ ప్రాసములఁ జూచునది. మఱియు రంగరాట్ఛందప్రామాణ్యమునెడ శోధకుల అభిప్రాయ మును గూడ గమనించునది.

'మందా. వేలాక్రాంత త్రిభువన మహా ద్విద్విష ల్లక్ష్మ'......4-188.
'సుమహాత్' ఆరణ్య. 5-355, 6-1.

అను ప్రయోగములు

'సుమహాదుపనిషత్ ప్రస్తుత్యభిశ్రావ్య సేవ్యా' (మహాప్రస్థాన.) 1-79. అను తిక్కన ప్రయోగమును తలఁపునకుఁ దెచ్చుచున్నవి. మఱియు

'అట్టి క్రూరమునకు నట్టి ఘోరమునకు' 4-121.
'ఏని మనోగతమునం దవిలిన దైవము' 5-6.
'పతి రహితంబు దుస్సహము' ఆరణ్య. 5-307.
'అవగతమునఁ బడ' 7-249.

అను నీ ప్రయోగములు చూపట్టును. ఇట్టివి తిక్కనలోను.

'సాత్యకి సమేతంబుగా శౌరియు' శాంతి. 1-371.

'సహాయుండు నొల్లక' శాంతి. 3-33.

'శాంతము ధర్మ ప్రచయం బగుటకై' „ 5-186.

ఉన్నవి. ఈ ధర్మ ధర్మి వ్యత్యయాదులు తెలుఁగునాట శిష్టజన వ్యవహారములో నున్నవి.

తపోగ్రత.—

ఇచట 'పరార్ధాగ్ర ప్రాగ్రహర ప్రాగ్ర్య గ్ర్యాగ్రీయ మగ్రియమ్' అను అమరమునుబట్టి తపమున ఉత్కర్ష మొందినవానిధర్మము అని అర్థముచెప్పి పదసాధుత్వము సాధింపనగునుగాని—"కములిన శౌత్తమ్మి' కనుగుణముగా అర్థమమరదు. కాన 'సకారాంతము లకారాంతములును అగును' అను మతమవలంబించి ఎఱ్ఱయ తప+ఉగ్రత అని గ్రహించియుండును - చూ - తపోగ్రత - 225 పుట - భారతమునఁగూడ నితఁడు —'సమ్యగ్యశశాలి' అరణ్య-౬-౯౨. అని యశశ్శబ్దమును అకారాంతముగా ప్రయోగించెను.

### కారక విశేషములు

'ఎవ్విధంబునందైన'
'............విమథతుణంబునం
దమృతముకంటెఁ బ్రీతికరమయ్యె' 4-83.

'మేడమీఁ దెడలెడు' 3-134.

'ఆత్మవిద్యకు నొడవఁదొడఁగినాఁడ' 4-162.

'విడిపించు పనికినై యొదవి యుత్సహించి యున్నవాఁడు' అరణ్య. 6-349.

'శిశగిరి ఉపాంతమువలనం గదలి' 2-19.

ఇట్టివి నన్నయ తిక్కనలందును గలవు. ఇవి వైయాకరణులకు సుపరిచితములే. నాఁటికిని నేఁటికిని కారకమునఁ గలిగిన పరిణామమును పరిశీలించుటకు వీని నుదాహరించితిని. ఎఱ్ఱయ ఆరణ్యము

నందును హరివంశమునందును కనుఁగొనవలసిన భాషావిశేషములు బహుళములు.

## స్వసంవాదములు

'స్ఫుర దరుణాంశు రాగ రుచి సూరిలఁ బర్వఁగ' 2-73.

'స్ఫుర దరుణాంశు రాగ రుచిఁ బొంపిరి వోయి ఆరణ్య. 4-148.

క. వెఱగువడి హార్ష రాగము, దఱిగిన వదనములు వెల్లఁ దనము గదుర వి
ట్టఱ మూర్ఛ మునిఁగి యయ్యు, ద్దఱు నిలిచిరి వేత్రదండ తాడిత తనులై.
1-91.

క. వెఱగుపడి హార్ష రాగము, దఱిగిన వెలవెల్లనై వదనములు వ్రాలం
బెఱఁగేది ఱిచ్చపడి ర.త్తఱిఁ దత్పరిజనము లెల్లఁ దద్దయు వంతన్.
ఆరణ్య. 7-159.

సీ. మెచ్చక యెనుకైన మృత్యువు మెడఁ ద్రొక్కి
క్రొవ్వాఁడి కోఱలు త్రెవ్వరాచి— 2-119.

సీ. మెచ్చక యెదురైన మృత్యువు మెడఁద్రొక్కి
క్రొవ్వాఁడి కోఱలు త్రెవ్వఁదాఁచి— హరి. పూ. 4-155.

క. శిత ఘారసింహ నఖరా, హత దైత్య మహీప సూకవాంగుఁ ద
ర్పిత యయ్యో ననఁగ బరిశాం, తత నొందఁ ద్రిలోకపీడ తత్క్షణమాత్రన్.
5-107.

ఈపద్యమే సరిగా హరివంశమున పూర్వభాగము 4-39లోఁ గలదు.

ఈ కబ్బమున ద్వితీయాశ్వాసమునందుఁ గల 'తపములఁ గ్రుస్సిన తపసులఁ బట్టి తెప్పించి యచ్చరలతోఁ బెండ్లిసేయు' అను పద్యము శ్రీనాథునిదిగా హరవిలాసమునందు ముద్రితమైనది. ఈపద్య మెట్టిదో శ్రీనాథునితో నూహింపవలసి యున్నది. ఈ క్రింది పద్యమునకు దిగువ నుదాహరించిన శ్లోకము ఆకరముగాఁ గానిపించెడిని—

క. దైవాధీనము త్రిజగము, దైవము తన్మంత్రవశము తన్మంత్రము భూ
దేవతల చేతిదగుటను, దైవములకు దైవతములు ధరణీ దివిజుల్. 1.99.

దైవాధీనం జగత్సర్వం మంత్రాధీనం తు దైవతమ్
తన్మంత్రం బ్రాహ్మణాధీనం బ్రాహ్మణో మమ దేవతా.

ఇఁక నా శుష్కవాక్యముల కట్టిపెట్టెదను. నన్నయ తిక్కన లలోఁ జేరుటకు,—

ఉ. మించిన వేడ్క వీనులకు మిక్కుటమై మధువృష్టి గ్రమ్మ రా
యంచలు గూయఁ గ్రౌంచమును నావలఁ గూయఁగడంగు భంగిఁ బ్రా
ఘాంచిత శబ్దసారులు మహాకవు లాద్యులు కావ్య శయ్యఁ గ్రీ
లించిన కీర్తి సంగ సుఖలీలకు నేనును గాంక్ష చేసితిన్. (లక్ష్మీ. 1-13.)

అని జంకినటులు వినయము చూపి వారి కొఱంత దీర్చిన ఎఱ్ఱాప్రెగడ మధుమయఫణితుల నిఁకఁ జదువుఁడు.

చిరివాడ
కృష్ణాజిల్లా.
19-1-53

వేలూరి శివరామశాస్త్రి.

శ్రీ ర స్తు

శ్రీలక్ష్మీనృసింహావతార మను

# నృసింహపురాణము

## పీఠిక



కి నిరంతరంబు కడుఁ జెన్నెసలారెడు రాగలీలను
త్సేకముఁ బొంది యొప్పుతనచిత్తముఁ జూ
పెడుమాడ్కి నిత్యర, మ్యాకృతి యైనకౌస్తు
భము నక్కుపయిం బచరించునుత్తమ, శ్లోకుఁ
డహోబలేశుఁ డతిలోకుఁడు లోకముఁగాఁచుఁ
గావుతన్. 1

ఉ. చందనచారుపత్రకము సంస్తుతకౌస్తుభకర్ణికంబు న
[1]స్పందితలాంఛనభ్రమరసంగమనోజ్ఞము నైనయట్టి గో
విందునురస్తలంబ యరవిందముగా నొగియించియున్న య
య్యిందిర సూచు గాతఁ గృపనింపగుచూపుల భక్తసంతతిన్.

ఉ. గద్దియయైనతమ్మివిరి కమ్మని తావికిఁ గ్రమ్ముతేఁటు లే
ప్రొద్దును మ్రోయు చందమునఁ బ్రోడలు శిష్యులుగూడి [2]చ
ట్టులన్, బెద్దయెలుంగునం జదువఁ బేర్మి యెలర్పఁగ నొప్పువే
లుపుం, బెద్దనయంపుమత్కృతి కభీష్టచిరస్థితిదాయిగావుతన్.

---

1. స్యందిత. 2. చట్టులు.

చ. వఱలు జటాటవిం గుసుమవల్లరులై చదలేటినీటి నె
త్తఱుల జనించు క్రొన్నురువుతండములై తలఁజుట్టుపాము మే
నఱువుడుఁ గుప్పసంపుఁబోరలై చెలువార శివేందుచంద్రికల్
నెఱయఁగఁ బ్రోచు మన్ముఖమనీషితకావ్యకళాకుముద్వతిన్.

చ. తనరఁగ గ్రుచ్చి యంబిక ముదంబునఁ గౌఁగిటఁ జేర్చుచోఘన
స్తనయుగకుంభయుగ్మములు దార్కొని యొప్పునకై యసూ
యమైఁ, జెనకి పెనంగ నొండొకటిఁ జేరినలాగున నుల్లసిల్లఁ
బెం, పెనసినవానిఁ బ్రీతినుతియించెద నేనిక మోము వేల్పునన్.

చ. కరకమలం[2]బునందుఁ బటికంపుఁగమండలు [3]వచ్ఛకాంతి భా
సురమగు మౌక్తికంపుజపసూత్రముదాల్చుట, బ్రహ్మవా[4]దియై
పరఁగినహంసముం బిలిచి బాలమృణాళముఁ జూపుచంద[5]మౌ
[6]సిరిఁ దిలకింప నొప్పుబుధసేవితమూర్తిఁ దలంతు భారతిన్.

ఉ. వీనులతేనెలై కురియ వింతగు కావ్యరసంబు గ్రోలి య
మ్మానవకోటికిం బళుపమానత మానఁగఁ జేసె నెవ్వఁ డ
వ్వానికి నీడు లేరు మునివర్గములోపల నమ్మహాత్ము మే
ధానిధి నాద్యరాఘవకథానిధికీర్తిధురీణుఁ గొల్చెదన్. 7

ఉ. వేదము నచ్చుకట్టి శ్రుతివీథులతత్త్వముఁ బట్టి చూచి య
వ్వేదముకంపు [7]వీథులకు వెగ్గలమై నిగుడంగఁ బాఱు నా
మోదము [8]వెల్లిఁ గొల్పి యనుమోదితకీర్తులమిన్ను దాఁకు న
య్యాదిమపండితుం గొలుతు నచ్యుతమూర్తిఁ బరాశరాత్మజున్.

ఉ. భాసురభారతార్థములభంగులు నిక్క మెఱుంగ నేరమిన్
[9]గాసటబీసటే చదివి గాథలు ద్రవ్వ తెనుంగువారికిన్

---

1. తేండు. 2. బొసంగ. 3. వంటి. 4. దమై. 5. మై. 6. సిరితిలకించ
7. వింపున. 8. తెల్ల 9. గాసట బీసతే.

వ్యాసముని ప్రణీతపరమార్థము తెల్లఁగఁ జేసినట్టియ
బ్జాసనకల్పులం దలఁతు నాద్యుల నన్నయతిక్కనార్యులన్.

క. వెండియుఁ దొల్లిటి యిప్పటి
పండితుల మహాకవిత్వపదవీగరిమా
ఖండితుల నతుల తేజో
మండితులఁ దలంతు నిండుమనమున నెపుడున్. 10

ఉ. యామము లెన్మిదింట నియతాకృతిఁ [1]బ్రత్యహముక్ శివా
ర్చనా, రామత యొప్ప నిత్యశివరాత్రి వ్రతంబుగఁ బూని
భవ్యయో, గామృతతృప్తి మైఁ ద్రిజగదర్చితలీలఁ దనర్చు
శంకర, స్వామి[2]మునీంద్రు భక్తజనవత్సలు మద్గురు నాశ్ర
యించెదన్. 11

వ. అని యీక్రమంబునఁ బ్రధానదేవతాసంకీర్తనంబును మహా
కవిజనప్రార్థనంబును సద్గురుచరణానుస్మరణకీర్తనంబును సమ
ర్థించి కృతార్థతం బొంది కతిపయాక్షరపరిగ్రహజనితం బైన
నైసర్గికచాపలంబుకతంబున. 12

ఉ. మించినవేడ్క వీనులకు మిక్కుటమై మధువృష్టి గ్రమ్మ రా
యంచలు కూయఁ గ్రౌంచమును నావలఁ గూయఁ గడంగు
భంగిఁ బ్ర, ధాంచితశబ్దసారులు మహాకవు లాద్యులు కావ్య
శయ్యగీ,లించిన కీర్తిసంగసుఖలీలకు నేనును గాంక్షఁ జేసితిన్.

వ. ఇట్లు మహాప్రబంధకల్పనా కుతూహలాయత్తంబగు చిత్తం
బుతో నొక్కనాఁడు తదనుసంధానానుబంధసమాధినిమీలి
తేక్షణుండ నై క్షణం బున్నసమయంబున. 14

---

1. ప్రత్యయముక్. 2. మునీంద్ర.

సీ. ప్రజ్ఞాపవిత్రుఁడా పస్తంబసూత్రుండు
శ్రీవత్సగోత్రుఁ డూర్జితచరిత్రుఁ
డగుబొల్లనకుఁ బోలమాంబకుఁ బుత్రుండు
వెలనాటిచోడనివలన మిగుల
మన్నన గన్నభీమనమంత్రిపౌత్రుండు
పేరమాంబామనఃప్రియుఁడు పోత
మాంబికావిభు సూరనార్యు మజ్జనకుని
బొల్లధీనిధికిని *బోలనకును

గీ. జన్ననకు ననుజన్ముని గన్నతండ్రి
వేఁగినాఁటఁ [1]గరాపర్తివృత్తిమంతుఁ
డనఘుఁ డెఱపోతసూరి కంసారిచరణ
కమలమధుకరపతి సారవిమలయశుఁడు. 15

వ. మదీయభావంబున నావిర్భావంబునొంది సదయానందమధుర వాక్యంబుల నన్ను నిట్లని యనుగ్రహించె. 16

ఉ. ఉన్నతసంస్కృతాదిచతురోక్తిపదంబులఁ గావ్యకర్తపై
యెన్నికమైఁ బ్రబంధపరమేశుఁ డనంగ నరణ్యపర్వశే
షోన్నయమంధ్రభాష సుజనోత్సవ మొప్పఁగ నిర్వహించితా,
నన్నయభట్టతిక్కకవినాథుల కెక్కినభక్తి పెంపునన్. 17

క. గిరిశపదభక్తిరసత
త్పరభావము కలిమిశంభుదాసుం డనఁగా
[2]బరఁగియు గోవిందగుణా
దరసంభృతసౌమనస్యధన్యుఁడ వెందున్. 18

---

* బోలమ. 1. కరావర్తి. 2. పరగిన.

క. గురుభజనపరాయణుఁడవు
సరసబహుపురాణధర్మశాస్త్రకథావి
స్తరవేదివి వినయోదయ
భరితుఁడ వతులానుభావభవ్యుఁడవు మహిన్. 19

క. కావునఁ బ్రబంధరచనా
[1] ప్రావీణ్యము నీకు సహజపరిణతసిద్ధం
బై వెలసినయది యొకకృతి
గావింప జగద్ధితంబుగా నే బనుతున్. 20

ఉ. శ్రీమదహోబలేశనరసింహుఁడు నాప్రియదైవతంబు, మ
త్స్వామి, తదీయతీర్థవిభవంబును దన్మహితావతారముల్
నీమధురోక్తిగుంభన మనీషులు మెచ్చఁగఁ బ్రస్తుతింపు నీ
కేమెయి సంభవించు నఖిలేప్సితపుణ్యఫలోదయోన్నతుల్.

తే. అనినఁ బులకలు మై జాదుకొనఁగ నపుడు
మనసు వికసిల్లఁ గనువిచ్చి మహితలీల
నద్భుతానందరసమూర్తినై తలంపు
తద్గతంబుగ ధన్యత తలకొనంగ. 22

క. ఇది యీశ్వరానుశాసన
ముదయోన్ముఖ మయ్యె నాకు నూర్జితశుభసం
పద నొనరింతుఁ బ్రబంధము
సదయన్నృసింహావతారసంస్తవసరణిన్. 23

చ. ననుఁ దనపేరివాఁ డని మనంబున నెప్పుడు నాదరించుటల్
బనిచె గుణప్రసిద్ధియును భవ్యసమృద్ధియుఁ జేరుపుణ్యపుం

1. ప్రావీణ్యత.

బని యంట మత్పితామహుండు ప్రాక్తనసంయమితుల్యవర్త
నుం,డనఘయశుండు పూర్ణపురుషాయుషజీవితధన్యుఁ డిమ్మ
హిన్. 24

తే. అమ్మహాత్ముఁడు నిత్యదయార్ద్రహృదయుఁ
డతులితానందజలధి నోలాడుఁగాత
విష్ణుధర్మప్రశంసాపవిత్ర మైన
యస్మదీయప్రబంధసామగ్రి వలన. 25

శా. ప్రాజ్ఞప్రస్తుతభవ్యభోగవిభవస్ఫారాత్ముఁ డారాధ్యస
ర్వజ్ఞుం డప్రతిమాద్భుతోభయకవిత్వ[1] ప్రౌఢశబ్దార్థయో
గాజ్ఞాసిద్ధిఘనుండు మజ్జనకుఁ డుద్యత్కీర్తి శ్రీసూర్యుఁ డీ
విజ్ఞానాత్మకవాఙ్మయంబున ముదావేశోజ్జ్వలుం డయ్యెడున్.

వ. ఈనిశ్చయం బిట్టిది కావున బ్రహ్మాండాదిపురాణోక్తం బయిన
శ్రీనరసింహావతారం బను పురాణంబుఁ దెనుంగుబాసఁ
బ్రకటింపవలయు నమ్మహాప్రబంధంబునకు నస్మత్పితామహ
హృదయగుహావిహార మహాసింహం బగుశ్రీమదహోబల
నరసింహదేవుం డధీశ్వరుం డగుటంజేసి యవ్వాక్యరత్నరచ
నోపహారంబుల నమ్మహాదైవతంబు నారాధించితి. 27

చ. కృతికివిభుండు శ్రీవిభుఁడు, కీర్తన పావన మైనతద్గుణ
స్తుతికృతి, విష్ణుదాసులు యశోనిధు లూర్జితపుణ్యుఁ లుత్త
ముల్, కృతిఁ గొనియాడువారు కృతకృత్యుఁడనైతి మదీయ
వాంఛిత, ప్రతతికిఁ జెందఁ గల్పతరుపాకము శ్రీకరకావ్య
రూపతన్. 28

1. ప్రౌఢి.

వ. అని యుత్సాహంబు మిగులం జిత్తంబును వాగ్వృత్తంబును నుత్తమశ్లోక సంకీర్తన రచనాయత్తంబు లగుచుండ సత్యోదాత్తభక్తిప్రయుక్తోల్లాస భాసితుండనై కృతిఁ జేయం దొడంగి. 29

షష్ఠ్యంతములు

క. శ్రీమదహోబలతీర్థ
స్వామికి శరణాగతప్రసన్నునకుఁ గృపా
ధామునకుఁ బ్రణామజన
కామితఫలదునకుఁ బరమకల్యాణునకున్. 30

క. లక్ష్మీవల్లభునకు శుభ
లక్ష్మోజ్జ్వలవత్మునకు నలభ్యాప్తవచ
స్సామ్రాజ్యార్థరూపునకు భవ
యక్ష్మ నిరసనైక నిరుప మౌషధమునకున్. 31

క. నిత్యవివేకాపేక్ష ని
రత్యయతత్త్వనకు నిరుపమా[1]సత్త్వనకుఁ
సత్య ప్రహ్లాద వచః
ప్రత్యయసిద్ధునకుఁ బరమ పరిశుద్ధునకున్. 32

క. ప్రసభసభాస్తంభారణి, విసృమరతేజోగ్నిమఖహవిర్భాగకళా
రసికాసురపశుయజనో,ల్లసనసుసంతర్పితాఖిలనిలింపునకున్.

క. కంసారికి నాత్మేచ్ఛా
సంసారికి మౌని మానస స్ఫుటకేలీ
హంసమునకు దైవకులో
త్తంసమునకు దళితకలికి దండితబలికిన్. 34

1. సకు.

క. ఆధారవీథి పథికా
రాధితున కగాధమధ్యరంధ్ర సుధా ధా
రాధౌత ప్రస్రుమరధా
రాధరధామ్యాంగునకు ధరాభరణునకున్. 35

క. భీమానుజవరదునకును
రామానుజవరదునకు శరణ్యునకును సు
త్రామాను[1] ప్రభువునకును
రామాను[2] ప్రభవునకుఁ బురాతనమునికిన్. 36

క. భవనాశనీ మహా న
ద్యవగాహనవిమలబుధ జనాంతఃకరణ
వ్యవసితసులభున కురుతర
[3]భవనిజసింహత్వదళితభవకలభునకున్ 37

క. గరుడాచలాంచలోజ్జ్వల
గరుడాసీనునకు సిద్ధగరుడామ[4]రకి
[5]న్నరమిథున ముఖోద్గీత
స్ఫురదపదానునకు నిత్యశుభధామునకున్. 38

క. పారాన్వయధీవిద్యా, పారలసత్పుత్త్రపౌత్త్రసంపద్గుణసం
భారమదీయహితార్యో. దారపరిజ్ఞాతకల్పతరుఫలమునకున్.

క. జ్ఞానబలశౌర్యసుఖసం, తానైశ్వర్యాదివిభవదాయిదయావి
ద్యానిత్యశ్రీఘునునకు, శ్రీనరసింహునకు భక్తచింతామణికిన్.

---

1. ప్రభువు. 2. ప్రభువు. 3. భవనజ. 4. రకి. 5. నరసఖమిథు
నోద్ధతివి.

# ప్రథమాశ్వాసము



## కథాప్రారంభము

వ. ఏను విన్నపంబుసేయం గలలక్ష్మీనరసింహావతారం బనుపురాణ
కథకుఁ బ్రారంభం బెట్టిదనిన నిఖిలభువనపావనం బైన నై
మిశారణ్యంబునఁ బుణ్యాత్ము లగు మహర్షులు హర్షోత్కర్షం
బున రోమహర్షణుం డనుపౌరాణికునివలన నఖిలపురాణేతి
హాసంబులు పరిపాటి వినుచుండి బ్రహ్మాండపురాణంబునఁ దీర్థ
భాగశ్రవణంబు సేయుసమయంబున నతికుతూహలోన్మీలిత
మానసు లై యతని కి ట్లనిరి. 1

క. ఏతీర్థము కలియుగమున
భూతాభయదాన చతురపుణ్యోన్నతి ను
ద్ద్యోతించు మునులు దివిజులు
నేతీర్థమునందుఁ బాయ రెన్నండెలమిన్. 2

శా. ఏతీర్థంబున సర్వకాలమును సర్వేశుండు సర్వాగమా
మ్నాతస్ఫీతయశుండు శ్రీవిభుఁడు ప్రేమస్థేమమై దాను న
బ్జాతావాసయు నిత్యవాసరుచిరై భాసిల్లు నొం డెద్భుటం
జేతోవృత్తి గణింపనొల్లక జగజ్జేగీయమానస్థితిన్. 3

శా. ఏతీర్థంబుఁ దలంచువారు వినువా రీక్షించువా రెప్పుడుం
బ్రీతిం గూడి భజించువారు దురితాపేతాత్ములై యొయ్యెడం

[1]పీతాతంకమతిం దనర్తురు జగద్విఖ్యాతకీర్త్యుజ్జ్వలం
బేతీర్థంబు పురాణయోగివిదితం బేతీర్థ మూహింపఁగన్. 4

శా. ఏతీర్థంబు సమస్తతీర్థతిలకం బిష్టార్థసిద్ధిప్రదం
బేతీర్థంబు సమగ్రవైభవశుభోపేతప్రభూతోదయం
బేతీర్థంబు విముక్తిసాధనగృహం బేతీర్థ మిరపారఁగా
నాతీర్థం బెఱిఁగింపు మాకుఁ బరమోదాత్తప్రబంధోక్తులన్.

క. అని ప్రార్థించిన మునులకు
వినయావనతాంగుఁ డగుచు విశ్రుతవాణీ
ఘనుఁ డధికబోధనుం డి
ట్లను బుధహర్షణుఁడు రోమహర్షణుఁ డెలమిన్. 6

ఉ. ఈగుణకోటియంతయును నెక్కడ[2]నొక్కెడఁ గల్మి దుర్లభం
బాగమసిద్ధమై మునిగణార్చితమైన రహస్య మేను వి
ద్యాగురుఁ డైనమద్గురుముఖాంబురుహంబునఁ గంటి నిప్డు త
ద్వాగభిరూపితార్థము భవద్వచనంబుల కుత్తరం బగున్. 7

సీ. ప్రోగులై యెందును బోఁ గేర్పడక యున్న
శ్రుతు లన్నియును నోజ సూత్రపఱిచె
ముఖ్యశాస్త్రంబుల మునికోటిఁ జదివించి
యెల్లచోటుల వెలయింపఁ బనిచె
నాదిపురాణంబు లయ్యైమతంబుల
పేళ్లు పెట్టియు నిరూపించి నిలిపెఁ
బంచమవేదమై పరఁగుమహాభార
తముఁ జేసి పురుషార్థసమితిఁ బ్రోచెఁ

1. పీతాతంకమతిన్. 2. నొక్కడ.

గీ. బుట్టినప్పుడె సంసృతిపాలము [1]విప్పు
నట్టియొలుకను బుట్టినపట్టిఁ గనియె
నెవ్వఁ డట్టిమద్గురు నుతియించి భక్తి
విష్ణుమాహాత్మ్యకథ లెల్ల విస్తరింతు. 8

వ. సమాహితహృదయులరై వినుండు. 9

ఉ. సంతతపుణ్యవర్తనుఁడు సద్గుణసంవృతకీర్తనుండు ని
శ్చింతమనస్సరోరుహావశీకృతకృష్ణుఁడు [2]వీతతృష్ణుఁ డా
క్రాంతనియత్యపేలవుఁడు గాలవుఁ డన్ముని తీర్థసేవనా
త్యంతికభక్తి మేదినిఁ బ్రదక్షిణవృత్తిఁ జరించె నెల్లెడన్. 10

సీ. అర్థి గంగాద్వార మాడెఁ బుష్కరములు
గనియెఁ [3]గురుక్షేత్రమునఁ జరించెఁ
గాశికిఁ గొనియాడెఁ గాశి వసించెఁ బ్ర
యాగంబు సొచ్చె గయావటమున
నిలిచె, గంగాపయోనిధిసంగమముఁ జూచె
శ్రీపురుషోత్తమసేవఁ జేసె
సింహాచలం బుపాసించె, గోదావరీ
కృతగాహనుం డయ్యెఁ గృష్ణవేణిఁ

గీ. దఱిసె శ్రీవేంకటాచలస్థాయిఁ గొలిచె
సహ్యజావేణిఁ దోఁగె. దత్సవిధసీమ
సప్తసాలాంతరశయాను సరసిజాక్షు
రంగనాథుని నెఱిఁగె శుభాంగుఁ డగుచు. 11

వ. ఇట్లు పరిపాటిం బ్రసిద్ధంబు లగుతీర్థంబు లాడుచు మఱియును.

---

1. గప్పు. 2. వీతకృష్ణు. 3. హరిక్షేత్రమున.

క. గోకర్ణము [1]సహ్యాద్రియు
శ్రీకుల్యముఁ బుష్పనగముసిద్ధాచలముం
లోకనుతుఁడు చూచుచు ల
క్ష్మీకలిత మహాబలంబుఁ జేరెం బ్రీతిన్. 13

క. అందు భవనాశనీనది, నందనదళితారవిందనవమకరంద
స్యందమదవదిందిందిరఁ,జందనచంద్రాంశువిశదసలిల భజించెన్.

వ. తదనంతరంబ. 15

ఉ. ఆమునినాయకుండు వినయానతుఁడై కొలిచెం జగత్త్రయ
స్వామిఁ బ్రసన్నభక్తి[2]మయవాఙ్మయుఁ గామితభక్తలోకర
త్నామణి సర్వదైవతశిఖామణి శ్రీనిధి సత్కృపానిధిం
శ్రీమదహోబలేశ్వరుఁ బ్రసిద్ధమహత్త్వజితాఖిలేశ్వరున్. 16

వ. ఇవ్విధంబున శ్రీనరసింహాసందర్శనం బొనరించి కృతార్థుండై యచట ననేకమునిమహర్షిమధ్యంబున మధ్యందినదినకరాను కారి యై తేజరిల్లువాని శ్రీమన్నారాయణచరణైకభావు దేవ శ్రవుం డనుమునిపుంగవుం గనుంగొని నమస్కరించి యతని చేత సంభావనంబు వడసి యాసీనుం డై [3]యమ్మహాత్ముండు వివరించు నచ్యుతమహిమాత్మకంబు లగుపుణ్యకథనంబు లాకర్ణించుచుఁ గృతాంజలి యై యిట్లనియె. 17

క. చూచితి ననేకతీర్థము
లీచందముపుణ్యతీర్థ మే నెఱుఁగ మునీం
ద్రా! చిత్తము తెలివొందెను
గోచరమె యహోబలంబు కొనియాడంగన్. 18

---

1. సహ్యాగిరియు. 2. నయ. 3. గాలవుండు.

క. ఇచ్చటఁ దొల్లి జనార్దనుఁ,
డచ్చపువాలారుగోళ్ల నసురవరేణ్యున్
[1]వెచ్చ నన నతనిసూనుని
మెచ్చ ననఁగ నేను విందు మితకథనములన్. 19

సీ. అఖిలలోకేశ్వరుం డగు రమాధిపుతోడ
విడువనివైరంబు దొడరునట్టి
మోఱక మేటికో మొలచె దైత్యుని బుద్ధి
నెబ్భంగి నిష్ఠ దైత్యేంద్రసుతుఁడు
శ్రీనత్సవత్సు మెచ్చించె శ్రీనరసింహ
మూర్తి యేకారణమున [2]ధనించె
విభుఁ డహోబలనాథవిఖ్యాతి [3]నెట్లయ్యె
నీతీర్థవరమున [4]కిందుఁ గలుగు

గీ. పుణ్యతీర్థంబు లెయ్యవి భూరిపుణ్య
యింతయు సవిస్తరంబుగా నింపు మిగుల
నానతిచ్చి కృతార్థుఁ జేయంగవలయు
నన్ను నిష్ఠును లెల్ల నానందమొంద. 20

క. అని పలికిన గాలవుపలు
కనుమోదించుచు మునీంద్రు లందఱుఁ దమ నె
మ్మనములు చెవులకు సౌమ్ముగ
నొనరించి కుతూహలాధికోల్లాసితులై. 21

క. తనవదనమునన చూడ్కులు
నినుపఁగ దేవశ్రీవుండు నిరుపమవిద్యా

1. ప్రచ్చె. 2. జనించె. 3. కట్టొంచు. 4. నిందు.

ఘనుఁ డి ట్లనియెను గాలవుఁ
గనుఁగొని గంభీరవాక్ప్రకార ప్రౌఢిన్. 22

క. నీ వడిగిన యర్థము మునిసేవితము సమగ్రబోధసిద్ధిప్రద మి
ష్టావాప్తికరము శ్రుతిసంభావితము ప్రశస్తనిత్యపాండిత్యనిధీ!

క. ఏనును బెద్దలచే మును
వీను లలరఁ [1]దరతరంబ విన్న [2]విధంబున్
మానసమున నున్న తెఱఁగుఁ
గానుపునం గన్న క్రమముఁ గథన మొనర్తున్. 24

వ. అనిపలికి దేవశ్రవుం డిట్లని చెప్పం దొడంగె. 25

సీ. అఖిలలోకానందుఁ డగు చంద్రుఁ డెందేనిఁ
గలిగె నుజ్జ్వలఫేనకణముమాడ్కి
నైరావణాదిమహాకరు లెందేనిఁ
బ్రభవించె మకరశాబములపగిది
గమనీయసురతరుసముదయం బెందేని
జనియించె శైవాలచయము భంగి
భువనైకమాత మాధవుపత్ని యెందేనిఁ
బొడమె మాణిక్యంపుబొమ్మపోల్కి

గీ. నాదిమత్స్య[3]కూర్మములు విహారలీలఁ
దనరు నెందేని ప్రకృతి సత్త్వములకరణి
నట్టియంభోధి యొప్పారు నద్భుతైక
సారమహనీయమహిమ కాధార మగుచు. 26

1. కరిమెకాడ. 2. కరంబున్. 3. కూర్మముల.

క. కాన లవణాబ్ధి యనినను
దాన మధురజలధి యనిన దాన యమృతపా
థోనిధి యనినను సకలా
నూనగుణస్తుతికి నాత్మ యొకఁడ యుదధికిన్. 27

క. కావున దుగ్ధాంభోనిధి
శ్రీవిభవము వర్ణనంబు చేసెద సాకూ
చ్ఛ్రీవల్లభమూర్తి యగుటఁ
బావనములు తద్గుణానుభావస్తవముల్. 28

ఉ. ఒక్కొకయప్పు శీతకిరణోదయవేళలఁ బొంగి నింగికిన్
నిక్క మహాబ్ధివీచికలు నిర్మలదివ్యవిమానపంక్తిపైఁ
బిక్కటిలంగఁ గ్రొన్నురువు వెట్టినయంతయుఁ జూడనొప్పు న
[1]ల్దిక్కులు శారదాభ్రలవదీప్తివిభాగత నొందుచాడ్పునన్.

ఉ. ఎక్కుడు వేడ్కఁ గ్రోలికొని యెండకయున్న పయోధిపల్లవుల్
గ్రక్కెడునో సుధాకిరణకాంతిచయంబు లనంగ నెంతయున్
మిక్కిలి యుల్లసిల్లు నునుమించులు దేరెడుముత్తియంబులిం.
పెక్కనమ్రోఁతలన్ దరఁగ లెందుఁ దటంబులఁ బ్రోవువెట్టఁగన్.

సీ. బిగి యుల్లసిల్లెడుపగడంపుఁగెమ్మోవి
చెలువంపుబింకంబు చిగురులొత్తఁ
దనరారుపులిననితంబబింబమున నా
కులితమై ఫేనదుకూల మమరఁ
గ్రమ్ముముక్తాఫలఘర్మాంబుకణములు,
చెదరి యెంతయు సౌఖ్యపదవి నొసఁగ

1. వేశ. 2 దిక్కుల.

నెసఁగునుద్వృత్తమీనేక్షణరోచుల
పొలపంబు లొయ్యారములు దలిర్ప

తే. లలితభంగుల నొప్పు వేలావధూటిఁ
గ్రమ్ర[1]వీచి భుజంబులఁ గౌఁగిలించి
ఘనరసోల్లాసలీలలఁ గ్రాలి గ్రాలి
యుదధి తోతెంచుఁ జంద్రోదయోత్సవమున. 31

ఉ. ప్రేపులు రేఘుఁ బెద్దయును బేర్చి సమీపనగేంద్రచంద్రకాం
తోపలతోయదంబు నదులొక్కమొగిం జనుదెంచియాదటన్
బైపడఁ దాను నుల్లసితభాతిఁ దదీయనదాభిసారమున్
దీపెసలారఁ గైకొని మదించు నదీపతికోర్కి వింతగన్. 32

చ. తటరుహవిద్రుమద్రుమవితానము లొప్పఁ బయోధి కింక ను
త్కటచటులోర్మిహస్తముల గర్వమున న్వెడలంగఁ ద్రోచినం
బటుతరభావ మేది బహుభంగి వికీర్ణతనొంది క్రింద న
చ్చట నచటన్[2]బొజుంగువడి స్రగ్గినబాడబకీలలో యనన్. 33

తే. [3]కడలుచేతు లార్చుచు ఫేనఘనతరాట్ట
హాసరుచితోఁ బ్రవాళజటాలి విద్రిచి
యౌర్వశిఖఫాలలోచనం బనఁగ సింధు
[4]వమరుఁ దాండవ మాడెడుహరునిఁ బోలి. 34

చ. పొలుపుగ నెల్లనాఁడు నుడివోవక పెల్లుగఁ బూఁచు తీఁగెలం
దెలుపులుమీఱె తోయనిధితీరవనంబులు చూడ్కికెప్పుడున్
ఎలమి యొనర్చు వేల్పులచలేంద్రునిఁ గవ్వముఁ జేసి[5]త్రచ్చు
చోఁ జిలికిననాఁటియయ్యమృతశీకరసేకముపాయదో యనన్.

---

1. భంగ. 2. బొనుంగు. 3. కదలి. 4. వమరతాండవ. 5. త్రచ్చుచో.

ఉ. [1]తెక్కలతోడి కొండల నెటెం దనలోన నడంచికొన్న నీ
సెక్కి బలారి వంచె నొకొ యీజలపూరము పేర్మి యంతయుం
దక్కువ సేయ నన్న క్రియ దండడి నెందును శేర్చిపెల్లుగా
నొక్కట నీరు గ్రోలెడుఁబయోదసముచ్చయముల్
పయోనిధిన్. 36

సీ. సిరిపుట్టినిల్లు రాజీవలోచనుసెజ్జ
పట్టు, మహీకాంతకట్టు జీర
గిరులు డాఁగెడుగొంది గిరిభేదిపగఱకు
బలుకోట బడబాగ్ని బ్రతుకుచోటు
పటుపయోధరములపాలిప్రపాసీమ
యమృతాంశుపాడవ్రున కనుగలంబు
మర్యాదలకు గుఱి మహిమలకందువ
యఖిలరత్నములకు నాకరంబు

గీ. సురతభవనంబు వాహినీసుందరులకుఁ
గూర్మినిల్కడ గంభీరగుణము నెలవు
తనదునొప్పిదముల కెల్లఁ దానకంబు
వనధిఁ గొనియాడఁ జతురాననునకు వశమె. 37

వ. ఇట్లపారవిభవోదారం బగుదుగ్ధపారావారంబునకు నలం
కారం బగుచుఁ దదీయమధ్యప్రదేశంబున ననేకశతసహస్ర
కోటియోజనవిస్తారవిపులరూపం బై శ్వేతద్వీపంబు దీపించు
చుండు. 38

1. తెక్కల.

క. ఆదియు మహిమయు నేర్పడ
నాదిపురుషుఁ డొకఁడ యెఱుఁగ నన్యుల కెఱుఁగం
గాఁ దరము గాదు కమలభ
వాదిదివిజవంద్య మది మహాద్భుతము మహిన్. 39

సీ. క్షీరాబ్ధితరఁగలపేరణిఁ గూడిన
ఫేనసంహతి చిక్కఁ బేరె నొక్కొ
రాకాసుధాకరప్రభలు ప్రోవిడి బ్రహ్మ
వెరవున గట్టి గావించె నొక్కొ
హరి పురాంతకుతోడిపురుడున రజతాద్రి
కెనగాఁగ నిది సృజియించె నొక్కొ
దనుజారిపాన్పయ్యుఁ దనియక వెండియు
సురగేంద్రుఁ డీమూర్తి నొందె నొక్కొ
గీ. యుదరమున ముత్తియంబు లొగ్గొయ్య మూఁగి
తెట్టువలు పేరి పెనుమిట్టు గట్టెనొక్కొ
యనఁగఁ జందనకుందేందుహారరుచిర
దీప్తివితతులు నచట సంధిల్లు దీవి. 40

శా. శ్వేతద్వీపనివాసు లంచలు శరజ్జీమూతరేఖాసిత
స్ఫీతాకారులు ఘోరదుర్భరజరాపేతు ల్హరిధ్యానసం
జాతానందనిరూఢు లూర్జితయశస్సంభావ్యు లంభోజసం
భూతేంద్రాదిసమస్తదేవపరిషత్పూజానమస్యోచితుల్. 41

క. హరిభక్తి తేపగా దుస్తరసంసారాబ్ధిఁ గడచుసాధుజనులకుం
గరమై దివిజగణనిరంతరనిత్యానందమయపదస్థితి నెసఁగున్.

వ. అమ్మహాద్వీపంబునడుమఁ బ్రచండమార్తాండమండలసహస్ర
దుర్నిరీక్ష్యసహజతేజోవిరాజితంబును, వివిధమణికిరణపటల

జటిలఘనకనకప్రాకారప్రకరపరిక్షిప్తంబును, దరళపతాకాపల్లవితకేతువనవిలసితంబును, సముత్తుంగమంగళమణిభర్మనిర్మితనిర్మలహర్మ్యశిఖరవిలిఖితగగనభాగంబును, బహుయోజనసహస్ర[1]దుర్నిరీక్షవ్యాయతవిశాలసన్నివేశంబును, రమణీయరమ్యసహస్రముఖసంచారచతురప్రాకారంబును, సంభృతాఖిలదిఙ్ముఖద్వారతోరణస్ఫురణావిభూషితంబును నయి వైకుంఠనామధేయం బగుమహాపురంబు భూరిమహిమాభిరామం బగుచుండు. 43

క. నాలుగునోళులవానికి
నాలుక లిరువేలు గల ఘనస్థిరమతికిఁ
బోలునె వినుతింపఁగ ననఁ
బోలికలకు మిగిలి యొప్పుఁబురియొప్పిదముల్. 44

సీ. నారాయణునిదివ్యనామసంకీర్తనం
బనిశంబుఁ జేయుమహాత్ములకును
బద్మాక్షు శ్రీపాదపద్మంబు లత్యంత
భక్తిమైఁ బూజించుప్రాజ్ఞులకును
విశ్వరూపునిమూర్తివిభవంబు నేకాగ్ర
బుద్ధి భావించుసత్పురుషులకును
లక్ష్మీశ్వరునిసముల్లాసహేతువు లగు
వ్రతములు సల్పుసద్వర్తనులకు
భవము దీఱినతుది వచ్చి భవ్యసుఖము
లనుభవింపంగఁ దగునెల వగుటఁ జేసి

1. దుర్నిరీక్ష్యా.

యఖిలవ[1]స్తుసంపదలకు నాకరంబు
గుణవిధావిభాసురము వైకుంఠపురము. 45

చ. శ్రుతిమతధర్మయోగములు చోద్యపుమూల్యములప్పురంబు
నం, జతురతఁ [1]బణ్యవస్తువులు సారవిముక్తిపదమ్ము, లమ్మువా
రతులితవిష్ణుశాసనసమాహితు లైనమహాత్ము లంచితో
ద్ధతిఁ గొనువారు భూరివిహితవ్రతసారగు లైనబోధనుల్. 46

సీ. తమవాఁడిచూడ్కి కందర్పునకేపని
యైన సాధించుదివ్యాస్త్ర మనఁగఁ
దమతియ్యపలుకులు ప్రమదరాగాంబుధిఁ
దనరారుమవ్వంపుఁదరఁగ లనఁగఁ
దమవింతచెయ్వులు కమనీయకోమల
శృంగారతరువులేఁజిగురు లనఁగఁ
దమముద్దునవ్వులు తమకంపుఁజీకటి
నిగిడించునరిదివెన్నెల లనంగఁ

గీ. జొక్కుమందు లనఁగ సోయగంబుల[2]గను
లనఁగ సుఖమునిక్క లనఁగఁ జాలి
యనుపమానమూర్తులై యుల్లసిల్లుదు
రంబుజాయతాక్షు లప్పురమున. 47

ఉ. మారుని గన్నతండ్రి సిరిమానసమున్నబలించునేర్పుసొం
పారఁగ నైజమై చనుమహారసికుండు సమగ్రసారశృం
గారరసాధిదేవత జగద్రమణుండు మురారి యట్టిశృం
[3]గారిరసైకపాత్ర మనఁగా దగదే పురరత్నమెమ్మెయిన్. 48

---

1. బణ్య. 2. గను 3. గారరసై క.

ఉ. శ్రీసతికి న్మురారికిని నేసలు పెట్టినపెండ్లి పెద్దల
బ్జాసనుఁ డంబుజోదరమునం దుదయించిననాఁడు చేరి యు
ల్లాసము పల్లవింప నుపలాలనఁ జేసినయమ్మ లెల్లసం
తోసమున న్ముకుందుపయిదోడులు తత్పురిపుణ్యభామినుల్.

సీ. [1]హారిదాస్యసంపత్తి కరులు శ్రీకరు లెల్లఁ
గల్క్యవతారసంకల్పలీల
శ్రీనాయకుఁడు సవరించినబలుమావు
బడిపుట్టినవి హయప్రతతు లెల్లఁ
బుట్టువుఁ జావును బోవంగఁ దట్టిన
గరువంపుదిట్టలు పురుషు లెల్ల
[2]దివ్యవిమానమాతృకలు గేహము లెల్లఁ
గౌస్తుభజ్ఞాతులు కమ్రరత్న

గీ. జాతు లెల్ల విరించి హంసవ్రజంబు,
బలఁగ మింపారు రాయంచ[3]పదుపు లెల్ల
[4]విమలకమలాక్షునాభిపద్మముల కన్న
దమ్ములప్పురికొలఁకులతమ్ము లెల్ల. 50

ఆ. సకలకాలకుసుమసంపద సొంపారి
నిఖిలసుఖవిహారనిర్మితులకుఁ
గారణంబు లై యుదారమందారంబు
లగుచుఁబురవనంబు లలరు నెపుడు. 51

1. హారిదాసులను హార్తికరులు. 2. దివ్యవిమానమాత్రికము. 3. పదువు.
4. విమలకమలాక్షు నాభిపద్మమునఁ గన్న, తమ్ములెప్పుడు.

సీ. హరిభూత[1]భావిభవ్యావతారంబులఁ
గీర్తనం బొనరించుఁ గీరసమితి
సప్తసామములు సుస్వరముగ మునికోటిఁ
జదివించుఁ గోకిలసముదయంబు
శ్రీకాంతకమనీయశృంగారలావణ్య
కథలు పేర్కొను శారికాగణంబు
ప్రణవమంత్రోత్స్వాదపరిపాకమింపార
నభ్యాసమొనరించు నలికులంబు

తే. ఘోరసంసారతాపనివారణంబుఁ
జేయుచున్న తద్భూరుహచ్ఛాయవయము
[2]సరసనిర్వాణగంధంబుఁ జల్లుఁ బుష్ప
జాతి యప్పురియుపవనస్థలులయందు. 52

చ. ఉరుతరశంఖచక్రరుచి నొప్పి, లసద్విమలోదరస్థితాం
బురుహవిభూతిఁ బేర్చి పరిపూర్ణజలాశ్రయశాశ్వతోన్నతిఁ
బరఁగి నవోత్పలాంచితవిభాగరిమ న్సిరిఁ జెంది యొప్పు న
ప్పురికమలాకరంబులు విభుండగు విష్ణునిమూర్తులో యనన్.

సీ. తరితాల్పు బొక్కెటితమ్మికమ్మనితావి
యల్లనల్దెసలను జల్లిచల్లి
పరమాత్మపదములఁ దొరగి పాఱెడు నేటి
తరఁగలపై లీల దాఁటిదాఁటి
శారికాఁగిటఁ జొక్కుచపలాతీపులకల
చెలువంబునకుఁ బ్రోదిఁ జేసిచేసి

1. భావ. 2. సరసగీర్వాణగ్రంథంబు చల్లు.

హరిమ్రోలవినతాంగుడై యున్నయురగారి
యొఱకలు పలుమాఱు గిఱిపి గిఱిపి
గీ. కొలువు తఱిఁగోరి సంభ్రమాకులతఁ [1]బాఱు
తెంచు వేల్పుమూకలసేదఁ దేర్చి తేర్చి
వెన్ను నగరిలోపల నెల్లవెంటలకును
దాసరై యొప్పుబురము మందానిలంబు. 54

వ. మఱియు నప్పురంబు పురుషోత్తమమహిమయుంబోలె వర్ణనా
తీతమై భవంబును, లక్ష్మీహృదయంబునుంబోలె నారాయణ
నివాసయోగ్యంబును, వేదాంతసారంబునుంబోలె మహా
యోగిదర్శనోపలాలితంబును, భాగవతపురాణంబునుంబోలె
నచ్యుతావతారకథాబహుళంబును, నరసింహుదివ్యరూపం
బునుంబోలె బ్రహ్లాదవరదగౌరవకారణంబును, మహాగిరికంధ
రంబునుంబోలె హరినిద్రాసుఖోచితస్థానంబును, బుండరీ
కాక్షు వక్షంబునుంబోలెఁ గమలాకరకమలరజోనురంజితం
బును, శంకరువామభాగంబునుంబోలె సర్వమంగళాలంకృ
తంబును, నహోబలతీర్థంబునుంబోలె భవనాశనీరాగాగత
సాధుజనానుష్ఠితహరిదర్శనోత్సవంబును, నిధిలోకంబునుం
బోలె సతతసన్నిహితముకుందశంఖపద్మకాంతికమనీయం
బును, సముద్రమథనావసానంబునుంబోలె దామోదరదయా
లబ్ధామృతముదితసుమనస్సముదయంబును, బాతాళంబునుం
బోలె విశ్వంభరోద్వహనసమస్తభోగీంద్రభోగాస్పదంబును,
జ్యోతిశ్చక్రంబునుంబోలె విష్ణుపదాశ్రితనిరతమునిమండ
లానుగతధ్రువస్థానరమణీయంబును నగుచు ననేక నీలమ

---

1. బారుచెంచు వేల్పు మూకల సేదదేర్చి.

మణిప్రభా నివహాంధకారితగగనభాగం బయ్యును పీతాం
బర విలసితంబును, శేషభోగాస్పదం బయ్యును నశేషభోగ
నివాసంబును, బహుసంయమిజనాధిష్ఠితం బయ్యును పరమ
ముక్తిపదంబును, సముత్తుంగ[1]గాంగేయభవనభాసురం
బయ్యును శిఖండివిహారహృద్యంబును, వివిధవిలాసినీవిలస
నోల్లసితం బయ్యును జితేంద్రియగమ్యంబును, సముద్రో
దస్థితంబయ్యును సుకవిముఖ విరాజమానంబును నై విలయ
క్లేశంబునకు నగమ్య ప్రదేశంబును, భయంబులకు ననాశ్రయం
బును,ధర్మంబులకుఁ బరమధర్మంబును, మోక్షంబులకుఁ నపరో
క్షంబును, మాంగల్యంబునకు నౌజ్జ్వల్యంబును, నానందం
బునకు నిష్యందంబును, సౌభాగ్యంబునకు, నిత్యయోగ్యం
బును, నాశ్చర్యంబులకు ననేకధుర్యంబును, [2]సకలభువన
భూషణంబును,సకలదురితనిస్తారకంబును, సకల శ్రుతి పురాణ
వర్ణనీయంబును, సకలసాధుజనాకర్ణనీయంబును నై యుల్ల
సిల్లు నట్టివైకుంఠపురంబునందు. 55

శా. రాకాచంద్రసహస్రకోటితులనారమ్యోల్లసత్కాంతియుం
బ్రాకారప్రతిహారతోరణసభాప్రాసాదవేదీవితా
నాకీర్ణంబు నుకీర్ణకేతు[3]తతసౌధాగ్రంబు నై యొప్పులోఁ
కైక శ్రీకర మంబుజాక్షునగ రత్యాశ్చర్యధుర్యస్థితిన్. 56

ఉ. ఆనగరంబు రాజు వివిధాద్భుతరత్నమరీచిమండలో
త్తానలసద్విమానరచితం బగుభూరిభుజంగపుంగవో

---

1. గాంగేయభవభాసురంబు. 2. సకల భువన పోషణంబును; సకల భవవిశోషణంబును. 3. రత.

స్నానమనోజ్ఞభోగగరిమంబున నుత్కటభవ్యయోగలీ
లానుభవంబునం బొలుచు నచ్యుతుఁ డాత్మవివేకయుక్తుఁ డై.

శా. హేమస్తంభమణిప్రదీపము[1]లిం పేపారుఁ, గర్పూరసా
రామోదం బెలరారు [2]మేటితెర లొప్పారుం లసన్మౌక్తిక
స్తోమప్రస్ఫురితోపహారవితతు లొప్పారు మాంగల్యర
త్నౌముద్ర ల్దనరారుఁ జక్రధరుశ్రీశయ్యానివాసంబునన్. 58

ఉ. చుట్టును గల్పవృక్షములు చుట్టును బుష్పలతావితానముల్
చుట్టును గేలిశైలములు చుట్టును సిద్ధరసాంబువాహినుల్
చుట్టునుబూర్ణదీర్ఘికలు చుట్టును గోకిలకీరనాదముల్
చుట్టును హంసికాగతులు సొం పెసఁగుం హరిమందిరంబునన్.

మ. మును లేతెంచి నుతించుచుండుదురు సమ్మోదంబుతో నమ్ములై
పను లాజ్ఞాపన సేయువేళలఁ దగం బాత్రుల్నిలింపోత్తముల్
పెనుపై కొల్తురు మూఁడులోకములు తృప్తిం బిన్న పెద్దల్మహా
ఘనతేజోనిధి యైనశ్రీవిభు శుభాగారాంగణక్షోణులన్!

ఉ. ఆడుదు రెల్లప్రొద్దు లలితాభినయంబుల దేవకామినుల్
పాడుదు రింపు వీనులకుఁ బండువ సేయఁగ వేడ్కఁ గిన్నరుల్
గూడి సమగ్రతత్త్వరసగోష్ఠిసుఖింతురు యోగిబృందముల్
క్రీడ యొనర్తు [3]రిష్టరసకీర్తితభంగిఁ[4] బ్రసన్ను లయ్యెడన్. 61

వ. ఆదివ్యమందిరంబునకు రక్షకులై యష్టదంష్ట్రులు చతుష్టష్టి
దంతులు మహామస్తకవక్షస్స్థలబాహుచరణదారుణాభిరామ
శరీరులు విచిత్రభూషణాంబరగంధమాల్యాంగరాగులు నా
యతశక్తియుక్తులును నానావిధాయుధహస్తులును [illegible]

1. అం పేరుఁ. 2. మేటితెర వొప్పారుఁ. 3. [illegible]

సత్త్వ సంరంభగంభీరులును నిరుపమాష్టవిధైశ్వర్యధుర్యు లును నగువా గనేకశతసహస్రలక్షకోటి పద్మసంఖ్యల మొత్తంబులై విష్ణుకింకరులు చండప్రచండాదులు పూర్వ ద్వారంబున గణపతియమప్రభృతులు దక్షిణద్వారంబునను కుధరకోరకముఖ్యులు పశ్చిమద్వారంబునను పద్మాక్షపద్మ దుర్గేందుప్రముఖు లుత్తరద్వారంబునను నిరంతరంబు నుం దురు మఱియుఁ జతుర్భుజులును శంఖచక్రధరులును బీతాం బరులును నీలాంబుదవర్ణులు [1]నగణ్యసంఖ్యు లన్నగరికినెల్లెడ లనుం గావలియై చరియింతురు. ఇట్టి గణకోటికి నెల్లమేటి యు నారాయణప్రసాదభాజనుండును నగు విష్వక్సేనుం డనుమహాపురుషుండు గణవిమానసహస్రంబులు పరివేష్టింప నద్భుతవిమానారూఢుం డగుచు శ్రీమహాలక్ష్మిఁ గూడుకొని తిరుగుచుండునట్టియనుపమసామ్రాజ్యంబు జగదేకపూజ్యం బై తనకు ననురూపం బగుచు నుండ నుద్దీపితుం డై. 62

సీ. పద్మనివాసిని [2]పట్టపుదేవియు
నలినాసనుఁడు ప్రియనందనుండు
విహగాధినాథుండు మహనీయవాహనం
బహికులాధీశుఁ డింపారుశయన
[3](మతిలోకనందకం) బద్భుతోజ్జ్వలహేతి
ఘనపాంచజన్య ముత్కటపుఁ జింద
మింద్రాదిసురలు సమిద్ధసేవకకోటి
సిద్ధమునీంద్రు లాశ్రితగణంబు

1. నగణ్యసంఖ్య. 2. పట్టానదేవులు. 3. ఇది పూరణము.

తే. ధర్మసంస్థాపనలు వినోదంపుఁబనులు
శ్రుతులు నుతు లిట్టి యతులితోన్నతులఁ జేర్చి
లీల బ్రహ్మాండకోటిఁ బాలించుచుండు
నార్తగతుఁడు పరుండు నారాయణుండు. 63

క. ఆదేవుదివ్యమహిమం
బాదేవుఁడు తానె యెఱుఁగు నన్యుల కెఱుఁగం
గాఁ దరమె విధిపురందరు
లాది యయినదివిజులకును నందునె యెందున్. 64

సీ. భూరిరజోగుణస్ఫురణపద్మజుఁ డనా
భువనప్రపంచంబు పొడవుఁజేయు
మహనీయసత్త్వసమాధివిష్ణుం డనాఁ
బొదలించు జగములఁ బొలుపుఁ దెలుప
గాఢతమోగుణాకలన నీశుం డనా
నొక్కటఁ నిఖిలంబు నుడిచి యడఁచుఁ
గలితగుణత్రయోజ్జ్వలపరాత్ముండనా
నెగడి విశ్వమునకు మిగిలి వెలుఁగుఁ

గీ. గేవలుండె నిఖిలదేవచూడామణి
యఖిలదేవతామయైకమూర్తి
సకలదేవశరణ చరణాంబురుహుఁడు ల
క్ష్మీశ్వరుండు జగదధీశ్వరుండు. 65

చ. సిరి గరుడుండు చారుతులసీదళదామము కౌస్తుభంబు ప్ర
స్ఫురదురుశంఖచక్రములుఁ బొక్కిటితమ్మియుఁ[1] బచ్చపుట్టమిం

---

1. బచ్చపట్టునిం.

పుర లేదుచూడ్కియు న్గరుణ నూనినయుల్లము నైనమూ ర్తి
యే,[1]నరుమదిఁ గ్రాలు, వాఁడొకఁడ నాథుఁడు శాశ్వతసౌఖ్య
సిద్ధికిన్. 66

చ. తపములఁ బోనిపాపములు దానగుణంబులఁ బోనిదోషముల్
జపముల నాఁటిపోనికలుషంబులు దుష్పరఁ దూలిపోవు న
చ్చఁపుఁదలఁపొప్ప నొక్క మరి సర్వము నైన రమేశుపేరి తీ
యపుఁబలు కింపుమీఱ[2]నెనయందొడఁగూర్పఁగ నేర్పుగల్గినన్.

క. [3]కరుణయ తనకుఁ దొడవు త
త్పరచిత్తుల దెసయ తనకు భాగ్యము భక్తో
ద్ధరణంబ తనకు భృతి శ్రీ
వరుఁబోలం గలుగు నొరుఁ డెవఁడు జగమందున్. 68

సీ. నాలుగు మొగములబాలుఁ బొక్కిటితమ్మి
  సృజియించి జగములు సేయఁబనిచె
నింపారు తెలినీటియే అంఘ్రితలమునఁ
  గలిగించి దురితము ల్గడుగఁ బనిచెఁ
దుదలు గానఁగ రానిచదువులు మనసునఁ
  బొడమించి తగవులు నడుపఁ బనిచె
గర్వంబుఁ గెంపులు కడకంటిచాయలఁ
  బుట్టించి దివిజులఁ బ్రోవఁ బనిచె
గీ. దలఁపులకుఁ జేరుగడ తాన తెలువులకును
నిక్క దాన పలుకులకు నెడము దాన

1. నరువది గ్రాలువాఁడొకఁడనాథుఁడ శాశ్వతసౌఖ్యసిద్ధికిన్. 2. నున.
3. కరుణయుఁదనకు.

యజరుఁ డమరుఁ డనంతుఁ డవ్యయుఁ డచింత్యుఁ
డనఘుఁ డజుఁ డంచితశ్లోకుఁ డచ్యుతుండు. 69

వ. ఇట్టి పరమేశ్వరుండు పరమప్రభావభరణుం డగుచు[1]భువనాహితచరితంబులం బాపుచు శుభంబులం జూపుచు భక్తజనపారిజాతంబనఁ బ్రఖ్యాతియుం గరుణారసప్రీతియుం దనకు సహజంబులై వెలయ వైకుంఠపురంబున విహరించుచుండఁ గ్రమంబునఁ దిమికమఠవరాహావతారంబు లుదారంబులై ప్రవర్తిల్లినయనంతరంబ యొక్క కాలంబున నీలమణిసుందరం బగునిందిరాసుందరీదివ్యదేహంబునం బొదలుకాంతిప్రవాహంబు సిగ్గునవెలుకఁబాఱినపోలికం జెలుకనై వెలిమొగులు మొత్తంబులు దెసలకడ నడలుపడి తూలం బ్రకటయోగనిద్రావసానంబున నానందంబునొందు గోవిందులోచనారవిందంబులచందంబు ననుకరించుటకు నాయితం బయినకరణిం గమలంబులు కమనీయరుచినిచయంబులం బచరింపఁ బరమపురుషుపాణితలంబునఁ బ్రద్యోతమానంబగుపాంచజన్యంబునకు నన్వితంబుగాఁ బూర్ణేందుబింబంబు నిబిడచంద్రికానిష్యందంబు నిగిడింప నీరజోదరువేరురంబునఁ బొలుచువలుఁదమానికంబునకుఁ జేరువచుట్టం బనాఁదగి యరుణకిరణుండు నిరావరణంబు లగుకిరణంబులవేఁడిమి మూఁడుజగంబుల నిగిడింప సజ్జనచిత్తంబులం [2]గెలిన్చృత్తంబులు సల్పుజలశయనునిరతిశయగుణంబుల కనుగుణంబులైనయోజ రాజహంసరాళంబులు విమలకమలాకరంబుల విహరణకళాకౌశలంబులు సొగియింప జగదేకాశ్రయం బగుశ్రీవత్సలాంఛను

1. భువనహిత. 2. గెలిచృత్తంబు.

నాశ్రితజనంబుల మనోరథంబులచాడ్పున సస్యసముద
యంబులు సమగ్రఫలంబులం బొలుపార నవక్రవిక్ర
మోదగ్రుం డగుచక్రధరుభావినరసింహావతారంబున విదార
ణీయుం డగుదైతేయురుధిరబిందుసందోహంబుతోడి బాంధ
వంబు ననుసంధింపం దివురుపగిది బంధురబంధూకంబు లవంధ్య
సహస్రదీప్తిం దిలకింప నకుంఠితకైవల్యకళ్యాణకారణం
బగునపారనారాయణమహిమాకార పారావారంబుం జేరు
ప్రబుద్ధజనంబులబుద్ధుల తెఱంగునంగలంకదేరి [1]యేరువు
లెఱిలి విలసిల్ల నుత్ఫుల్లహల్లకోల్లాసియుం గుముదామోద
ముదిత మధుకరనికరంబును గువలయచ్ఛాయానుబంధాంధ
కారితకువలయంబును గాశప్రకాశితాశావివరంబును నై
శరత్సమయంబు సకలలోకాలంకారం బగుచున్నయెడ. 70

చ. నిరుపమభోగితల్పమున నిర్మలయోగవిశేషలీలమై
శరనిధికన్యకామణికుచద్వయకీలితవక్షుఁ డై మనో
హరసుఖనిద్ర నున్నకమలాక్షుఁడు మేల్కనియెన్బ్రబోధసుం
దరఁగలమ్రోఁతమంగళమృదంగమృదుధ్వని యై చెలంగఁగన్.

సీ. నెరసినచిక్కని యిరుచన్నుఁగవ చెన్ను
పరిపూర్ణకుంభవిభాతి యనఁగఁ
జెలిక్రాలుకన్నులఁ బొలయు మెఱుంగులు
కోలునీరాజనలీల లనఁగ
జిగిమీఱుపలుచనిచెక్కులచెలువంబు
రమణీయదర్పణరచన యనఁగఁ

1. యెరు నెరుకలిం.

దళుకొత్తుచిఱునవ్వు తెలుపులసొంపులు
పుష్పోపహారవిస్ఫూర్తి యనఁగఁ

గీ. దనమనోహరభావంబు దనవిభునకు
నుచితమంగళవిధముల నుల్లసిల్ల
మున్న మేల్కని మున్నీటిముద్దుకూఁతు
రమరె నీలాబ్జమధుపగానములు చెలఁగ. 72

చ. ఉరుతర[1]తల్పపన్నగఫణోజ్జ్వలరత్నసహస్రదీప్తిమైఁ
బరఁగఁ గరంబు పొల్పెసఁగఁ బద్మదళాక్షునిమేను నూతన
స్ఫురదరుణాంశురాగరుచి సూరెలఁబర్వఁగ నుల్లసిల్లు సుం
దరమహనీయనీలవసుధాధరశృంగము పొల్పుఁ బట్టఁగన్.

వ. అంత. 74

సీ. అంబుధినాదంబు నతకరించుచుఁ బర్వె
నభమునఁ బాంచజన్యస్వనంబు
జయజయశబ్దవాచాలితం బయ్యె ఘను
దర్శనలీల సుదర్శనంబు
ముదమలరారఁ గౌమోదకి బహువిధ
భ్రమణవేగమున నర్తన మొనర్చె
నఖిలైకనందకం బగునందకముమ్రోల
దీప్తిపరంపర దీటుకొలిపె

గీ. పసిఁడినీరుమీఁదఁ బరఁగిన క్రియ నిజ
పక్షకాంతి దిశలఁ బ్రజ్వరిల్ల

1. కల్ప.

నాదిదేవుమ్రోలఁ బ్రాంజలియై పొడ
చూపి నిలిచె భుజగసూదనుండు. 75

వ. ఇట్లు బోధంబు నొంది కొండొకసేపు గోవిందుండు మంద స్మితసుందరవదనారవిందుండగుచు నిందిరతోడ సరససల్లాప సౌహార్దంబునందగిలి కొండొకసేపు. 76

ఉ. ఆనలినాయతాక్షినయనాంచలచంచలహాసవిభ్రమ
భ్రూనటనంబు నాతరుణిపూర్ణముఖేందువిలాసహాస మ
హానినిముగ్ధభాషణసమంచితమంజులలీల యొంతయుఁ గా
మానసమున్ బ్రమోదరసమగ్నముగా నొనరింపనున్నెడన్.

క. డెందమునఁ గొలువువేడ్కలు
సందడిగొన నేగుదెంచి సంయమివరులున్
బృందారకులు న్నిల్చిరి
క్రందుగ జగదీశమందిరద్వారమునన్. 78

వ. అప్పుడు. 79

సీ. అవసరం బిప్పుడక్కయ గునంతదాఁకను
బగళమై నిలుఁడు దిక్పాలవరులు
సందడిసేయక యందఱు నించుక
సేపు కూర్చుండుఁడు సిద్ధమునులు
దండియలును మీరు దడియంగఁబడకయ
తకయటువొండు గంధర్వముఖ్యు
లిందాకఁబొగడితి రించుకవడి యింక
జగడంబు మానుఁడు చారణేంద్రు

గీ. లనుచు నుద్ధతవేత్రదండాభిరామ
హస్తులై పణిహారు లందంద నిలువ
నధిక మై రొప్పె సమ్మర్ద మాదిదేవు
భూరిమందిరతోరణభూమియందు. 80

వ. అట్టిసంకులసమయంబునందు. 81

క. సనకుఁడు సనందనుండును
సనత్కుమారుఁడు సనత్సుజాతుం డనఁగా
మునివరులు వనజభవునం
దను లేతెంచిరి ముకుందదర్శనవాంఛన్. 82

వ. ఇట్లు చొచ్చి యనివార్యగమనంబున నరుగుదెంచువారికి నడ్డపడి విష్ణుసారూప్యదేదీప్యమానకాయులును దత్ప్రతిహారపాలనపదవీనిత్యనిరపాయులును జయవిజయనామధేయులును నగువారిద్ద ఱమ్మునీంద్రుల కిట్లనిరి. 83

ఉ. ఇప్పుడ మేలుకాంచెఁ బరమేశుఁడు [1]సాగరజన్యకాంతిలోఁ
దెప్పలఁ దేలుచున్న తనతీయపుఁజూపుల నేని నొందు మైఁ
ద్రిప్పుఁడు పాఁపపాన్పుపయి దివ్యపదంబు పసిండిపావయుం
దొప్పఁగ నేని మోపఁడట నొండ్లును జేరరు పూనియెవ్వరున్.

క. ఈసిద్ధు లీసురప్రభు
లీసంయమివరులు జగదధీశ్వరుఁ గొలువం
గా సమయము గాచి తదే
కాసక్తత నున్నచంద మటు గనుఁగొనుఁడా. 85

1. సాగరకన్యకాంతతో.

క. వీరును నొక్కింతదడవు
నైరణతో నిలిచి సమయసముచితముగ ల
క్ష్మీరమణుఁ గని కృతార్థస
మారంభుల రగుఁడు తద్దయాలాపములన్.

చ అనుటయు నాదిదేవుఁ బరమాత్ముఁ గనుంగొను నెమ్మనంబులన్
మొనయుకుతూహలాంకురము మోడ్పడఁ గోపముచిచ్చు
తాఁకునన్, ఘనతరబోధపల్లవము గందఁగ నైరణ యన్మహా
వ్రతం,బునకు విఘాత మొంద మునిపుంగవు లొక్కటఁ
నుగ్రమూర్తులై. 87

తే. అఖిలలోకగమ్యుఁ డగుపరమేశ్వరుఁ
జూడఁ గోల్పు నబ్బుసుకృతమునకు
నంతరాయ మైతి రట్టియిద్దురితంబు
ఫలము ననుభవింపవలయు మీరు. 88

ఉ. కావున ధర్మవిద్విషులు కల్మషకారు లనంగ దుష్టమో
హావిలబుద్ధితో నసుర లై జనియింపుఁడు సంతతంబు ల
క్ష్మీవిభుమీఁదిమచ్చరము కిన్కయుఁ[1] గాఁకయుఁబెట్టుఁగాత మీ,
మీ, భావము లిప్పు డేపగిది బాములు పెక్కగు నిక్క
మొంతయున్. 89

వ. అని వారు ఘోరంబుగా శపించిన. 90

క. వెలిగుపడి హర్ష రాగము, [2]దఱిగిన వదనములు వెల్లఁదనము
గదుర బి, ట్టఱమూర్ఛ మునిఁగి యయ్యు, ద్దఱు నిలిచిరి
వేత్రదండతాడితతను లై. 91

వ. ఆసమయంబున. 92

1. కాఁకయు. 2. తఱికిన.

సీ. ఇమ్మహాపురుషుల [1]కింతమాత్రకుఁ గాఁగ
నేలకో యీకోప మిట్లుపుట్టె
నమృతాంశుదీధితు లగ్గిసల్లుట గాదె
యీమూర్తులకుఁ గన లిట్లు కలిమి
యూహింపఁగాఁ గార్య మొకటి యేమేనియుఁ
గలుగు నూరక వీర లలుగువారె
పాత్రీకులై యిట్లు సైఁచిరిగాక యీ
యిద్దఱు నల్పులే యిద్ధమహిమ
గీ. ననుచు మునులును సిద్ధులు నమరవరులు
నాదిగా నెల్లవారలు నచట నచటఁ
గూడి పెక్కుభంగుల మాటలాడుచుండఁ
దుముల మంబునిధిధ్వానసరుతఁ జెర్చె. 93

వ. ఆవృత్తాంతం బంతయుఁ దనదివ్యచిత్తంబున నవధరించి సకల జగన్నివాసుం డగువాసుదేవుండు లక్ష్మీసహితంబుగా ససంభ్రమంబున నచ్చోటికి విజయంబుచేసి సనకాదులంజూచి మీరు సకలలోకద్వారంబుల ననివారితసంచారులరు వీరు చేసిన తప్పు నాయది యుపశమంబు నొందుం డని యనునయించిన నయ్యోగీశ్వరులు మహాయోగీశ్వరేశ్వరుం డైన లక్ష్మీశ్వరు సందర్శనంబును సంభాషణంబునుం గని కృతార్థు లై పర మానందంబునఁ దదామంత్రణంబువడసి నిజేచ్ఛంజనిరి. మధు మథనుండును మగిడి యభ్యంతరమందిరంబునకుం జని వైన తేయుం బనిచి ప్రతిహారపాలురం దనపాలికి రావించిన నయ్యిరువురుం బురాణపురుషునకుఁ బరమభక్తిప్రకారంబు

1. కెంతమాత్ర.

లగుసాష్టాంగదండప్రణామంబు లాచరించి కృతాంజలులై యొక్క దెస నొదిఁగి నిలిచిన నప్పరమాత్ముండు బహుళ కారుణ్యపుణ్యావలోకనసుధాసారంబు వారలపైఁ బరపి దర హాసప్రసాదసాదరవదనుం డగుచు ని ట్లనియె. 94

క. మీ ఱినమహానులకినుకకు
మా ఱలుగక యున్న మీసమగ్రక్షమ వే
మాఱుఁ గొనియాడఁగాఁ దగుఁ
గీఱు నె సాత్వికులబుద్ధి కిల్బిషచయముల్. 95

ఉ. ఎంత గొఱంతఁ జేసియు మహీసురముఖ్యులు నాకుఁ జూడఁగా
నెంతటివారి కైనను సహింపఁగఁ బాత్రము లమ్మహాత్ములం
[1]డెంతటిపూజ లైనఁ దగు నెంతటి[2]మన్నన లైన నొప్పుఁ దా
రెంతలుగా మదిం దలఁతు రేనియు[3]నంతలుఁదప్ప భావముల్.

సీ. అజ్ఞానరోగంబు లలఁతఁ బెట్టెడుచోట
దివ్యౌషధంబు భూదేవసేవ
పురుషార్థసిద్ధులఁ బొందెడుచోటను
నమరభూరుహము విప్రార్చనంబు
దురితాంధకారంబు పరఁగి క్రమ్మినచోటఁ
బటుభానురుచి బ్రహ్మభాషితంబు
దుఃఖభయంబులు డొడరి సోఁకినచోట
నభయమంత్రము బ్రాహ్మణాశ్రయంబు

గీ. సారభద్ర ముత్తమవర్ణచరణరజము
భవ్యతీర్థంబు బాడబపాదజలము

1. డెంతటిపూజ్యు. 2. మన్ననలైన. 3. నంతయుఁ.

సకలజన్మంబులకు నగ్రజన్మకులము
చేరుచో టిదిసిద్ధాంతసిద్ధమతము. 97

శా. నారూపంబులు మేదినీసురులు నానారూపదివ్యత్తప
స్సారోదారులు భూరితేజులు జగత్సంభావ్యకోటిప్రసా
దారంభప్రతిభావిభాసితులు విశ్వాధారు లామ్నాయసం
స్కారాకారులు లోకసమ్మతయశోగంభీరతాజృంభితుల్.

క. దైవాధీనము త్రిజగము
దైవము తన్మంత్రవశము తన్మంత్రము భూ
దేవతలచేతి దగుటను
దైవములకు దైవతములు ధరణీదివిజుల్. 99

తే. బ్రాహ్మణావమానపరు లైనవారలు
నన్ను నాత్మ నొల్లకున్నవారు
విప్రవరులఁ గరము వేడుకఁ బాటించు
వారలెల్ల నన్ను వలచువారు. 100

వ. కావున బ్రాహ్మణవచనాతిక్రమణం బొనరింపక జన్మాంతరం
బులు గైకొనవలయు, నతిమాత్రశత్రుత్వంబునకు ననుమా
నింపవల దదియు నుదాత్తసిద్ధిప్రదంబ, యట్లని శత్రుండు
నిరంతరంబు నుద్గతంబై నహృదయంబునం దస్మదీయసాదృ
శ్యంబు తనకుఁ గావలయుటం దలంచుటఁ దత్ప్రకారంబు
సాయుజ్య [1]సంపత్కారణంబు మీరు చిరకాలంబు నన్ను
భజియించినదాసు లగుటం జేసి పరమైశ్వర్యభాజనంబు లగు
జన్మంబులఁ దేజోవిభవంబు లనుభవించి తుది [2]నస్మదైక్యంబు

1. సంపత్కారంబు. 2. నస్మదైక్యత్వంబు

నొందంగలవార లిదియంతయు నేను మాయాబలంబున
మీకు శ్రేయఃకారణంబుగా నుత్పాదించిన యుపా
యంబు సనకాదుల కాదు శర్వుం డైనమద్భక్తజనంబుల
ధిక్కరింప శక్తుం డగునె ? యిత్తెఱంగు మాంగళ్యంబుగా
నంగీకరించునది, యంతరంగంబుల కలంక దొలంగుఁ డని
యానతిచ్చి వెండియు ని ట్లనియె. 101

మ. పగవాఁ డైనను మూర్ఖచిత్తుఁ డయినన్ బాపాత్ముఁ డైనన్
మదీయగుణధ్యానవిధేయధీపరిణతుం డై యున్న నే నాతనిన్
సుగుణుంగా నతిధన్యుఁగా సుజనుఁగా శుద్ధాత్ముఁగా
నిత్యుఁగా, జగదేకప్రభుఁగాఁ బ్రభూతవిభవస్ఫారాత్ముఁగాఁ
జేయుదున్. 102

శా. ఏ నెవ్వాఁడనొ నాచరిత్రము తెఱం గెబ్భంగి యోమన్న యు
ధ్యానం బెట్టిది యోరయెఱుంగనివిమూఢాత్ముండు మన్నామమె
ట్లైనం బేర్కొనఁ గాంచు నేని దురితోద్గ్రాంధకారచ్ఛటా
భానుం డీతఁ డనంగ భవ్యపదముం బ్రాపించువాఁ డుర్వ మ(దు?)
[దిన్.

క. నారాయణాఖ్యుఁ డగుసుతుఁ
బేరుకొనిన బోయి కెట్టిపెం పొదవెను వాఁ
డేరూపువాఁడొ ముందర
మీ రటు దలపోయుఁడా సమాహితబుద్ధిన్. 104

వ. మదీయశరణాగతుల రగుటం జేసి మీకు నెందును శుభంబ.
సకలచరాచరజనకుం డైన కశ్యపమహామునీంద్రుండును
దక్షకన్యావరేణ్య యగుదితియును దొలుత భవదుద్భవ
కారణం బయ్యెదరు. ప్రహ్లాదవిరోచనబలిప్రముఖు లగు

భాగవతోత్తములు భవదీయవంశంబునం బరమపావనులై
యుదయించెదరు. అని యిట్లు నిర్దేశించిన దేవదేవునానతి
నానందంబు నొంది యయ్యిద్దఱు ముకుందునకు నందంద
మ్రొక్కుచు బహువిధంబులఁ బ్రస్తుతించిరి. హరియుం
బేరోలగం బిచ్చి నిజదర్శనార్థు లగు సురమునిప్రముఖులఁ
గృతార్థులంజేసి నిఖిలజగంబుల రక్షించు చుండె నంత. 105

క. అజయవిజయులు పుట్టిరి
తేజంబునఁ గశ్యపునకు దితికిని సుతులై
రాజితవై తేయకుల
భ్రాజిష్ణుసుఖైక యోగ్యభాగ్యస్ఫురణన్. 106

క. అని గాలవమునివరునకు
ననఘుఁడు దేవశ్రవుండు హర్షముతోఁ జె
ప్పిన పుణ్యకథన మంతయు
వినుతోక్తుల విస్తరించి వెండియుఁ బ్రీతిన్. 107

ఆశ్వాసాంతము

క. సౌభాగ్యభాగ్యలక్ష్మీ, లాభోన్నతవక్ష భువన[1]లాలనదక్షా
లోభాదిరహితసంపద్వైభవభవ్యాత్మలక్ష్య ధర్మాధ్యక్షా.

మాలిని.—

భూరికృపారసపోషణ కౌస్తుభభూషణ దుస్తరభూమ(రి)భవో
త్తారణ దైత్యవిదారణ విశ్వవిధాయక మంగళదాయక నా
భీరుహపంకజపీఠచతుర్ముఖ [2]వేషితదుర్ముఖ పేశలధా
రారుచిరాసిధరా దురితాగ్నిశరా నృహరీ గుణరత్నగిరీ. 108

---

1. లాలితదక్షా. 2, ప్రేషిత.

క. [1]వినుతివిశారదనారద, మునిమధురోద్గీతనినద [2]మోదాభ్యస్తా
దనుసుఖఖండనమండన, సునిశితనిర్వక్రచక్రశోభితహస్తా.

వనమయూరము.—

స్ఫారగుణహార శ్రుతిసార జగదేకా
ధార విదుదార నగధార నవమేఘా
కార యవికార యనికార కరుణాలం
కార ధవభావశుభకారణవిహారా. 111

గద్యము. ఇది శంకరస్వామిసంయమీశ్వరచరణసరోరుహధ్యా
నానందసారదర్యధుర్య శ్రీసూర్యసుకవిమిత్రసంభవ శంభు
దాసలక్షితాభిధేయ యెఱ్ఱయనామధేయప్రణీతంబైన లక్ష్మీ
నరసింహావతారం బనుపురాణకథయందుఁ బ్రథమా
శ్వాసము. 111

---

1. వినుతవిశారదనారద. 2. మోదభ్యస్తా.

శ్రీరస్తు

# ద్వితీయాశ్వాసము



మదహోబలతీర్థ
గ్రామణి శ్రుతికామినీశిఖామణి కరుణా
ధామ జగదవనవిహిత
స్థేమ దురితకరటిసింహా శ్రీనరసింహా. 1

వ. దేవా రోమహర్షణుండు మహర్షుల కిట్లనియె. అట్లుపుట్టి హిరణ్యకశిపు హిరణ్యాక్షులను పేళ్లఁ బ్రసిద్ధివహించిన యయ్యిద్దఱు దైత్యులయందును నగ్రజుండు. 2

సీ. కనలుబింకపుఁగింకఁ గలుగు వేఁడిమియెల్ల
 [1]నెక్కటిరై యొడ లెత్తె ననఁగఁ
గఱకుఁబ్రల్లదమునఁ గల్గుపోఁడిమియెల్ల
 నచ్చమై తెగఁబొడ వయ్యె ననఁగఁ
గటికిదై తనశౌరుగర్వంబునకుఁ గల
 చేగ యెల్లను రూపు చెందె ననఁగ
వెగ్గలంబై పేర్చు వీరంబునకుఁ గల
 పసిక యెల్లను మేను వడసె ననఁగఁ

1. నొక్కటిరైయొడలొత్తె.

గీ. ప్రళయకాలదహనుఁ బోలించుదోర యనఁ
జండదండధరునిసఖుఁ డనంగఁ
దేజరిల్లె నైజతీవ్రమానమున హి
రణ్యకశిపుఁ డపశరణ్యరిపుఁడు. 3

మహాస్రగ్ధర. తనదోర్దర్పంబు తెల్పం దలఁచి సరభసోత్ఖాతది
గ్దంతిదంత,ధ్వనితబ్రహ్మాండవాద్యోత్తరళితగతులం దారతా
రౌఘముక్తా, జనితప్రాలంబరాకాశశధరకలితచ్ఛత్రుఁ డై
మేరుసింహాసన మెక్కం జూచు దైత్యేశ్వరుఁ డతులని
జైశ్వర్యవిఖ్యాతి నొప్పన్. 4

తే. అమరు లనినఁ జంప నలుగు [1]హవ్యాహారు
లనిన నోరికళ్లు గొనఁగఁ దలఁచుఁ
[2]ద్రిదివవాసు లనిన నదుమంగఁ జూచుఁ బా
తాళమునకు దేవతల నతండు. 5

క. ద్వేషించు నాగమంబుల
రోషించుఁ ధర్మపదనిరూఢస్థితికిఁ
బోషించు మత్సరోద్ధతి
భూషించు మదాతిరేకమునఁ జరితంబున్. 6

చ. ఇట్లు ప్రకృతిపాపష్యదూష్యప్రకారుం డగుచు నయ్యసుర
వీరుండు సంతతైశ్వర్య విహారంబుల వర్తిల్లుచుండి తనమనం
బున నొక్కనాఁ డిట్లని వితర్కించు. 7

చ. అమరులతల్లికంటెను మదంబ వరిష్ఠ త్రిలోకరాజ్యభో
గములును నాకయోగ్యములుగాని నిలింపుల కెట్లు గల్గును

---

1. నవ్యాహారు. 2. త్రిదివరాసు.

ద్యమగరిమంబుమై సుగల నందఱ మ్రుచ్చులఁ బోలెఁ దీవ్రదం
డమునను [1]జంపి యేన తగ డక్కఁగ నేలుదు లోక మంత
యున్. 8

క. కావున నుగ్రవ్రుఁదపముఁ
గావించెదఁ దపముచేతఁ గానివి కలవే
యేవిధముపనులకైనను
గేవలబలమున నుపాయకృత్యము వెలిగన్. 9

సీ. అమరపదంబును నమరేంద్రపదము త
పం బను భూజంబుపండ్లు గావె
సప్తర్షిపదము భాస్వత్ధ్రువపదమును
దప మను పుష్పగంధములు గావె
పద్మజపదమును బద్మాక్షుపదమును
న్నతతపశ్శుక్తిరత్నములు కావె
సిద్ధపదంబును శ్రీకంఠుపదమును
రూఢతపోభానురుచులు గావె

గీ. తపములావునఁ గాదె యిద్ధరణివలయ
మఖిలమును దాల్చియున్నవాఁ డహి యొకండ
కాన ధర్మార్థకామమోక్షముల కెల్లఁ
దపము సాధన మగుట సిద్ధంబ కాదె. 10

క. పోయెద నిప్పుడ యుద్యద
మేయతపోనిష్ఠ నజుని మెచ్చించెద ను
త్కాయక్లేశవ్రతవిధి
నేయుల్లముశైనఁ గాఁగ కెమ్మెయి నుండున్. 11

---

1. జంపె నెన్నఁదగదక్కఁగ నేలుదు.

వ. అని తలపోసి యప్పుడ కదలి మునిసిద్ధసేవితం బైనగంధ
మాదనంబునకుం జని యందు జటావల్కలాజినప్రముఖతపో
లక్షణ లక్షణీయాకారుం డై యాధీరుండు. 12

క. నాలుకలు గ్రోయువహ్నులు
నాలుగుదిక్కుల నమర్చి నడుమ నిలిచి సూ
ర్యాలోకనపరుఁ డై మును
గా లొక్కటి మోపి నిలిచె ఘర్మపువేళన్. 13

సీ. ఏపారుతుఱంగలినెఱిమంట లొండొండ
వ్రేసిన నేమియు వెగడుపడక
వడిగాలి [1]సుడిసిన మిడుఁగురు లందందఁ
బొదివినఁ దాలిమిఁ బ్రిదులనీక
పొంగారి దట్టంపుఁ బొగలు దూడుకొనంగఁ[2]
బర్విన నెంతయు బ్రమసివడక
యఱిముఱి నల్లడ నడరి పెన్గాఱవులు
పైఁ బడ్డ గడలకుఁ బాసిచనక

గీ. దిట్టతనముపేర్మి దేహాభిమానంబు
విడిచి నిష్ఠ యేడుగడయుఁ [3] గాఁగఁ
బరమతప మొనర్చెఁ బంచతపస్సుల
కితఁడె యొక్కఁ డనఁగ దితిసుతుండు. 14

శా. విద్యుత్కేతువు లొప్ప శక్రధనురావిష్కారఘోరంబుగా
నుద్యద్గర్జితదుందుభిధ్వనులతో నుగ్రాంబుదవ్యూహముల్

---

1. సురిగిన. 2. దూఁటుకొనంగ అనియుండును. 'దూడుకొను' అస్తి
ఘంటుకము. 3. గాక.

మాద్యద్భాస్కరమండలాక్రమణసామగ్రిఁ దివిం బర్వె నే
కోద్యోగంబున గ్రీష్మశాత్రవునిపీరోత్సాహముం దూలఁగన్.

క. తొలువానలు గురియఁగఁ ద
జ్జలనివహము దైత్యవిభునిసంతప్తాంగం
బులయందుఁడిందు[1] నౌర్వ
జ్వాలనశిఖల డిందు జలధిసలిలముఁ బోలెన్. 16

తే. బట్టబయటఁ బ్రౌఢపద్మాసనస్థుఁడై
యున్న యతనిమీఁద నొక్కపెట్టఁ
గులనగంబుమీఁదఁ గూల్చువిధంబునఁ
గూల్చె జలధరములు ఘోరవృష్టి. 17

స్రగ్ధర. దీర్ఘస్ఫీతాంబుధారల్ దెరలఁబొదువ నుద్వేగదూరుండు
స్ఫూర్జన్నిర్ఘోషోత్తర్జగర్జానినదము లడరన్ నిశ్చలాంగుండు
[2]ప్రేంఖన్నిర్ఘాతోత్పాతవిద్యున్నికరము లడరన్ నిర్వికా
రుండు ధైర్యంబర్ఘాతీతంబుగా నయ్యసురవరుఁడు వర్షా
గమం బల్లు పుచ్చెన్. 18

క. పదపడి హేమంతుని సం
పద[3]యొయ్యన శీతగిరియుపాంతమువలనం
గదలి చనుదెంచుపయ్యెర
నొదవి తనమయంబ యగుచు నొప్పుగఁ బర్వెన్. 19

ఉ. ఒక్కట మైహికంబు లగునుత్తరమారుతము ల్శరీరముల్
వ్రక్కలు సేయ నేతెఱఁగువారికి నోర్వఁగరానిరాత్రులన్
బుక్కిటిబంటినీటఁ బరిపూర్ణఘనస్థితి నిల్చె దానవుం

1. బులయందుండిది. 2. ప్రేంఖన్. 3. యొయ్యన. 4. బొల్చె
చెంతయున్.

డక్కజ మైననిష్ఠఁ గొనియాడఁగఁబట్టుగఁ [4]బొల్చి యెంత
యున్. 20

సీ. దనుజఘోరతపోగ్రతకుఁ దలంకినమాడ్కిఁ
గమలినవెత్తమ్మి కన్ను మూయ
వ్రతము వేఁడిమి వెమ్ము దిలిజు మేనికి నోడు
క్రమమునఁ గడలుఁ దీరమున కొదుఁగ
నసుర వెచ్చనియూర్పు [1]లడరఁగ నింకెడు
నీటి [2]మాఱనమంచు నీరుగురియ
జలదేవతలు దైత్యుకలితనం బగ్గించు
[3]సెలువున సారసోక్తుల్లు చెలంగ
గీ. దివిజవైరితపము తెఱఁగెల్లఁ గంటికి
నిదుర లేక చూచునదియుఁబోలె
వికచకుముదనేత్ర విభవ యై [4]రేలఁ జె
న్నొందె దానవేంద్రుఁ డున్న సరసి. 21
వ. మఱియు నమ్మహావ్రతుండు తపోవిశేషాభిలాషంబు దనకుం
బరిపోషణం బొనరింప నిర్దోషహృదయుండై కడంగి. 22
తే. [5]వేళ్లఁ దూండ్లఁ గూరలఁ గొంత నీళ్లఁ గొంత
గారవమునఁ దపోయాత్రఁ గోరి నడపె
గాడ్పు గ్రోలుచు మఱికొంతకాల ముండె
వెండి యాచందమునన దా విస్మయముగ. 23
వ. ఇవ్విధంబున ననేక సంవత్సరంబులు ధీరవ్రతాచారుం డై
యున్న యాదైతేయతాపసుతపంబు పెంపునకుం . దలంకి

---

1. లడరెదునింకెడు. 2. మారనమంచు. 3. సెలగున. 4. రేలు
జెన్నొందె. 5. వేళ్ళదిండ్ల.

పురందరుండు దేవగురునాశ్రమంబునకుం జని నమస్కరించి యతనిచేత నాశీర్వచనంబుల నభినందితుం డై యి ట్లనియె.

మ. జనకుం డొక్కఁడ వేఱుతల్లులు జగత్సామ్రాజ్యపూజ్య
స్థితుల్, దనకుం బా లనుచున్ సమత్సరమతిన్ దైతేయుఁ
డత్యుగ్రద, ర్శనదుర్వారతపస్కుఁ డయ్యెఁ గరుణాసంపన్నుఁ
డౌ ధాత పట్టున ప్రత్యక్షత[1]నొంద మత్పదవి వేఁడున్
వాఁడు నెబ్భంగులన్. 25

క. అసురతపంబు జగంబుల
కసహ్యమై యునికిఁ జేసి యంబుజభవుఁడున్
వెసఁ దత్ప్రశమనమునకై
యసంశయము దివిజరాజ్య మతనికి నొసఁగున్. 26

క. నిను నాశ్రయించియును నే
ననఘా కడలేనివనట యనువననిధిలో
మునుఁగుదునె ప్రతీకారం
బొనరింపఁగదయ్య దీని నూహించి కృపన్. 27

చ. అనుటయు దేవమంత్రి దరహాసముతో దివిజేంద్రుఁ జూచి యి
ట్లను; నిది యేమి భీతిలఁగ నంచితసత్యతపోనిరూఢి నీ
కనినపదంబు ద్రిప్పఁగ జగత్పతిపద్మజు కైనఁ బాడియే
విను దితిసూనుఁ డివ్విధము వేఁడెద నన్నను నాలుకాడునే.

వ. అదియునుంగాక. 29

సీ. ఏదేవుతుద మొద లెఱుఁగక నేఁడును
శ్రుతిమార్గములు బహుగతులఁ దిరుగు

1. నొంది.

నేదేవు నాత్మలో నీక్షించు ధన్యులు
ప్రార్థనీయులు పద్మభవుని కైన
నేదేవులీలలై యొసఁగుజగంబులు
సృష్టిరక్షా[1]సము పేక్షఁ బరఁగు
నేదేవునకు సాటి యేదేవుఁడును గాఁడు
నానాగమోక్తనిర్ణయము లొప్ప

గీ. నట్టియాదిదేవునంబుధిశయను ల
క్ష్మీకపోలముకురమితముఖాబ్జు
నాశ్రయించినాఁడ వతఁడు నీయెడఁ గృప
గలఁడు నీకు నేల [2]కలఁగ ననఘ. 30

ఉ. పొందవు దుఃఖముల్ భయము పొందదు పొందదు దైన్య
మెన్నెయిన్, బొందవు తీవ్రదుర్దశలు పొందుఁ బ్రియంబులు
పొందు సంపదల్, పొందు సమగ్రసౌఖ్యములు పొందు
సమున్నతకీర్తులెందు గో,విందపదారవిందపదవీపరిణద్ధగరిష్ఠ
చిత్తులన్. 31

క. తను నెబ్భంగిఁ దలంతురు
జను లాభంగిన తలంచు సరసీరుహాలో
చనుఁడును వారలఁ గావున
ననిశంబు కృతార్థమతులు హరిపదభక్తుల్. 32

క. హరిభక్తులతపము తపము
హరిభక్తులజపము జపము హరిభక్తులభా
సురజన్మము భవసారము
హరిభక్తులు భువనపావనైకవిహారుల్. 33

---

1. సమాపేక్ష. 2. కలుఁగఁదనఘ.

క. హరి యను రెండక్షరములు
దొరకొనఁ దీపాసఁగు జిహ్వాతుది నెవ్వని క
న్నరుఁ డొకఁ[1]డిభ్యుఁడు భవసా
గరనిస్తరణప్రకారకౌశలమునకున్. 34

సీ. దారుణదురితాంధకారసూర్యోదయం
బధికపాతకవిపినానలంబు
నిబిడకల్మషమేఘనిర్భరపవనంబు
బాధపాపాంబుధిబాడబంబు
క్రూరకిల్బిషశైలకులిశనిపాతంబు
ఘనకలుషోరగగరుడమూర్తి
ఘోరదుష్కృతకాలకూటగంగామాళి
యతులాఘుహారిణపంచాననంబు

గీ. సకలకల్యాణమూలంబు సకలవేద
[2]శాస్త్రసారంబు సకలార్థసంచయంబు
సకలమంత్రరహస్యంబు సాధుహృదయ
నర్తనము విష్ణునామసంకీర్తనంబు. 35

శా. వేదాంభోధి మథించి వెండియు మహావిస్తీర్ణశాస్త్రార్థసం
వాదంబుల్దలపోసి చూచి బలువై వర్తిల్లులోకోక్తియుం
గాదా నంచు గణించి యొక్కతలఁపై కాదే మునిశ్రేణి సం
పాదించెన్ హరిసేవనంబుఁ దగ సంభావ్యంబు సేవ్యంబుగన్.

ఉ. శ్రీస్తనకుంకుమద్రవనిషిక్తభుజాంతరభాగవిస్ఫుర
త్కౌస్తుభరత్నమూత్నరుచిగర్వితనాభిసరోజసౌరభ

1. దభ్రిఁడు. 2. శాస్త్రవారంబు.

ప్రస్తుతమత్తభృంగరవరాగరసోల్బణభోగిభోగత
ల్పాస్తరణుం దలంచుసుకృతాత్ము లపాస్తసమస్తకల్మషుల్.

వ. అని పలికి యాఖరదూషణశోషణ [1]కారణంబు నఖిల దురితోత్తారణంబైననారాయణమంత్రంబు సవిశేషసంస్కారంబుగా నుపదేశించి యిది పరమగోప్యంబైనజప్యంబు నీవు నియతమానసుండవై దీనిని సేవింపుము దుస్థితు లెయ్యవియు నిన్నుం బొరయలేకున్నట్టు నిమ్మహావాక్యప్రభావంబు భావింప నెవ్వరికి నశక్యంబు. 38

తే. అంబుజాసనుఁ డాదిగా నాద్యు లెల్ల
నిమ్మహామంత్రపరమార్థ మెల్ల నాఁడు
నాత్మఁ గన్గొని ముదమంది యాచరించి
యభినుతించి భజింతు రత్యంతనియతి. 39

వ. హిరణ్యకశిపుతపోవిజృంభణంబునకు భయం బందవలవదు. దైత్యులయైశ్వర్యం బయ్యును దుదిముట్టనేరదు. నీరజోదరుతోడిమాత్సర్యంబు కార్యంబుగాఁ దలఁచువారికి నేరూపంబున నిత్యోన్నతులు గలుగ నేర్చునె? విష్ణుద్వేషంబును నిరంతరదోషంబును శ్రుతిధర్మవిరోధంబును సుజననిరోధంబును నసురస్వభావంబులు గావున. 40

క. నారాయణవిద్విషులకు
క్రూరుల కాయువును శ్రీయుఁ గులము బలంబుఁ
బేరును బెంపును బోలియును
ఘోరనరకకూపములను గూలుదురు తుదిన్. 41

1. పరాయణ పదద్వయనిరాకరణ.

తే. విష్ణుఁ డిహపరదైవంబు విష్ణుదేవు
నొల్లమియ యిహపరముల నొల్లకునికి
విష్ణుపదభక్తిభావపవిత్రుఁ డగుట
గైహికాముష్మికప్రీతి నందఁ గనుట. 42

మ. అనువాచస్పతిభాషణంబులకు నాహ్లాదంబు సంధిల్లన
య్యనఘుం డచ్యుతపాదసంస్మృతిరసైకాయత్తచేతస్కుఁడై
మునివంశోత్తము నంఘ్రిపద్మము శిరంబుం జేర్చి వీడ్కోలు తం
డానరింపన్ జనియెన్ పురంబునకు నిత్యోద్భాసితైశ్వర్యుఁడై.

వ. చని వెండియు వివిధవితర్కజనితపరిస్పందం బగుడెందంబు
డిందుపఱుపనేరక సురవిభుం డసురతపంబునకు నపాయం
బాపాదించు నుపాయంబు ప్రయోగంబుచేయుట మేలు కాక
యని తలంపుపుట్టిన నప్పుడ రంభాప్రభృతు లగు నప్సరో
వనితలం బిలిచి గౌరవంబుగా నేకాంతంబ యక్కాంతల
కి ట్లనియె. [ల్

శా. లావణ్యోదయముల్ ప్రియంబులుచితాలాపమ్ము లాటోపము
భావంబుల్ చతురస్వభావములు చెప్పం బెద్దమీయందు మీ
కీవిశ్వంబున గెల్వఁ గూడనివిభుం డేవాఁడు లేఁ డిప్పుడున్
దేవేంద్రస్థితి మీరు కల్గుటఁ గదా దీపించె రూపింపఁగన్.

ఉ. మించినపేర్మి నేయెడల మిన్నులుముట్టి వెలుంగునట్టిమా
యంచుల[1]కైదువున్ తృణకణాకృతియై వెడబాయఁజేర్చి ద
ర్పించిన ధీరచిత్తములఁ బెల్కుఱనాటి [2]కలంప నాకు మీ
యంచితచారుచంచలకటాక్షము నమ్మినయస్త్ర మిమ్మెయిన్. 45

---

1. కైదువుల్. 2. కలంక.

సీ. ఉల్లంబు మీఁచూడ్కు లుచ్చిపోకకుఁగదా
వాలమ్ములకు నోర్చు వారికోర్కి
మీ క్రొవ్వుఁజన్నుల మీఁదియున్కియగదా
వ్రతముల నరిగెడు వారియాస
లీలమీ కెమ్మోవి గ్రోలుటకై కదా
వడి సోమరస మాను వారితృష్ణ
మీయింపుఁగూటమి మెఱయుటకై కదా
వనితలఁ దొరఁగెడు వారితివుట

గీ. పుణ్యసస్యంపుఁబంటలు భూరినియమ
తరుఫలంబులు సౌఖ్యాధిదైవతములు
నిఖిలసంసారసారంబు లఖిలలోక
రత్నములు మీర లప్సరోరమణులార! 47

ఉ. మానము [1]ప్రోదిగా నియతిమాత్రముగాఁ బొడవై ధరిత్రినె
వ్వానికి వ్రాలకున్న గరువంపు[2]శిరంబును వంచఁ [3]జూచు ను
న్నానమహత్త్వధన్యుఁ డగుమానిసి యైనను రోషవిభ్రమ
భూరినటనాభిరామ లగుపొల్తుల పాదతలంబుచేరువన్. 48

చ. వ్రతములఁ [4]గొచ్చి శీలముల వ్రచ్చి జపంబులఁ గ్రోలి
యుత్తమ,క్రతువులఁ దోలి యోగములు గ్రాఁచి తపంబుల
వేఁచి [5]యెందు న, ప్రతిహతలీలమై మదనుబాణచయంబుల
తోడుసీడలై,ధృతులు తలంచుచుండు సుదతీమదతీక్ష్ణకటాక్ష
కోణముల్. 49

---

1. ప్రోదిసై 2. శిరంబును 3. జూచుచు 4. గొల్చి 4. యందు

సీ. చామల నగుమోముఁజందురు పొడవున
రాగాంబుధులు నిట్ట గ్రమ్ము ననుట
పొలఁతులనునుదీప్తుఁబలుకులయింపున
నుల్లంబు నోలంబు నొందు ననుట
మెలఁతల తఱచు రెప్పలవలిగప్పులు
జవనంపుఁజీఁకటిగవియు ననుట
చెలువలనిద్దంపుఁ జెక్కులచాయల
భావము ల్వొలవెలఁ బాఱు ననుట

గీ. యద్భుతంబు లై విపులభవాబ్ధిఁదిరుగు
జనులహృదయంబు లనియెడుజలచరములు
లీలఁదిగువంగ వలరాజు కేల నున్న
బలువలలుగావె కాంతలచెలువు లెల్ల. 50

క. కావున మీ రెఱఁ గంతయు
భావించి జగద్ధిత మగుపని యొక్కటి సం
భావముతో మిముఁ బనిచెద
నేవిధమున నైన నిర్వహింపఁగవలయున్. 51

క. దితిజుఁడు హిరణ్యకశిపుఁడు
వ్రతచర్యానిష్ఠ నున్నవాఁ డాతని ధీ
రత గంభీరతయును విక
లత నొందింపుఁడు భవద్విలాసప్రౌఢిన్. 52

ఉ. మీ రిటువూని యీక్రమము మేకొని చేసిన దివ్యరాజ్యల
క్ష్మీరమణీయమై భవము చిందిలిమందిలిగాక దక్కుఁ బెం

పారఁగ నాకు నాకుల జరామరతాగరిమం బొకింతయుఁ గా
వేరు నొగంగనీ [1]కడరఁ బ్రీతి భుజింతు [2]రభీష్టభోగముల్.

చ. చనుఁ డసురేంద్రుఁ డున్న వికచద్రుమపుష్పసుగంధిగంధమా
దనవనభూమికిన్ భవదుదంచితయోగ్యసహాయలీల కై
పనిచెద నీక్షణంబ మధుపవ్రజకోకిలకీరమీనకే
తనమధుమానసాస్పదసుధాకరదక్షిణమారుతంబులన్. 54

వ. అనిన నయ్యింతు లందఱు నట్ల కాక యని యియ్యకొని
రప్పుడు తిలోత్తమ యయ్యమరోత్తమున కిట్లనియె. 55

సీ. ఏను గ్రీఁగంట నొక్కింత చూచిన
ఖలుడెంద మైనను గరఁగు ననిన
నాయింపుఁబలుకు కర్ణములు సోఁకినఁ బితా
మహుఁడైనఁ జపములు మఱచు ననిన
[3]నేఁ దియ్యమున నటియించిన హరుఁడైన
మరునికన్నులసన్నఁ [4]దిరుగు ననిన
నారూపు చూచిన శౌరియు నహితల్ప
[5]మురలి పల్లవశయ్యఁ బొరలు ననిన

గీ. [6]నఱితి రైనఁ దాల్మి యను కైన నుల్లంబు
చులక నైన [7]జపము లులక నైన
నేమములతపంబు నిల్చునె నాయెదు
రెదుర నధిప మాట లేల యింక. 56

1. కడరు 2. నభీష్ట. 3. ఏను దియ్యమున నటించిన. 4. దఱుగు.
5. మురఁగి. 6. నరతి. 7. దపము.

క. చూఁచెదవు గాక యే నిటు
చూచిన నయ్యాసురతపము సొంపఱి వ్రతని
ష్ఠాచరణము తూపర మగు
గోచరమై మనసు తృప్తిఁగొని సోలంగన్. 57

వ. అని పంతంబులు పలికిన యమ్మగువమాటకు మరున్నాయ
కుండు మనంబునం బ్రమదంబునొందె నయ్యిందువదనలందఱు
పురందరు వీడ్కొనిచని గంధమాదనంబుఁ జొచ్చి రంత. 58

క. వారలతోడనె యాత్మ
స్ఫారవిభవ మెల్లఁ గొని వసంతుఁడు దనయా
కారంబుఁ జూపె నక్కాం
తారంబున శిశిరసమయదర్పా[1]పహుఁడై. 59

చ. ఇదె చనుదెంచెఁ జైత్రుఁడని యెల్లవనంబులకుం బ్రమోద
ముల్, పొదలఁగ [2]మేలివార్త గొని బోరున వచ్చిన దాడికాఁ
డన, న్మృదుపవనదేవతాముఖసమీర మెదుర్కొన నుల్లసిల్లె
నిం, పొనవఁగ దక్షిణానిల మనూనమనోహరఖేలనంబునన్.

ఉ. పండిన [3]యాకుడుల్లి నవపల్లవముల్ తిలకింపఁ బూఁబొదల్
నిండఁగఁబర్వె లేఁగొనలు నిద్దములై నిగుడంగ మ్రాకు లొం
డొండఁదలిర్చె నామనిసముజ్జ్వలయోగరసాదనక్రియన్
[4]గొండికపాయముల్ మగుడఁ గోరి భజించినసిద్ధులో యనన్.

ఉ. ఎందును బుష్పసౌరభమ యెందును మందమదాలి ఝుం
కృతుల్, ఎందును సాంద్రపల్లవము లెందును గోకిలకంఠ
కూజితం, బెందును విస్ఫురత్ఫలము లెందును గోమలకీర

1. పహుఁడై. 2. మేని. 3. మ్రాకు. 4. నొండొక.

భాషితం, బందము లయ్యె మందమరుదంచితచారువనాంత
రంబులన్. 62

తే. సరస కింశుకకోరకసంచయంబు
చెలువు తిలకించె భావినృసింహదేవు
[1]దీప్తనఖపంక్తి ప్రకటదైతేయరుధిర
సేకరుచి నొప్పు తెఱఁగు సూచించినట్లు. 63

ఉ. కాముఁడు లోక మంతయును గైకొని పట్టము గట్టికొన్నఁ బే
రాముని సేయుపండువులయం దొడఁగూడినదివ్యగంధముల్
నా మెఱుఁగారుక్రొవ్విరు లెలర్చినసంపెఁగ లొప్పెఁ గామసం
భావిమితకామిచిత్తశలభంబులు గ్రందుగఁ [2]జెంది మ్రందఁగన్.

చ. అవిరళచారుకోరకచయంబులలోకములంద నూడ్చులం?
దవులఁగఁ జేసె నెల్లెడలఁ దద్వన[3]భూములు, గాఢరాగముల్
యువతులచిత్తవృత్తముల నూన్ప ననంగుఁడు సంగ్రహించె
నాఁ, బ్రవితతలీలఁ బెల్లెసఁగెఁ బల్లవసంతతి గుత్తులోయనన్.

చ. తనియక కమ్ములిచ్చి చవి దాఁకినచొక్కునఁ గన్న[4]మ్రాలఁ
జం, చునఁ జవి కాటుగాఁ గఱచు చున్నవచూతజపల్లవంబు గై
కొని విహరించుకోకిలము కొమ్మల తియ్యని మావి మోవి
మోహానరుచిఁ బాసి వందుపథికావలికిం కటఁ జేసె[5]నావనిన్.?

సీ. అంచబోదల మోద మారంగఁ జెక్కిళ్లు
గొట్టుచు నెలదూఁడుకొనలు నలుప
నలిబాలికల ముదం బెలరారఁ బింపిళ్లు
గూయుచు మధువులు గ్రోలి సోల

1. దీప్తి. 2. జెందు. 3. భూముల. 4. వ్రాల. 5. నావనిన్.

[1]జక్కవదో లక్కజపు వేడుకల దిమ్మ
[2]దివ్వురున నకరువుల్ దిగిచికొనఁగ
మలయానిలుఁడు గర్వ మలరంగ గుఱువులు
వాఱుచు నెత్తావిచూఱలాడఁ

గీ. బసిఁడిగద్దియ[3]యాదుద్దు పైఁగరంబు
ప్రీతినెలకొన సిరి పేరుఁ బెంపుఁబడయఁ
గామినులచూడ్కి రేఖలకాంతి వడసి
దర్పమునఁ గ్రాల నొప్పారెఁదమ్మివిరులు. 67

చ. వలివిరవాదిక్రొవ్విరులవాతుల మాతులువెట్టి తేనియల్
కొలఁదికి మీఱఁ గ్రోలికొని కొవ్వున జివ్వల నీన నొక్కమై
దలముగ డీటు గట్టుకొని దాఁటెడుతేఁటులచైద మెల్లెడఁ
గలయఁగ వృక్షవాటికలఁ గ్రమ్మెన కాలతమోనికాయముల్.

తే. పొగడ[4]మ్రాకు మొదళ్లను బుష్పరసము
దొరఁగి నెత్తావియందును నెరయ నొప్పెఁ
బూచుకొఱకు నై మున్నయింపులు దలిర్పఁ
గడఁగి వనలక్ష్మి యుమిసినకళ్లు యనఁగ. 69

క. పూఁచినయశోకములయం,
దేచినతుమ్మెదలరవము లింపెసఁగెఁ బోరిం
దాఁచువనదేవతల చర
ణాచలితము లైనయందియలమ్రోఁత యనన్. 70

చ. విలసితచంద్రకాంతమణివేదులపై మృదుమారుతాహతిం
దలముగఁ బ్రాలి తానవిగఁ దాఱనిపువ్వు లయత్నశయ్య లై

---

1. జక్కవడో. 2. దివురన కరువలి. 3. గాగ్రుద్దపై. 4. మ్రాకులమొదలను.

పొలుపుగ మాధవీవలయముల్ తరుణీతరుణవ్రజంబులన్
బిలిచె మనోజలీలలకుఁ బేర్చు మదాకులభృంగగీతులన్. 71

చ. చిలుకలపిండు నొప్పిదము చిత్రసురాయుధలీల యేపునం
[1]జెలఁగ మధువ్రతావలులచిక్కనిమ్రోఁతను గర్జ లుల్లస
త్ఫలరసపూరముం దెరలఁ బర్వుట [2]సొధలు గాఁగ మేఘ
పంక్తుల క్రియ నొప్పు భూరుహతతుల్ మధువేళఁ బయోద
[3]వేళ నాన్,

చ. మనసిజమంత్రఘోషములు మన్మథునానతిమాట లిందిరా
తనయవిలాసహాసములు దప్పకునార్పుటెలుంగు లంగజ
న్మునిచదువుల్ మనోభవునిమోహనగీతు లనంగఁ జారు ఖే
లనములు నెల్లదిక్కులఁ జెలంగె మదోత్కటకోకిలధ్వనుల్.

చ. అరుదుగఁ దేఁటిత్రేఁగె గొనయం బెసకం బగుపచ్చవింటిని
బ్బరముగ మోపి కెందలిరుబత్తడికం బరువంపుమావిక్రొ
వ్విరిబలుగాఁడితూఁపు లిడి వీరపుగర్వము నెమ్మనంబులోఁ
బిరిగొనఁ దోలితొప్పరలఁ బెట్టె ననంగుఁడు పాంథలోకమున్.

సీ. వెలయు నీవెన్నెలవెల్లికాంతులసిరి
పిఱుఁదుదీవులు చేరి మెఱయ కున్న
వెలయు నీవెన్నెలతెలుపునఁ జామల
చూపు చీఁకటిఁ జొచ్చి పొగగ కున్న
నెనయు నీవెన్నెలతనుపున నింతుల
ఘనకుచంబుల [4]యుమ్మ గదియ కున్న

1. తెలఁగు. 2. సొదులుగాక. 3. వేళలన్. 4. యుఁమ్ము,

నొదవు నీవెన్నెలయురవడిఁ బోలఁతుల
తమకంపుఁజెయ్వులఁ దగల కున్న
గీ. మునిఁగిపోరె మన్మథున కగ్గమై పోరె
చాలఁ గొంకువోరె తూలిపోరె
యనఁగ నుల్లసిల్లె నామనిరే లతి
స్ఫారసారసారసాంద్రరుచులు. 75
వ. ఇట్టివసంతసమయంబునందుఁ బురందరాదేశంబు నెఱపం బూని
చను దెంచినవనజలోచన లద్దనుజతాపసునివాసంబును ముని
సిద్ధగంధర్వసేవితంబు [1]నైన యావనంబున. 76
సీ. కమనీయకరపద్మ కాంతిపల్లవములు
కోమలస్మితదీప్తి కుసుమములును
జారుపయోధరస్ఫారగుచ్ఛములును
లలితబింబాధరోజ్జ్వలఫలములు
సురభినిశ్వాసభాసురగంధ[2]పవనము
లుచితసల్లాపకీరోక్తములును
గలమధురోద్గీతకలకంఠరవములు
కాంచీనినాదభృంగస్వనములు
గీ. నతిశయిల్లంగ మధుసమయాధిదేవ
తలు శుభాకారలీలలు దాల్చి రనఁగ
నెమ్మి పుష్పాపచయకేలినెపమునఁ బెట్టి
యందుఁ జరియించి రింపార నిందుముఖులు. 77
క. క్రమమున నాటలపైఁబడి
[3]యమరాంగన లమరవైరి కంతను [4]నింతకా

---

1. బై. 2. పవనములునుచిత. 3. నమరాంగన. 4. వింతకా.

సమదగతిఁ జేరి తమయిం
పమరెడుచెలువున నటించి రభినవభంగిన్. 78

చ. [1]కదలఁ గుచద్వయంబు వడఁక న్దనుమధ్యము కక్షదీధితుల్
చెదరఁగమోము లేఁ [2]జెమటఁ జెన్నొదవన్ బొలపంబుగన్దవం
బొదలఁగఁ గంకణస్వనము పొల్పెసలార సుమాస్త్రుదర్పముల్
ముదరఁగ నుల్లసిల్లె నొకముద్దియ కందుకఖేలనంబునన్. 79

ఆ. పిఱుఁది పెంపువ్రేఁగుపఱుపనందంద ప
య్యెద దొలంగఁ జన్ను లదర నంది
యలు సెలంగ నలసయాన మెలర్ప రా
యంచఁ బట్టఁ దిరిగె నబల యోర్తు. 80

సీ. మునికాళ్లు మోపి నిక్కునఁ బదచ్ఛవి నేల
యును బల్లవించిన యొప్పు మెఱయ
[3]వలులేది నతనాభి జెలసి యొక్కింత సా
గినమధ్య మెంతయు ఘనతఁ దీయ
మొగ మెత్తి మీఁదికి నిగిడించుచూపులఁ
గన్నులవిప్పెల్లఁ గానఁబడఁగఁ
గడలొత్తుకరమూలఘనకాంతి చూపఱ
డెందంబుతో నిక్కి డెక్కొనంగ

గీ. నొయ్య డాకేల దవ్వుల నున్నతీఁగఁ
దిగిచి నఖదీప్తు లంతంత దీటుకొనఁగ
లీలఁ బెఱకేల నచ్చరలేమ యోర్తు
గోసెఁ బువ్వులు ప్రమదవికాస మెసఁగ. 81

1. కదలుకుచ. 2. జెమట చెన్నొదవన్. 3. వలలేది.

తే. ఓర్తు కరతాళ మొనరింప నోర్తు సమద
గీతి పచరింప సరితాళగింప నోర్తు
మధురమదిరా[1]రసోల్లాసమత్త యగుచు
నాడె నొక్కతె లలితాంగి హారిగతుల. 82

సీ. అమృతంపుసోన పై నడరినట్లే పాట
చెన్నున మోరళ్ళఁ జివుళు లొత్తె
మారుతాహతిపేర మ్రాకులు దల యూఁపఁ
దొడఁగె [2]మరందమాధుర్యమునకు
నింపులగమి దైనయీరాగరసము దీఁ
గలకుఁ గోరకపులకముల నొసఁగె
సెలయేఱులకు నశ్రుజలములు దొరగించె
గిరులును మంజులగీతిఁ గరఁగె

గీ. ననినఁ బోలుఁ బొసఁగు నగుఁ దగు ననఁగ స
చేతనంబు లెల్లఁ జిత్రరూపు
నట్లు సోగి నిలువ నంగన యొక్కతి
[3]పాడెఁ గలమనోజ్ఞభంగు లలర. 83

క. జంకెలు బుజ్జవములునుం
గింకలు దళుకొత్త నోర్తు గీరంబులకుఁ
నంకలు జదుళ్లు కరములు
నంకణముల సదువు గరపె హాసితోక్తులచేన్. 84

సీ. కెమ్మోవితావికే గ్రమ్ముతుమ్మెదగమి
తూలెడు కురులలోఁ దొడిఁబడంగఁ

1. రసోలస. 2. మృధిరణ. 3. పాడఁగలమనోజ.

జలితకర్ణోత్పలదళముల కాంతి న
పాంగదీప్తులు రెంటఁ బరపుగాఁగ
సీమంతమునఁ బొల్చు సేసముత్తియములు
బెరయు [1] క్రొమ్ముడికమ్మవిరులు దొరుఁగ
నాందోళనశ్రాంతి సమరుపాలిండ్లపైఁ
జెమటబొట్టులు హారసమితిఁ బ్రోవ

గీ. వళులలావున నలికొను బలిసి నిలువఁ
జూచువారిచూడ్కికి నొప్పుచూఱ లిడుచు
లీలఁ బాడుచుఁ దీఁగయుయ్యాలనెక్కి
పోయియూఁపఁగ నొప్పారెఁ బొలఁతియొకర్తు. 85

చ. వలపల డాపలన్ వరుసవాలు గనుంగొనఁ జూపు లార్చుచున్
దిలకము దీర్చుచున్ గురులు దీటుచు వీనులమానికంపుటా
కులఁ బొరిఁ ద్రిప్పుచున్ దశనకోరకము ల్వెలయంగ మోవిమె
ప్పలరఁగ మోము [2] విచ్చుచును నద్దముఁ జూచె నొకర్తు
వేడుకన్. 86

వ. ఇవ్విధంబున మదనవికారకారణంబు లగువిభ్రమవ్యాపారం
బులఁ బ్రవర్తిల్లునయ్యంగనల తెఱంగునకుఁ గరంగనియంత
రంగంబు నిస్సంగంబగునంబురాశియుంబోలెఁ బొలుపు
మిగుల నాదైత్యతపోధనుండు. 87

మ. పురుషాకారముతోడ నున్నసిరియో పుంస్త్వంబు లేదో
యటే, తరువో పుత్తడిరూపొ చిత్తమును జైతన్యంబు
శూన్యంబోకో, విరసత్వంబులప్రోవొ [3] నిశ్చలకళావిజ్ఞానసర్వ

1. క్రమ్మడి. 2. లిచ్చుచును. 3. నిర్ఝర.

స్వామీ, యరు దీచంద మనంగ నిల్చె [1]ధృతియం దస్పంద
మందస్మితిన్. 88

వ. అంత. 89

సీ. కలయంగ నడవిలోఁ గాచినవెన్నెల
లై చారుహాసంబు లవిధిఁ బోవఁ
బ్రతికూలవిధికిఁ జేపడినయత్నంబు లై
చూచినంతటఁబోక చూపు లొదుఁగఁ
బాట లన్నియు నాటపాటలై చెవిటికూఁ
దిన సంకువిధమునఁ దేరఁజనఁగ
నాటలు పసిబిడ్డయాట లై పెంపఱి
యొరులయాటలఁ బడ నోగితముగ

గీ. గర్వములు బెండుపడఁ గౌతుకములు ముడుఁగ
నదటు లాఱడివోవఁ బ్రల్లదము లడఁగ
నసుకచిత్తంబు గానఁగ నలవి గాక
సిగ్గువోయిరి యచ్చరచెలువ లెల్ల. 90

ఉ. ఆతనినిష్ఠయుఁ ఘననిరాకులధైర్యము దన్ను నెంతయుం
బ్రీతుని గా నొనర్పఁ గృపపెంపు దలిర్ప సరోజసంభవుం
డాతతసిద్ధసంయమిగణావృతుఁ డై మహనీయహంసవి
ఖ్యాతమనోజ్ఞయానమున నచ్చటికిం జనుదెంచె నత్తఱిన్.

ఉ. చాలుఁ దపంబు చాలఁగఁ బ్రసన్నుఁడ నైతి వరంబు లిత్తు నీ
లోలత యేర్పడంగ నతిలోకనుతవ్రత వేఁడు మన్న వా

1. ధృతియందస్పంద.

చాలవరేణ్యుఁ డంబురుహసంభవుమాటలు వీనులందు ధా
రాళసుధారసప్లవనరమ్యము లై ప్రమదం బొనర్పఁగన్. 92

తే. చక్క జాగిలి మ్రొక్కి యంజలిపుటంబు
ఫాలిఁ గదియించి నిలిచి సముచితార్థ
మధురబహువిధస్తోత్ర సమ్మద్రచన
మున్నుగా నతఁ డిట్లని విన్నవించె. 93

క. దేవర ప్రసన్నుఁ డగునట్టె?
సేవకులకుఁ బడయరానిసిద్ధియుఁ గలదే?
భావితవివిధైశ్వర్యశు
భావహము గదా భవత్కటాక్షం బెందున్. 94

వ. కావున నసురేంద్రత్వంబు నాకు · గృపసేయవలయు నిదియ
మదీయాభిలాషం బనినఁ బితామహుం డసురేంద్రున
కిట్లనియె. 95

చ. సమధికపూర్వదేవకులసంజనితుండవు నీవు నీకు న
య్యమరపదంబు దక్కువ సురాధిపతిత్వము నీక [1]డెంత య
య్యమరవరేణ్యసంపదకు నగ్గల మై పెనుపొందు వైభవం
బమరుట యేమిటం గలుగు నట్టివరంబుఁ దలంపు మింపుగన్.

క. అనినఁ దగువరముఁ దన నె
మ్మనమున నూహించి యసుర మఱి యిట్లనియెన్
వనజభవుఁ డింక వీఁ డే
మని వేఁడునొ యనుచు నాకులాత్మత [2]నొందన్. 97

1. యంత. 2. నొందన్.

సీ. దేవకులంబుచే దేవయోనులచేతఁ
బితృకోటిచే దైత్యవితతిచేత
గ్రహములచేఁ దారకములచే మునులచే
ననలసమీరతోయములచేత
నరులచే గిరులచేఁ దరులచేఁ బశుమృగ
పక్షిదంశకకీటపంక్తిచేత
నసికుంతశరపరిఘాద్యాయుధములచేఁ
గాష్ఠపాషాణసంఘములచేత
గీ. నవసి నంతరిక్షంబున దివమునందు
వాసరంబులయందు శర్వరులయందు
నా కపాయంబు లేకుండ లోకవంద్య
యిమ్ము మఱి యెవ్వియును నొల్ల నింతనిజము. 98
తే. అనిన నిచ్చితి ననియెఁ బద్మాసనుండు
దైత్యపతియు మహాప్రసాదంబు దేవ
యనుచు నౌఁదల మోడ్పు కేలమర [1]నొప్పె
హర్షపులకాంకురాలంకృతాంగుఁ డగుచు. 99
వ. వనరుహసంభవుండు దితిసంభవునిఁ బ్రభూతవరదానసంభావితుం జేసి నిజనివాసంబునకుం జనియె, నసురేశ్వరుండును నవనందానందమందస్మితసుందరుం డగుచు నాత్మగృహంబునకుం జని జననికి నమస్కరించి తద్వృత్తాంతం బంతయు నెఱింగించి తదభినందితుం డై ప్రియానుజుం డైన హిర ణ్యాక్షుఁ [2]డనుమోదింపఁ బెంపారుచున్న సమయంబున నమ్మహావీరులతపోలాభంబునకు నభినవోల్లాసంబునం బొంగు

1. నొప్పె. 2. ననుమోదింప.

నంతరంగంబులతోడ నముచిపులోమబలరామశంఖకర్ణవిప్ర[1]చిద్ధయగ్రీవప్రముఖు లైనదానవు లనేకులు చనుదెంచి యతనిం గని సముచితసల్లాప[2]సత్కారంబులు వడసి యతని కిట్లనిరి. 100

మ. దితిసంతానము దానవాన్వయము నీతేజంబు నిత్యోర్జిత
స్థితి నేపారుటఁ జేసి నేఁడు దల యెత్తెన్ వేర్చి యీదైత్యసం
తతి యంతంతకు నీసుమీ యెఁ [3]బరమ దోర్దర్పంబు [4]సొంపేదఁగా
ధృతిదూలం[5]బడిపాఱి దప్పిరి సెన్ దేవాహిత [6]శ్రేణియున్.

ఉ. జన్నములుం బరాన్నములుఁ జాలఁగ మ్రింగి కరంబుఁ గ్రొవ్వి
పేర్పన్నునఁ గ్రాలునచ్చరలయాటలు చిత్తములన్ గరంపఁగాఁ
గిన్నరవల్లకీమధురగీతులు వీనుల కింపుఁ బెంపఁగాఁ
జెన్నుగ నుండి మమ్ము నొకచీరికిఁ గైకొన రాదివౌకసుల్.

మ. హరి తనకు న్గలం డని పురాంతకుఁ డామురవైరి సేఁత లె
ప్పురుసన మాన్ప నోల్లఁ డని పద్మభవుండును నాత్మలోన ని
ర్జరులకు మేలు గోరు నని సంయమికోటితలంపుల న్నిజ
స్ఫురణము యావహించు నని పొంగుచు నుండు మహేం
ద్రుఁ డెప్పుడున్. 103

ఉ. అట్టిసురాధినాథునద టంతయుఁ బాపి నిలింప[7]వర్గపుం
దట్టము లొగ్గి తాపసులదైన్యము పాల్పడఁ జేసి లోకముల్
గట్టిగ నీవ యేలుము ప్రకాశితదైత్యకులాభివృద్ధికై
పట్టము గట్టి మమ్ముఁ దగఁబంచి పను ల్గొను మీశ్వరుండ వై.

1. జిత్తుహయగ్రీవ. 2. సంస్కారముల. 3. బరప. 4. సొంపొం
దఁగా. 5. బడుపాటదప్పి, 6. దేవాహితశ్రేణికిన్. 7. వర్గముల్.

వ. [1]అని పల్కిన నసురులు తత్క్షణంబ భృగువంశభవ్యుండగు
కావ్యు నచ్చటికి రావించి తదుపదిష్టప్రకారంబునం దొడంగి
మయనిర్మితమాణిక్యమయమహితసింహపీఠంబున నమ్మహాను
భావు నునిచి భార్గవపురస్సరంబుగా నఖిలతీర్థోదకంబుల
నభిషేకంబుగావించి దైత్యదానవరాక్షసాన్వయంబునకుం
బలివి గమ్మని పట్టంబు గట్టి వివిధాశీర్వాదంబుల నతనిం
బ్రస్తుతించిన నసురులయార్పులు నిస్సాణపణవకాంస్యకాహ
ళాదితూర్యంబులయులివులు దిక్కులు వగిలించె నంతం
బోవక దిక్పతులడెందంబుల గారించె నంత. 105

ఉ. దానవనాథునౌఁదల నుదగ్రత నొప్పునవాతపత్ర [2]మ
మ్లానసుధాంశుబింబగరిమంబునఁ బెంపెసలారి యింద్రలో
కీనయనోత్పలావళులు ఖేదము నొందఁగఁ జేసె ఘోరఘ
ర్మానుగతప్రచండకిరణాఢ్యులభాస్కరమండలాకృతిన్. 106

సీ. అసురవల్లభుప్రతాపాగ్ని పర్వెడులీల
దిశల నుల్కాపాతదీప్తి పొదివె
దైతేయనాథునుద్ధతికి నుల్కినభంగి
ధాత్రి సముత్కంపతరళ మయ్యె
దనుజతేజముఁ గని దైన్య మొందినమాడ్కి
మార్తాండుఁ డెంతయు మాఁగువాఱె
విబుధారికినుకకు వెగడొందు తెఱఁగున
వనరాశి కరము ఘూర్ణనము నొందె

గీ. గిరులు వడఁకె నధికపరుషంబులై పవ
నములు చెలఁగె నిబిడతిమిర మడరె

---

1. అనిపల్కి యసురతక్షణ-బ. 2. మామ్లాన.

వహ్ను లగ్రధూమవారితజ్వాలంబు
లగుచుఁ బొనుఁగుపడియె నద్భుతముగ. 107

క. అవి యెల్లఁ జూచి దైత్యులు
దివిజకులాపాయభంగిఁ దెలిపెడునవె యీ
వివిధోత్పాతము లని ప్రమ
దవికాసితు లైరి దుష్టతామసబుద్ధిన్. 108

వ. ఇట్లభిషిక్తుం డై [1]యపూర్వగీర్వాణపుంగవుండు గర్వాగరి మాక్రాంతస్వాంతుండును నగుచు మయదత్తంబును మణి మయూఖమంజీరమంజులంబును మనోరథానురూపగమనం బును నగుమహారథం బెక్కి హిరణ్యాక్షప్రముఖు లగు నాప్తజనంబులు పరివేష్టింప ననేకదానవసేనాసమేతుండై చని మహాశైలదుర్గగోచరయుఁ బ్రాంశుప్రాకారపరివృతయు నుత్తాలవిశాలాట్టాలకవిలసితయు నుదగ్రగోపురాగ్రగృహీత గ్రహమార్గయు సముధికోత్సేధసౌధదీధితిధవళాయమాన దశదిశాభాగయు సకలసమయసముదితసుమనోవికాసభాస మానోద్యానదోహలితరోదోంతరయు సమస్తభోగభూమి యు రత్నవతీనామధేయయు నగుమహాపురి భార్గవోపదిష్ట శుభముహూర్తంబునం బ్రవేశించి. 109

క. అం దుండి సకలసంపద
లుం దనుఁ జేరంగ నఖిలలోకంబులు న
స్పందితనిజాజ్ఞ నొందల
లం దాల్పఁగఁ దాల్చె రాజ్య[2]లలితోత్సవముల్. 110

1. యపూర్వ. 2. లీలోత్సవముల్.

క. దైతేయులు దానవులును
భూతనిశాచరపిశాచములు తద్దయు సం
ప్రీతిం బొదలఁగ నాతని
యాతతసామ్రాజ్య మంతకంతకుఁ బెర్చెన్. 111

తే. ఆహిరణ్యకశిపునైశ్వర్య మెంతవ
ర్ధిల్లఁ దొడఁగె నంత దివిజకులము
పేర్మి [1]తఱుఁగఁ జొచ్చెఁ బేర్చు వేసవియెండ
నెడలి యివురుచిఱుఁతమడువుపోలె. 112

క. వైరము గొని దైత్యుఁడు దు
ర్వారభుజారంభరోషరభసాకులుఁ డై
కారింపఁ దొడఁగె నమరులఁ
బోరులు తనకు స్వినోదములుగాఁ గడిమిన్. 113

స్రగ్ధర. వేదండోద్దండహేలావితతరథప[2]దావిష్కృతస్వీయభా
స్వత్పాదాతానేకసేనాప్రకరపరికరప్రాభవాభీలలీలా
వైదగ్ధిం బేర్చి దైత్యేశ్వరుఁడు రణధురావాంఛఁ బైకొన్న
మాత్రే, ఖేదింపం ద్రుంప నొంపఁగ బిలుసనక విజృంభింప
నోర్వ న్నిలింపుల్? 114

వ. అమ్మహావీరుండు. 115

సీ. పేర్చుచుఁ బఱతెంచుభిదురంబు నని మొనఁ
బెడచేతఁ బెడమోము వడఁగ నడఁచి
భీతిఁ బాతెడిపురుహూతు వెన్కొని బాహు
దల వట్టి దర్పంబు దలకు మీఱ

1. తఱఁగ. 2. దావిష్కృతా.

నమరావతీపురం బంతయుఁ జూఱాడి
 చెలఁగి సురస్త్రీల చెరలుబట్టి
వెల్లయేనుంగును వెలిమావుఁ గైకొని
 మందారమును హరిచందనంబు

గీ. పారిజాతసంతానకల్పకతరువులఁ
గొని సుమేరునిచితరత్నకోటిఁగొండ
లర్థిఁ ద్రవ్వి తండము గొని యమరవిభునిఁ
గరుణ [1]ముందల విడిచి విక్రమము మెఱసి. 116

వ. మఱియును. 117

ఆ. శిఖలు చూపకుండ శిక్షించి హవికి నై
నోరు దెఱవకుండ మేరవెట్టి
వేఁడియెల్ల నుడిపి విబుధారి కినుకమై
భీతిపాత్రుఁ జేసె వీతిహోత్రు. 118

సీ. మెచ్చక యెదురైనమృత్యువుమెడ ద్రొక్కి
 క్రొవ్వాఁడికోఱలు ద్రెవ్వ రాచి
కిన్కతో జంకించి కింకరకోటులఁ
 బొంకంబు చెడఁ గొంకువోవ నడిచి
మదురువుఁ గొని మూఁఱుమలయుకాఁ జెనుపోతు
 నొడిసి కొమ్ములుపట్టి ముడుఁగఁ ద్రోచి
మండెడుపటుకాలదండంబు చేతులఁ
 బిసికి వేఁడిమి యార్చి బెండుచేసి

గీ. వేదప్రాణులఁ బొరిగొనుబిరుదుమగఁడ
వగుదు వీ వని యందంద మొగముమీఁదఁ

---

1 ముందలవిడిచిఅనుటలెస్స. 'జీవముతో విడిచిపెట్టి' [illegible]

జప్పటలు వెట్టి దైత్యుఁడు జమునిలావుఁ
జేవయునుఁ బొల్లుగాఁ గాఁకుచేసి విడిచె. 119

క. రక్క సుఁడ వయ్యె నమరుల
ది క్కొరిగితి దాయ [1]వీవిధిం బొమ్మనుచున్
స్రుక్కఁగ [2]నడిచె నిశాచరు
నక్కజముగ నసురపతి గదాహతి నాజిన్. 120

సీ. లీలమైఁ బాతాళమూలంబుదాఁకను
సలిలధిసలిలంబుఁ గలఁచి పొచ్చె
జలములు ద్రిక్కఁగ సకలరత్నంబులు
[3]వెరఁజి సాగరపతి వీడుకొలిపి
మకరకర్కటకూర్మమత్స్యమహానాగ
బలముల బలువిడి బారిసమరి
క్రూరదుర్వారదారుణపాశవిసరంబుఁ
దోరంపుఁగడఁకఁ దుత్తుమురు చేసి

గీ. పశ్చిమాశాధినాథు [4]విపశ్చిదర్చ
నీయగాంభీర్యు దైతేయనాయకుండు
సమరతలమున భంగించె సకలదైత్య
సముదయంబును నానందజలధిఁ దేల. 121

క. జవమును బలమును బొలుపఱి
భువనంబుల నెందుఁ దిరుగుపోఁడిమి యెడలన్
బవమానుం డవమాన
ప్రవిహతమతియయ్యె నసురపతికోపమునన్. 122

1. నీవిధిం. 2. నడఁచె. 3. వెఱచి. 4. విపశ్చిదర్చ్య.

క. నవనిధులు పుచ్చుకొని భ
వ్యవిమానము నాచికొని సురారి కడిమిమై
భవసఖుఁ డితఁ డట్టిఁడ కా
యవు నని భిక్షేశుఁ జేసె నయ్యక్షేశున్. 123

ఉ. ఎక్కడి దెద్దు భూతియును నెమ్ములు సొమ్ములు భిక్ష జీవనం
బొక్కటి కట్టఁజీరయును నుండఁగ నిల్లును లేదు నిక్కవం
బిక్కఱకు [1]నపస్విజనుఁ డేచిన నయ్యెడు నేమి యంచుఁ దా
నొక్కని శర్వుని న్బలుపనొల్లఁడు దైత్యుఁ డనాదరంబునన్.

వ. ఇవ్విధంబున సకలదిక్పతుల న్బరిభవించి తదీయపదంబులుం
దాన కైకొని మాఱు లేక మలయుచును సర్వదేవ[ా]భీకరుం
డై విజృంభించి. 125

సీ. వనరాశిజలములు వడిఁ ద్రిప్పుకొనులీలఁ
గలఁగించు [2]మందరాగమ్ముకరణి
నంబుజప్రియకుముదాప్తులఁ బోరిఁ బట్టి
బాధించు సింహికాప్రభవుభంగి
ఘనగోత్రగోత్రశృంగంబులు వెసఁ దాఁకి
పొడి చేయుఁ దీవ్రదంభోళి పగిదిఁ
బ్రబలవలాహకప్రకరంబు వ్రచ్చి వం
దఱలాడుఁ బటుమారుతంబుమాడ్కి

గీ. దిగ్గజంబులగుండెలు దిగులుకొల్పు
ఘోరరవమునఁ గ్రూరమృగారిపోల్కిఁ
బ్రకటభుజదర్పమునఁ దన్నుఁ బట్టలేక
దుర్విషహుఁ డై హిరణ్యాక్షుపూర్వజుండు. 126

1. దపస్వినులు లేచిన. 2, మందరనగరము.

సీ. తపములఁ గ్రుస్సినతపసులఁ బట్టి తె
ప్పించి యచ్చరలతోఁ బెండ్లి సేయు
మోదంబుతో నశ్వముఖులలాయంబులఁ
గట్టి బొక్కనియలఁ గవణమెత్తు
భుజగేశ్వరులశిరంబున నున్నమణు లూడ్చి
కొమరార వట్రువగుండు లెత్తుఁ
జెలఁగి గంధర్వులచేతివీణెలు పిశా
చుల కిచ్చి పాడించి చూచి నవ్వు

గీ. ఖడ్గములుఁ బాదుకలు ఘుటికములు నపహ
రించి సిద్ధపుంగవుల గారించుచుండు
భువనబాధలు దన కిట్లు ప్రొద్దువోక
లుగ సురారాతి పేర్చె నుల్లోకుఁ డగుచు. 127

క. సదభిమతము లగు[1]మఖముల
విదితముగ 'హిరణ్యకశిపవే స్వాహా' య
న్నదిదక్క మంత్ర మొండె
య్యది చొరకుండఁగ సురారి యాజ్ఞాపించెన్. 128

చ. సరసిజసంభవుండు హరి శర్వుఁ డనంగఁ గలారె వేఱె యొ
క్కరుఁడు జగత్త్రయంబునకుఁ గర్తయు భర్తయు సంప్రహ
ర్తయుఁ, దిరముగ నేన కాక యని దేవకులద్విషుఁ
డాగమక్రియా, కరులకుఁ దన్నుఁ గొల్వఁ డని గర్వమున
న్నియమించె నెల్లచోన్. 129

సీ. భానుఁ బిల్పించి నాపంపునఁ బాయని
తెరువరి వై మీఁదఁ దిరుగు మనియుఁ

1. దుఃఖము.

చంద్రునిఁ బిలిచి నాశాసనంబున జగం
బున నెల్లనోషధుల్ బ్రోవు మనియె
ననిలునిఁ బిలిచి నాయాజ్ఞఁ బ్రాణుల కెల్ల
వలయు ప్రాణంబవై మెలఁగు మనియె
ననలునిఁ బిలిచి నాయానతియందునఁ
[1]శాకాదిక మ్మోజ పఱుపు మనియెఁ

గీ. దనచరిత్రంబె వర్ణింపఁ బనిచె బహువి
ధేతిహాసపురాణార్థజాతి నెల్లఁ
దన్ను వినుతింపఁ బనిచె వేదముల నెల్ల
దైత్యనాయకుఁ డఖిలవిధాయకుండు. 130

మ. జముఁడై తాన సమస్తకర్మగతులున్ శాసించు శీతంబు నూ
ష్మము వర్షంబును దాన యయ్యయిశతుల్ సంధిల్లఁగాఁ
జేయు న, ర్థముఁ గామంబును దాన కైకొని ప్రమోదం
బందు ధర్మంబు మోక్షము నాత్మీయకటాక్షలక్ష్యము
[2]లనన్ గర్వోత్కటసాంతుఁ డై. 131

ఉ. నేలయుఁ గొండలుం దిశలు నింగియు దీవులు నంబురా
సులున్, గాలములున్ గ్రియావళులు గాడ్పులు వహ్నులు
నాకమర్త్యపా, తాళములు న్నిజాకృతులు దాల్చి సరో
రుహాసూతిఁ గొల్చున, ట్లాలఘుశీలుఁ [3]గొల్వ సదయాత్మత
యేర్పడ వచ్చు నిచ్చలున్. 132

వ. ఇట్లు లోకపరమేశ్వరుం డగుసురేశ్వరుండు నిరంత
రైశ్వర్యుండును, గురుభుజ వీర్యుండును, దివిజమర్దన

1. పాలికాదిక మోజ. 2. లనన్. 3. గొల్చు.

కార్యంబులు నవార్యంబులై చెల్లుచుండఁ జండప్రకోప
దీపిత త్రిలోకుం డగుచు ననేకసంవత్సరసహస్రంబులు
సామ్రాజ్యంబు సేయుచుండ నాఖండలప్రముఖబృందారకు
లందఱు రహస్యంబునఁ గూడఁబడి గురునితోఁ గర్తవ్యం
బడిగిన నమ్మహామతి మరుత్పతి కిట్లనియె. 133

క. నీతులఁ ద్రోవఁబడని దు
ర్నీతునియుద్రేక మెసఁగి నిగిడినయెడ లో
కాతిక్రమహేతు వగు న
హేతుకళానాశనంబు నెమ్మెయిన నగున్. 134

చ. కడిఁదివరంబు వారిరుహగర్భునిచేఁ గొనినాఁడు వాఁడు మీ
యెడ ననిశంబుఁ బెన్పగయు నీసును రోషము నెమ్మనంబులోఁ
జడిగొని యుండుఁ గావున నసాధ్యుఁ డవధ్యుఁడు దైత్య
నాథుఁ డే, వడువునఁ బౌరుషంబుఁ గొని వాని జయించుట
వ్రేఁగు చూడఁగన్. 135

సీ. సామంబుచే శత్రు సాధింత మంటిమా
సామంబు ఖలునందు సేమమగునె
భృత్యులతోఁ దాయ భేదింత మంటిమా
యసహాయసాహసుం డసురవరుఁడు
దానంబు వశ్యవిధాయక మంటిమా
[2]మొల్ల మెల్లనువాఁడు కొల్ల[illegible]నియె
దండితనంబున దండింత మంటిమా
చెనసి యజేయు నిర్జింపరాదు



1. నీమలచేఁద్రోవడు దుర్నీతుని. 2. మెల్లమెల్లను.

గీ. కానఁ జతురుపాయంబులు కార్యసిద్ధి
జనకములు గావు మఱి చూడ సంధివిగ్ర
హాదు లైనషడ్గుణములు నప్రయోజ
నములు పగతుఁడు ఘనుఁడు దుర్దముఁడుఁ గాన. 136

క. స్థానంబును వృద్ధియు న
ద్దానవపతియందు నంచితము లైనవి దే
వానీకము సంక్షయగత
మైనయది త్రివర్గతత్త్వ మారసిచూడన్. 137

వ. స్వామ్యమాత్యసుహృత్కోశరాష్ట్రదుర్గబలంబులను సప్తాం
గంబులును సంపన్నంబు లై తదీయసామ్రాజ్యంబు రిపులకు నభి
యోగ్యంబు గాకుండుటయు నాకౌకసులకు నమ్మహిమవిగతం
బగుటయుఁ బరమేష్ఠిదత్తవరలాభంబున నుదయోన్ముఖుం
డై నవాఁడునుం గావున నసురకుం గాలబలంబు సమధికం
బగుటయుఁ ద్రిలోకంబులును దనయధీనంబులుగాఁ గైకొని
యున్నవాఁ డగుటం జేసి దైవబలంబు సిద్ధం బగుట యవలం
బింపవలయుట నాకుం దోఁచినకర్జం బది యట్లుండె వెండియు
నొక్కతెఱంగు చెప్పెద. 138

ఉ. కామక్రోధమదాద్య మైనయసుహృద్వర్గంబులన్ గెల్వ నే
ధీమంతుండు సమర్థుఁ డాతఁడు విరోధివ్రాతముం గెల్చు నీ
కామక్రోధమదాదినిర్జితుఁడు దుష్కర్ముండు నై యుండు వాఁ
డీమై నెవ్వరిచేత నేనియు పరమాహీనుం డగుఁ బ్రేల్మిడిన్.

క. అజితాత్ముఁ డైనయాతని
విజయంబును సిరియు విరియు వేగంబ శర

త్ప్రిజనితజలధరములు గడు
నిజము లగునె యంబరమున నిముసం బైనన్. 140

మ. దితిజుం డిప్పుడు కామరోషముల నుద్రేకించి లోకంబు దుః
స్థితి నొందించుచు నున్న వాఁడు విభవాంధీభూతచేతస్కుఁడై
మతిహీనుండునుబోలె సౌఖ్యనిరతిన్ మత్తిల్లియున్నాఁడు ని
ర్జితుఁ గావింపఁగవచ్చు దైవపరతన్ జేపట్టి యీపాతకున్.

క. విజయాభిమానతృష్ణ బ
హుజనవిద్విషుఁ గామసంవృతోన్మాదు వినో
దజితుని వెసఁ దొడరంగా
విజయం బగు ననిరి నీతివిస్తరవేదుల్. 142

క. తనుఁదా నెఱుఁగనివానికిఁ
దనుఁదా దండించుకొనిన తామసునకు నెం
దును దైవబలము లే దిం
త నిరూఢతఁ గనినసిరియుఁ దప్పఁగ దోఁచున్. 143

వ. మనకు దైవంబు దాతయు వాసుదేవుండ. మనకేయననేల
యనేకబ్రహ్మాండకోటిజాతంబు లైనచరాచరభూతంబులకుఁ
బరాయణంబు నారాయణాభిధానం బగుతేజంబ. ఈజ
గంబుల సంకటం బుడుప నాదేవునకు నపరిహార్యంబుమనమిమ్మ
హాత్ము శ్రీపాదపద్మంబులు చేరి మనతెఱఁగంతయు విన్నవిం
తము. మున్ను చెప్పితి హరి శరణాగతుల యాపదలఁ బాప
నోపు. నాపురుషుండు మనకు నెయ్యధికర్తవ్యంబుగా నాన
తిచ్చెఁ దత్ప్రకారంబున నపకారులకుఁ బ్రతికారంబు చేయుద
మిదియ నిశ్చయంబు గావున. 144

మత్తకోకిల.—

రండు పోదము లెండు వేగమ ప్రస్ఫురత్కులిశాయుధా
ఖండఖేలనహేతిభీతనగవ్రజాభయదాయితా
చండచండతరంగసంభ్రమసంప్రవర్ధికి వార్ధికిన్
బుండరీకదళాక్షుమందిరభూమికిన్ మహినేమికిన్. 145

వ. అని సురలకు [1]గురుండ వితథం బగునీతిపథంబునన్ బరమ హితం బుపదేశించె నని దేవశ్రవునివలన గాలవుండు వినిన పథంబు విశదవిస్తారంబుగా నుపన్యసించె. 146

ఆశ్వాసాంతము

క. శ్రీతులసీదళదామ
ద్యోతాగుణహారికిరణయుతకౌస్తుభర
త్నాంతపరిచితేంద్రధను
స్స్ఫీతనవీనాంబుధరగభీరశుభాంగా. 147

భుజంగప్రయాతము.—

మహాంభోధికల్లోలమాలావిలోల
న్మహాభోగిశయ్యా[2]సమాక్రాంతకేలీ
[3]మహాశక్తిముక్తోపమానాత్మమాయా
మహాయంత్రకభ్రామ్యమాణత్రిలోకా. 148

క. వైకుంఠనాథ, సమద
శ్రీకంఠగ్రహణ నిపుణశీల, విరించి

1. గురుండు వితథంబగు. 2. సనాక్రాంత. 3. మహాశక్తి.

శ్రీకంఠాదికమూర్తిమ
యాంకుంఠనిజైకచిన్మయాకార హరీ. 149

స్రగ్విణి. సత్యసత్యాకుచోత్సంగసంగ ప్రియా
నుత్యనుత్యంతరోన్ముక్తముక్తస్తుతా
నిత్య నిత్యోదితోన్నిద్రనిద్రా, నతా
దిత్య, దిత్యాత్మజోద్రేకరేకాపహా. 150

గద్య. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వరచరణసరోరుహ
ధ్యానానందసౌందర్యధుర్య శ్రీసూర్యకవిమిత్రసంభవశంభు
దాసలక్షణాభిధేయ ఎఱ్ఱయనామధేయప్రణీతం బైన శ్రీ
లక్ష్మీనృసింహావతారం బనుపురాణకథయందు ద్వితీయా
శ్వాసము.



శ్రీరస్తు

# తృతీయాశ్వాసము



[1]మద్గురుగరుడాచల
ధామ సుధాధామతీవ్రధామసహస్రో
ద్దామద్యుతితేజోనిధి
సీమశ్రీమహితదేహ శ్రీనరసింహా. 1

వ. దేవా రోమహర్షణుండు మహర్షుల కిట్లనియె. నంత బృహస్పతిమతంబు తమకు నభిమతంబుగా నేకమతంబున నమృతాశనులు నముచిశాసను మున్నిడుకొని యప్పాపిద్దు కదలి యుత్తరాభిముఖులై చని. 2

మహాస్రగ్ధర.—

కనదుగ్రగ్రాహనక్ర[2]క్రమణఘుమఘుమాకారకల్లోలడోలా
స్వనన[3]ప్రద్యోతకేళీసరభసఫణభృచ్చారుజూటాగ్రజాగ్ర
ద్ఘనరత్నోదంచితోద్య[4]త్కటు కుటిలమయూఖచ్ఛటాటోప
మిథ్యా, జనితౌర్వారంభశుంభత్సలిలనివహానిస్తంద్రరత్నా
కరేంద్రున్. 3

1. శ్రీశ్రీమద్గరుడాచల. 2. గ్రహ. 3. 'ప్రత్యూష' ఐయుండును.
4. త్కట.

వ. కని తదీయమహామహిమకు నంతరంగంబులం గౌతూహ
లాద్భుతానందంబులు సందడింప నందఱుం దమలో నిట్లనిరి. 4

సీ. కల్పాంతవేళ భీకరసూకరాకృతిఁ
ఎసరి విచ్చలవిడిఁ దఱిసియాడె
నఖిలంబు మ్రింగి మాయాశిశుమూర్తియై
లీలమైఁ దనయిచ్చఁ దేలియాడె
శ్రుతిచోరుపైఁ గిన్కఁ జూపి మీనాకార
మింపారఁ దనివోవ నీఁదులాడె
నమృతంబునెపమున నచలంబు లోవైచి
తనయొప్పుకోలుఁదూలఁ ద్రచ్చియాడె

గీ. నెప్పుడు పాయ కున్నట్టివాఁ డిందు నిమ్ము
కుందుఁ డబ్ధీంద్రుపై నెంత కూర్మిగలదొ!
యఖిలజగదీశ్వరున కింత యనుగలముగ
నేమితప మొనరించెనో యిప్పయోధి. 5

చ. ఇది యొకఁ డేల యీజగము లిన్నియుఁ జెన్నునఁ గన్నతల్లిబ
ల్లిదుఁ డగుశౌరిపేరురము లీలమెయిం దనయాటయిల్లుగా
ముదము దలిర్పనొప్పెసఁగుముద్దియయీతనికూఁతురట్టియీ
యుదధివరేణ్యుపుణ్యమున కొండొకఁ డెందును నీడుగల్గునే.

వ. అని యనేకవిధంబులం గొనియాడుచుం జని వినువీథి [1]నం
బుధియవలిదరిఁ జొచ్చి దవ్వుదవ్వులయందు శ్వేతద్వీపంబును
దన్మధ్యగోచరంబును నగువైకుంఠపురంబునుం గని మ్రొక్కి
యొండొరులకుం జూపుచు. 7

1. నంబుధివమందఱు.

శా. ఈవారాశికి దానభూషణముగా [1]నీదీవి శుభ్రాంబుజ
శ్రీవిభ్రాజిత మయ్యె దీనినడుమన్ జెన్నొందె హేమోజ్జ్వలం
బై వైకుంఠపురంబు కర్ణిక తెఱంగై యంగ నిందూర్జిత
శ్రీవత్సాంకునిఁజూతమింకఁ బ్రమదస్థేమున్ మహాలీంద్రుఁగాన్.

క. అని పలుకుచుఁ జిత్తంబులు
ఘనతరభక్తిరసభరితకలితము లై పే
ర్చిన నమరవరులు నిజకర
వనరుహపుటఘటితనిటలవన్యస్తకు లై. 9

శ్లోకము. శ్వేతద్వీపాయ సంసారతిమిరశ్వేతభానవే,
నమః కైవల్యకంఠాయ వైకుంఠనగరాయ చ. 10

వ. ఇట్లు తొడంగి బహువిధస్తోత్రనాదంబులు రోదోంతరంబున మేదురంబులుగాఁ బురంబు సొత్తెంచి రాజమార్గంబున రాజమందిరాభిముఖు లై వచ్చుదివిజులకలకలం బాకర్ణించుచు వైకుంఠనాథుండును ననాథనాథుండును సగుశ్రీనాథుండు నాకౌకసులం దడయక తోడ్కొని తేర వైనతేయు నానతిచ్చి పుచ్చిన. 11

సీ. భాసురసౌవర్ణపక్షయుగ్మముకంటెఁ
బ్రకటితం బగుబంధుపక్ష మమర
నంచితహరిచందనాంగరాగముకంటె
రాజితం బగుముఖరాగ మెసఁగ
లాలితహారాద్యలంకారములకంటెఁ
బూరుహాకారంబు భూషణముగ

1. నీదేవి.

నభిగమమ్మృదుపదన్యాసంబుకంటెఁ [1] బ్రి
మోక్తిపదన్యాస ముల్లసిల్ల

గీ. విబుధకోటి నెదుర్కొని వినతపట్టి
యాద్యదేవునియాదరం బపుడు చెప్పి
యందఱును సంతసిల్లంగ నంతిపురము
కొల్వుకూటంబునకు వారిఁ గొనుచుఁ జనియె. 12

చ. అనుపమలీల నొప్పుపరమాత్మునిదివ్యసభానివాసముల్
గనుఁగొని యుద్భుతప్రమదకౌతుకపూరములన్ మునింగి య
య్యనిమిషకోటిచిత్తము నిరంతరదైత్యవికారఘోరవే
దనఘనభార మెల్ల దిగఁద్రావి భజించె నవీనభావమున్. 13

## అంగవర్ణనవచనము

వ. ఇట్లు సభామంటపప్రవేశం బొనరించి యనంతరంబ వారగ్ర
భాగంబున నుదగ్రభోగిభోగమహాశ్వేతశయనీయంబుఁ
గమనీయహిమశైలశృంగసంగతం బగు సతోయతోయదంబు
చాయకు నుపమేయం బగుచుం బొలుపారుసాయగంబును,
నవపారిజాతపల్లవంబుల యుల్లాసంబు నుల్లసం బాడుచు
శ్రుతిసీమంతసిందూరరంజనరంజితంబు లైనవి యివి యని
కొనియాటలకుం [2] జాలుచాలెఁ జెన్నొందుచరణతలంబులును,
వరణాం [3] గుష్ఠసష్ఠావ్యతిస్యూతం బగుమిన్నేటి [4] తెలిసీటికిఁ
బ్రోదిగావించు నుజ్జ్వలనఖచంద్రికానిష్యందంబును, సువృ
త్తంబులు సుస్నిగ్ధంబులు నై నెఱపంగడీలకైవడి నెల్లనడ
వడికి మైవడిమై మెఱయు నిరుదొడలును, వొల్లియు నుధు

1 [illegible] 2 [illegible] 3. గుచనిష్టాంత. 4. తెలిసీటికి.

కైటభాసురశిరోవిదళనంబునకుం దగినవేళ వయ్యె నింకను హిరణ్యకశిపువక్షోవిదారణంబునకుం గారణప్రదేశం బయ్యెడునని జతనంబునం బోదివి పాటించినయనువునఁ గనకాంబర సంవృతం బగుచు నొప్పారునూరుయుగళంబును, నాభికమల కందళితంబులగుచు[1] నెలదూఁడు మొలకలపోలువునంగటితట ఘటితరత్నశృంఖలోపలంబుల ముందటిదెసఁ దోఁచు[2] తఱుల మెఱుంగులును, గల్పారంభకాలంబున *నభ్యంతరస్థితభువన ప్రపంచంబు వెలువరించుటవలనం గృశతనొంది స్రుక్కెంగాక యనందగువృత్తసుందరం బై లలితవళికలితంబు నగుమధ్యంబును, నేప్రొద్దునుం జేరువ యగుకౌస్తుభరత్నంబునం బెలయు తననీడఁ జూచి రెుుకొక్కకవాటు వఱపున నితరసుందరి యనుసందేహంబు నొంది యాందోళించు డెందంబుననొక్కింత వడి యసూయాసౌందర్యంబునం దిలకించునిందిరకుం బ్రియ మందిరం బై యనవరత సురభిసురుచిరతరుణతులసీనళదా మంబునఁ బొదలురుచిసముదయంబుల సమధికశ్యామా యమానంబు లగుభుజాంతరంబులును, సిరినెఱికౌఁగిటఁ గఱుచనుముక్కునొత్తునం గమలినచోటి కందుచందంబున లలితాలంకారం బై కనుపట్టు శ్రీవత్సలాంఛనంబును, దేవాది చతుర్విధభూతనిర్మాణంబునకుఁ జతురాగమధర్మప్రతిష్ఠాపనం బునకు లోకపాలచతుష్టైశ్వర్యప్రదానంబునకుఁ జతుర్ముఖముఖకపోలస్పర్శనోపలాలనంబునకు నొక్కొక వరుసనచాలి చరితార్థతం బొంది మణివలయమండితంబు లై యాఖండలీయం బగుమత్తవేదండంబు నఖండదంత[3] దండంబులుంబోలెఁ ద్రిరే

---

1. పాలందడు. * అభ్యంతరిత. 2. తఱుచు. 3 దంతంబులుం.

ఖాలక్షితంబై తనకు నిఖిలవ్యాపారంబులయందును ధురీ
ణంబు లగుచుఁ బెనుపొందుచతుర్భుజంబులును, భావికాలం
బున నసురేంద్రు పేరురంబు చీరునెడం దొరుఁగురుధిరధారల
చెలువంబు సూచించుచాడ్పునఁ గెందామరరేకులం దెగడు
కరశాఖలం గాంతితరంగితంబు లగునంగుళీయ మాణిక్యమ
యూఖరేఖానివహంబులును, జతురాననజనకం బగుజలరు
హంబునకు నిమీలనోన్మీలనంబు లుత్పాదించుచు వినోదించు
టకు సవరించినచంద్రసూర్యబింబంబులపగిదిఁ గమనీయ కాంతి
తేజోవిలసితంబులఁ బచరించుచుఁ గరద్వితయంబున నమరు
పాంచజన్యసుదర్శనంబులును, నపరహస్తయుగళంబునఁ బరిగృ
హీతంబులై మూర్తంబులైనసంపద్విజయంబులకరణిఁ బ్రకా
శితంబులగు కౌమోదకీనందకంబులును, గరకలితకంబురత్నంబు
నిర్మించిన యచ్చునుంబోలెఁ ద్రిరేఖాలక్షితంబై లక్ష్మీభుజ
లతావేష్టనంబునఁ బునరుక్తసన్నివేశం బగురత్నగ్రైవేయ
కంబువలన విలసనైకధురంధర యగుకంధరయును, శ్రవణ
ప్రవేశసమయంబునకు నవసరంబు వేచి కదిసిపొదిఁగియున్న
మహామునీంద్రస్తుతి సూక్తంబులో యనుతలంపు లుత్పా
దించు నవతంసమౌక్తికంబులుం, దమయందుఁ బ్రతిబింబితంబు
లగుటవలన మధురస్మితలతాబీజగర్భంబులయోజ రాజిల్లు
కమ్రకపోలతలంబులును, సుప్రసాదాలాపసమయంబుల నధర
బింబప్రభాపటలపాటలం బగుటవలన లోకరంజితంబుల నర్థం
బుల నతిసమర్థంబు లగువిమలవాక్యస్వరూపంబులరూపున
దీపించు[1] సితదంతకిరణకలాపంబులును, గోలందివడనినిడుఁద

1. సితదంతకరకలాపంబును.

తనంబున నిగుడు వెడఁదకన్నుఁగవను నిరుదెసలకర్ణోపాంతం
బులు విశ్రాంతిసీమ లగుటకుం దగి నడుమం దాన నిలిచి యనా
యతంబై సుగంధఘ్రాణపవనపరిమిళితపురోభాగం బగుచుఁ
దనరారుఘనతరఘ్రాణంబును, దెలిమోముచందురుం గొలువఁ
జేరినకుముదవదనవికాసంబుల మాసరంబుల మాడ్కి నలు
దిక్కులం బిక్కటిల్లు నుత్ఫుల్లలోచనరుచినిచయంబులును
సకలసురాసురస్థితివిలయంబులు నిజకటాక్షవిక్షేపవిభవంబు
లకు నధీనంబులుగాఁ బెంపారుతొంగలి ఱెప్పలయొప్పిదంబు
మీఁదఁ బ్రతిబింబించె నన [1]నపూర్వవిలసితంబు గలిగించు
భ్రూయుగంబును, శిరోభూషణపద్మరాగరత్నంబునఁ బొఁగు
రాగంబు గలయఁ బర్వి కెంబట్టు [illegible]సుట్టినయట్టియుట్టులంపుఁ
బొలుపు పుట్టింపఁ బెంపారువిశాలవమాలి సన్నాహంబును
నగుచు నఖిలమునిజనధ్యేయప్రకాశం బైనయాకారంబు
నిర్వికారసంస్కారంబుల నుదారం[2]బు లగుచునుండ, నిబిడాం
జనశ్యామం బగునిజదేహధామంబు బహుళస్తోమ బునఁ
దత్ప్రదేశంబంతయుఁ గోమలతమాలపల్లవోపహారంబులు
విస్ఫారంబు లైనమాడ్కిం జూడ్కులకు వేడ్కలు నిండింపఁ,
బ్రౌఢపర్యంకభుజంగఫణామణిమరీచులు మేనం గలయ బెరసి
జలనిధివీచికాస్ఫాలనలగ్నంబు లగుప్రవాళాంకురంబు లను
శంక నంకురింపఁ జేయ మహారత్నరచితంబు లైనసభాస్తంభ
తోరణకవాటకుట్టిమకుడ్యవేదీవితానాదులను దేజోమహనీ
యంబు [3]లగునభ్యంతరశరీరంబులను బ్రతిఫలితంబైననిజ
మూర్తి దా నఖిలచరాచరాంతర్గతుం డగుట ప్రత్యక్షంబుగా

1. అపూర్వవిలసితంబు. 2. బగుచునుండ. 3. లగు నభ్యంజన శరీరంబులను.

# తృతీయాశ్వాసము

దెలుపం బూనినతెఱంగునఁ దేజరిల్ల సాగరకన్యకాకరసరో
రుహాసౌరభసంభావితంబు లై మొగయు మధుకరంబులు
సాకారంబులై కొలుచుసకలశబ్దమంత్రాక్షర జాలంబులకు
ననుగలంబులై కలసి మెలఁగి, మూర్తంబులై సర్వాగమం
బులు నేమేమి యని యుత్తమాంగంబులు మంగళచరణపీఠం
బులు గా నమర్చి యొగ్గి డగ్గఱికొలువ, సురుచిరప్రతిష్ఠాలా
పంబులు గోరి యశేషధర్మవిశేషంబులు నంగీకృతాకృతులై
చేరి కృపాకటాక్షంబు లపేక్షింప, సర్వలోకశరణ్యుండును,
సర్వదేవతావరేణ్యుండును, సర్వయోగార్థగణ్యుండును
నగుచు శ్రీదేవీవిలోచనచకోరంబులు నిజవదనేందుచంద్రికా
ప్రవాహంబుల నోలాడుచుండ, నాత్మీయమనోరథమధుపం
బులు తదీయముఖారవిందమధురసంబులం దనివిలేనియనువునం
గ్రోలి క్రాలుచుండ, నమ్మహాదేవి నెమ్మేనుదీఁగ దనబాహు
శాఖలం దగిలి ధన్యవిలాసంబుల భాసిల్లుచుండఁ, బుండరీ
కాక్షుం డయ్యును ననురక్తావలోకనుండును, నీలవర్ణుం
డయ్యును దరహాసధవళితకపోలుండును, గమలాకళత్రుం
డయ్యును వివాహకౌతూహలియును, నిరంతరవనవాసియ
య్యును ననంతభోగేశ్వరుండును, గుణరహితుం డయ్యును
సాధుజనపూజనీయుండును, జన్మవిముఖుం డయ్యును భవ
ప్రియుండును, గోత్రోద్ధరణసమర్థుం డయ్యును సమస్తలోక
బాహ్యుండును, విగతబంధుండయ్యును సతతసన్నిహిత
[illegible]తామహుండును నగుచుఁ బుణ్యంబులకు నాధారంబును,
నాపదలకుఁ బ్రతికారంబును, నధర్మంబునకు నవమానంబును,
మంగళంబులకు నాస్థానంబును, సత్వంబునకుఁ బరమమిత్రం

బును, నాగమార్గంబులకు నాదిసూత్రంబును, రక్షకు మూలంబును, మోక్షంబునకు నాలవాలంబును, విజ్ఞానంబునకు నిర్దేశంబును, బూజాస్తోత్రంబులకు నభిగమ్యప్రదేశంబును నగుచు నొప్పుచున్న దేవాదిదేవుఁ, బురాణపురుషుఁ, బురుషోత్తముఁ, బ్రకృతిపురుషుఁ, బురుషాధీశ్వరుఁ, బరమేశ్వరు నంత నాలోకించి. 14

క. అందంద చాఁగి మ్రొక్కుచు
బృందారకు లధికభక్తి [1]భీతివికాసా
నందంబులు డెందంబుల
సందడి గొని మస్తకప్రశస్తాంజలు లై. 15

క. ఆవిశ్వరూపరూపము
భావించుచుఁ దత్ప్రభావభంగుల మది సం
భావించుచుఁ దత్పరమతు
లై వినుతింపంగఁ దొడఁగి రప్పరమాత్మున్. 16

ఉ. శ్రీవసుధాకళత్ర యతసీసుమనోతిమనోజ్ఞగాత్ర మా
యావిహితత్రిలోక నిగమార్థవివేక [2]విపాపభవ్యసం
సేవక సౌమ్యమానసవశీకృతరూప భవాంధకారని
ర్ధావనదీపదీప్తనవతామరసేక్షణ విశ్వరక్షణా. 17

చ. భవదురునాభిరంధ్రభవపద్మరజ[3]పరమాణుపాకసం
భవుఁడు విధాత, తద్విమలభావకళాకణమాత్రవైభవో
ద్భవము జగంబు, తద్వివిధభంగికసర్గములోన నొక్కరుం
డివి యని నిశ్చయింపఁగలఁడే భవదీయగుణంబు లచ్యుతా.

---

1. భీతవికాసా. 2. విపాకభవ్య. 3. పరిమాణ.

ఉ. ఎందును నిన్నుఁ గన్నజను లెంచనుగల్గరు వెండి యొద్దెసం
జెందవు నిన్ను నెద్దెసలఁ జెందని క్రించులభక్తి, నొక్కటన్
బొందు గొనంగఁ జాలు కృతపుణ్యులు గల్గినఁ జాలు వారికిన్
బొందగునీ లసత్కరుణ, పుణ్యయశోమహనీయ మాధవా.

శా. విన్నంజాలు భవన్మహత్త్వము భవద్విజ్ఞానసద్గోష్ఠియం
దున్నంజాలు భవత్పదాంబురుహసేవోత్సాహసంపన్నులం
గన్నంజాలు భవత్సమంచితజగత్కల్యాణనామంబుఁ జే
ర్కొన్నంజాలు నగుండుశాశ్వతశుభారూఢుండులక్ష్మీశ్వరా.

ఉ. అక్షరయోగయుక్తులు సమంచితసత్త్వదయానురక్తులా
లక్షితసత్యధర్ములు విలంఘితకర్ములు బుద్ధికల్పితా
పాక్షరవాక్యరూపులు నిరాకృతకోపులు సంయమక్షమా
శిక్షితులక్షయుల్ నినుభజించుమహాత్ములు నీరజోదరా. 21

చ. తమతమపూర్వవాసనలఁ దత్పరులై విభాగమోక్తకృ
త్యములు [1]వహించిభవ్యపరతత్త్వమునయ్యయిసంజ్ఞలం బ్రయ
త్నమునఁ దలంచుసంయతమనస్కుల కెల్లనుజేరుచోటు శ్రీ
రమణా భవత్పదంబు సుచిరస్థితి నేఱుల కబ్ధిచొప్పునన్. 22

ఉ. విద్యల కెల్ల నాద్యుఁడును వేద్యుఁడునై తనరారునిన్ను న
భ్యుద్యతకర్మరూపముగ నుల్లమునం దలపోసి యెంతయుం
జోద్యపుభక్తి యజ్ఞపురుషుం డని పూనిభజింతురెందుఁ [2]త్రై
విద్యులు [3]నాకలోకపదవీప్రదదీప్ర త్రిలోకనాయకా. 23

శా. దృష్టాదృష్టఫలస్పృహావిముఖులై దిక్పూర్వతత్త్వక్రియా
సృష్టిం బ్రస్ఫుటతీవ్రబోధమున నుత్సేకించి యవ్యక్తసం

1. వహించె. 2. త్రైవిద్యులు. 3. నాకలోకపదవీపదవిప్ర.

సృష్టిఁ బాసి నిరస్త[1]వైకృతుఁడుదాసీనాత్ముఁ షడ్వింశు వి
స్పష్టైశ్వర్యుని నిన్ను సాంఖ్యులెలమిన్ భావింతు రాత్మేశ్వరా.

చ. యమనియమాభివర్ధితము లై మగుడంగ మనశ్శరీరముల్
శమితముగా మరుచ్చయము సంతతజీవపరాత్మతత్త్వరూ
పములు విభేదమై మఱపు పాటిలి కాలము ద్రింగి యోగివ
ర్గము గనుచిత్సుఖానుభవగర్వము సర్వము నీవ కేశవా. 25

చ. పరఁగుపదార్థపంచకము పాశము లై తనుఁజుట్టఁదూలుచున్
[2]దిరిగెడుజీవుఁడన్ పశువు దేశికపుణ్యకటాక్షవీథిఁ ద
త్పరమతిఁ జేరఁగా సకలబాధవిముక్తి శుభంబు నిచ్చునీ
శ్వరుఁడుగ నిన్నె యుంగుదురు శైవులు శాశ్వతచిన్మయాత్మకా.

ఉ. దాస్య మొకండు సంబరమధర్మముగాఁ గొనియన్యధర్మ మా
శాస్యముగా గణింపక యసంశయనిశ్చలభక్తిసంతతో
పాస్య నశేషభవ్యపురుషార్థభవైకవిధాయి నిన్ను నా
ఒస్యతఁ [3]బాంచరాత్రులు దలంచి భజింతురు భక్తవత్సలా.

శా. ద్వైతభ్రాంతికిఁ గల్పితం బఖిలమున్ స్వప్నేంద్రజాలోపమం
బై తూలన్ పృథురజ్జుసర్పసదృశవ్యామోహవిచ్ఛేదనం
బై తత్త్వజ్ఞత యావహిల్లి యపరోక్షాభేద[4]చిత్సౌఖ్య వి
ఖ్యాతుం గాంతురు నిన్ను నౌపనిషదుల్ కళ్యాణనారాయణా.

శా. ధ్వస్తాశేషమతాఖిలాత్మతను చేతశ్శుద్ధు లుక్తాంగవి
న్యస్తప్రస్తుతమంత్రవర్ణులు నిరస్తాలస్యు లంతశ్శమా

---

1. వైకృతుఁ నిదాసీనాత్ము. 2. దిరిగెడుజీవుఁడున్. 3. పంచరాత్రులు.
4. చిత్సౌఖ్య.

భక్తస్తోమస్వచ్ఛనదీయమూర్తివిభవుల్ ప్రాజ్ఞుల్ మహామాంత్రి
కుల్, [1]హాస్త్రోచ్చాఘ్రియసురాంఘ్రిపం బయిన ని న్నర్థించు
దాసుల్ హరీ. 29

క. వేదము లాదిగఁ గలయ
ష్టాదశవిద్యలకు నీవ స్రష్టవు దత్త
ద్బోధకులును భవదాజ్ఞా
పాదకులు సమస్తధర్మపాలనచతురా. 30

సీ. జలములు సృజియించి జలములయందు నీ
యంచితబీజంబు నావహించి
యది యప్రమేయమహాద్భుతాండస్వరూ
పంబునఁ బెంపారఁ బద్మభవుఁడు
జనియించె నందుఁ దజ్జాతులు భృగుమరీ
చ్యాదులచేత సురాసురాది
వివిధభూతోద్భవవిస్తార మేపారి
త్రిభువనవ్యాప్తి సుద్దీప్త మయ్యె
గీ. నింతయును జూప[2] నడఁపంగ నెంతయును బ్ర
వీణ్యమై దేవ నీమాయ వినుతి కెక్క
విమలకమలాక్ష సదవనక్షమకటాక్ష
విగతపరితాపహృద్దీప విశ్వరూప. 31

క. కేవలకరుణామూర్తివి
గావున భక్తాభయత్వకరణము పని నీ

---

1. హాస్త్రోత్రేయ, హాస్త్రోచ్ఛేయ. 2. నడుగ.

కీవిశ్వాముగాచుట్కై
శ్రీవల్లభ [1]యెప్పుడు నవతరింతు నిజేచ్ఛన్. 32

చ. కడఁక దలిర్ప నీవు మధుకైటభదైత్యులఁ జక్రధారచే
మెడలు దెగంగ వ్రేయునెడ మిక్కుట మైనతదీయరక్తముల్
వడిసినయోడికల్ నెరయ వ్రాసినలత్తుకభంగిఁ జోద్యపుం
దోడవుగ నొప్పునీతొడవుతోరపుటొప్పుదలంతు మీశ్వరా.

చ. చదువులు గోలుపోయి యొకజాడయుఁ గానక బమ్మరించున
మ్ముదుసలివేల్పు దేర్చి వెస ముచ్చుబడిం బ్రళయాబ్ధినీటగ్ర
క్కదలఁగ దాడివెట్టిన [2]యఖర్వభవత్తిమిరూప మిప్పుడున్
మదరుచి గ్రోలుచుండు మునిమానసపూరములం జగన్నిధీ.

చ. కమఠతనూవిలాసమునఁ [3]గవ్వపుఁగొండ ధరించి తేవ న
య్యమృతముఁ దెచ్చి యాశ్రితజనావలి కిచ్చితి నేఁడు నమ్మహా
కమఠతనూవిలాసము దగన్ దలఁపన్ గొని యాడఁగన్న వా
రమృతముఁ గాంచి నిర్మలసుఖాంబుధిఁ దేలుదు రార్తరక్షకా.

చ. గొరిజల త్రొక్కనం బ్రిదిలికుండలిభర్త యొదుంగ నూర్పులం
దొలి మహార్ణవోదకము త్రిప్పుకొనం బటురోషతాడనన్
జిరిఁగి యజాండకర్పరము చిల్లులువోవఁగ యజ్ఞపోత్రివై
ధర పదిలంబుగా నిడిన తావకలీలఁ దలంతు మవ్యయా. 36

ఉ. ఖేదము లేక యజ్ఞమయకేసరముల్ గదలంగ విస్ఫుర
న్మేదురహేషితధ్వను లమేయములై ప్రణవస్వరూపతన్
రోదసి నిండఁగా హయశిరోవపువొప్పయు గాంతసంహృతిన్
వేదము లుద్ధరించినపవిత్రయశుండవు నీవు శ్రీనిధీ. 37

1. యపుడునవసరింతు. 2. నఖర్వ. 3. గర్వపుఁగొండధరించుతేవని.

మ. స్ఫురదాతామ్రజటాకలాపములతోఁ బూర్ణేందు[1]సౌందర్యసుం
దరవక్త్రంబులతో మహోగ్రఘనకోదండేషువిస్ఫారభా
సురపూర్వాపరభాగవైభవముతో సొంపారునీరూపముల్
నరనారాయణనామధేయములు[2]వర్ణ్యంబుల్ జగన్మంగళా.

ఉ. భూతభవద్భవిష్యదురుభూతసమృద్ధుల నొప్పు నీసమ
గ్రాతతదివ్యరూపముల నన్నిఁటి నిట్టివి నా నెఱుంగ సం
ప్రీతి నుతింప శక్తుఁడె విరించియుఁ, గేవలభక్తియుక్తులన్
గాతురులన్ గృపాగరిమఁ గావుము మమ్మఖిలాండనాయకా.

క. గోవింద కృష్ణ కేశవ
శ్రీవల్లభ పద్మనాభ శ్రీకర సితరా
జీవాక్ష చక్రధర నీ
సేవకుల ననుగ్రహింపు శీతలదృష్టిన్. 40

క. పావనవనమాలికాధర
గరుడధ్వజ శార్ఙ్గధన్వ కాంచనవర్ణాం
బరధర కౌస్తుభరత్నా
భరణ ప్రసన్నుఁడవు గమ్ము పాలింపు దయన్. 41

క. వైకుంఠనాథదయితక
థాకుంఠితకరణచతురధర్మావన ది
నాకల్పభవచ్ఛరణా
బ్జైకాయనతత్త్వ మాకు నభయ మొసఁగవే. 42

ఆ. అమృత యభవ యలయ యక్షయ యవికార
యప్రతర్క్య యనఘ యజిత యచల

---

1. సోదర్య అని యుండును. 2. వర్ణంబుల్.

యప్రమేయ యమల యాద్య యనాద్యంత
యాప్తమతుల మమ్ము నవధరింపు. 43

వ. అని యనేకప్రకారంబులఁ బ్రస్తుతించుచు సభక్తిచిత్తులై
యున్న యన్నాకౌకసులఁ గరుణావలోకనంబునం గైకొని
యాలోకేశ్వరుండు మీకుఁ బ్రసన్నుండ నైతి నెయ్యది
యిష్టం బేమికారణంబునం జనుదెంచితి రింతదైన్యం బేల
వచ్చె మీయాపద యపనయించెద నెఱింగించునది యనిన
డెందంబులఁ గొందలంబులు డిందుపడ బృందారకు లందఱు
నందంద సాష్టాంగదండప్రణామంబు చేసి యిట్లని విన్న
వించిరి. 44

తే. దేవ దేవేశ దేవరదివ్యచిత్త
మునకు గమ్యంబు గానిది భువనకోటి
నెందునుం గల్గునే నైన యేము విన్న
పంబు చేయఁగ విను డభిప్రాయము మెయి. 45

వ. చిత్తగింపుము దితిసూనుం డైనహిరణ్యకశిపునకు హిరణ్య
గర్భుండు వరం బిచ్చి యధికుం జేసిన నయ్యసురాధముండు
క్రోధమాత్సర్యంబులు దన్నుం జుట్టుకొనఁ జెరఁగి యదితి
సంతతిం బరిభవించి త్రైలోక్యదుర్జయుం డై యున్నవాఁడు.

తే. బలియునింట బాసిన నైనఁ బలుప వెఱచు
నొరులు నీయింటిదాసుల నోటలేక
మిమ్ము నసుర భంజించుట మాకుఁ జెప్ప
సిగ్గు లయ్యెడు నిందుఁ వచ్చియును దేవ. 47

1. వినుఁడభిప్రాయము. 2. 'బలియు నింటి' 3. 'వెఱతురొరులు'.

చ. అలఘుసరోషదృప్యదసురాధిపతీవ్రగదాహతిఁ గడుఁ
గలఁగినమస్తకంబు లివె కల్పితదానవతర్జనంబుల
న్వెలవెలఁ బాఱుమోము లివె నిష్ఠురదైత్యనితాంతసేవమై
నలజడిఁబడ్డమోము లివె యయ్య కృపం బరికించి కావవే.

తే. ఆహిరణ్యకశిపుఁ డడరి సమస్తసం
పదలు గొనిన దివ్యపదముఁ బాసి
యిప్పు డున్నవార మిల హిరణ్యకశిపు
హీను లైననరులలోనఁ గలసి. 49

ఉ. దానవుచేతఁ గప్పుబడి దైన్యము నొందుట కోర్వలేక నీ
దైవపదాంబుజంబు లభయం బని చేరితి మెవ్విధంబునం
దైనఁ బ్రసన్నమానసుఁడ వై మముఁ జేకొనవయ్య మాకుది
క్కైనను గాక యున్న నసురాంతక! నీవకదయ్య యెఱుగ్యుడన్.

వ. అని కృప పుట్టం బలుకు దివిజులపల్కులు మనస్కరించి మధు
మథనుండు కొండొక యూహించి యనంతరంబు వారల
కి ట్లనియె. 51

చ. ఎఱుఁగుదు నేను దైత్యునియుదీర్ణమదోద్ధతచేష్టితంబు మి
మ్ముఱక పరాభవించుటయు నుల్లమున న్దలపోసి వానికిన్
గొఱతలు నిండునంతకును గ్రూరతఁ గైకొనకున్నవాఁడ, ను
క్కఱఁ దిమిరం బడంపఁ దిమిరారియుఁబూను నెవేగకుండినన్.

వ. అమ్మహాసురుండు సరసీరుహసంభవుం బ్రసన్నుఁ గావించిన
యప్పుడుం దనకుం జావు లేకుండ ననేకప్రకారంబులు
యోజించుకొని వేఁడినవాఁడు గావున వాఁ డడిగినచం
దంబు లెయ్యవియుం గాకుండ నొక్కటి తప్పిశమనో

పాయంబు నిరపాయంబుగాఁ బ్రయోగించుటకు నూహిం
చినవాఁడ నని యెట్లనిన. 53

సీ. ఆననభంగి పంచాననసమరేఖ
[1]యఖిలాంగమును బురుషానుకారి
తీవ్రనఖంబులు తీవ్రశస్త్రంబులు
సంధ్యాముఖము ఘనశౌర్యవేళ
విపులాంకపీఠంబు రిపునకు వధశిల
తద్భుజామధ్యభేదనము గదన
మమరభుజంగమర్త్యావాసనిగ్రహా
నోదన విజయప్రమోదలీల

గీ. యిట్లుఘోరాద్భుతస్ఫూర్తి నెసకమెసఁగ
నతులనరసింహభవ్యదివ్యావతార
మేను ధరియింతుఁ దడవులే దింక నాత్మఁ
గలఁక విడువుఁడు దేవతాగణములార!. 54

క. వినుఁ డాశ్రితరక్షణమే
యనువునఁ గావింతునొక్కొ యని యనిశము నే
మనమునఁ దలపోయుదు మఱి
తునె శరణాగతులమిమ్ము దురితరహితులన్. 55

చ. ఒకమఱి నన్నుఁ బేర్కొనిన నుల్లమునం దొకమాఱు నక్సభ
క్తికమఱియై తలంచినను దెల్లము భక్తుఁడు వాఁడు నాకు, వా
నికిఁ గలనేను, వేఱొకటి నేరక నన్నుఁ దలంచుపుణ్యులన్
బ్రకటదయానురక్తిఁ బరిపాలనసేయుట చెప్ప నేటికిన్. 56

1. యఖిలాంగములు పురుషానుకారి.

ఉ. చెప్పితి సర్వవేదములఁ జెప్పితి శాస్త్రవిచారపద్ధతిం
జెప్పితి సత్పురాణములఁ జింతితకల్పమహీరుహం బనా
నొప్పుమదీయకీర్తనము, యుగ్రతపంబులఁ జెందు పుణ్యముం
జొప్పడు నస్మదీయగుణశోభనముం గొనియాడ నేర్చినన్.

క. ఏవాఁడు నన్ను నెఱుఁగఁడు
గావునఁ ద్రైలోక్యహితముఁ గావింపంగన్
భావము దెలుపుచు నుండుదు
నీవిశ్వంబునకు నేన యెప్పుడు కరుణన్. 58

తే. సకలభూతజాతములకు సముఁడ నేను
వినరె యట్లయ్యుధర్మవిద్వేషు లైన
తామసాత్ముల నైరింప ధర్మబుద్ధిఁ
బొగడఁ గనినసాత్త్వికతతిఁ బ్రోతుఁ గరుణ. 59

వ. మీరు సాత్వికచిత్తులరు గావున నాకు నవశ్యరక్షణీయులు. తామసమర్దనంబు గార్యంబుగా నాకు మీరెవ్వరుం జెప్ప వలదు. మీపదంబులు మీకును స్థిరంబులైనవిగాఁ దలంచి నిరాతంకహృదయులరై యుండుఁడు. పొండని యానతిచ్చిన నాజగన్నాథువచనంబులు మహాప్రసాదం బని యంజలిరచనా రమణీయంబు లగుమౌళిభాగంబులం బరిగ్రహించి పురందర రాదిబృందారకు లానందంబున నానందకహస్తుచేత నామంత్రితు లై, మరలి భావినరసింహరూపప్రకారం బూహించి యాశాకుతూహలప్రమోదభక్తిపరవశమానసు లగుచుఁ దత్కారోద్యదోద్యగప్రవర్తకుం డగువాచస్పతిఁ బ్రస్తుతించుచుఁ బరమేశ్వరు వాక్యంబుల నానావిధంబులం భావించి సంతసిల్లుచు నిజస్థానంబులకుఁ జని రక్కాలంబున నచ్చట. 60

చ. జగములుమూఁడుగెల్చియొకశంకయుఁగింకయు లేక దైత్యుఁడ
త్యగణితవైభవంబున నిరంతరభోగపరంపరారతిన్
దగిలి మనంబుగోరినవిధంబుల వేడ్కలఁ దేలుచుండు సొం
పుగఁ దనధర్మపత్ని యగుపొల్తియుఁదాను సుదాత్తలీలలన్,

చ. ఉదధిపునొద్ద నర్థపతియొద్ద నిలింపకులేంద్రునొద్ద ను
న్మదకలలీలఁ గ్రాలు నెలనాఁగలు నాగరికంపుఁజందముల్
పొదల విలాసహాసము లపూర్వపుగర్వములం దలిర్ప న
య్యదితిసుతాహితుం గొలుతు రమ్ముదువోయినయ ట్లజస్ర
మున్. 62

క. విశ్వావసుతుంబురులును
నశ్వముఖులు నరుగుదెంచి యందఱు నాదై
త్యేశ్వరు నారాధింతురు
శశ్వత్సంగీతకప్రసంగప్రౌఢిన్. 63

శా. వీణావేణుమృదంగసంగతకళావిన్యాసముల్ బంధుర
శ్రోణీరమ్యఘనస్తనీనటనచారుప్రేక్షయుల్ సంతత
ప్రాణప్రీణనగంధబంధవిలసత్కాదంబరీకేళియుల్ [న్.
[1]ప్రాణంబు ల్దనకొం డెఱుంగఁ డతఁ డెబ్భంగిన్ సమస్తక్రియ

సీ. అమృతశీకరసేకహారితవనావలీ
సుందరమందిరకందరములు
రత్నపుష్పామోదరమ్యకాంచనలతా
కోమలమేరునికుంజములును
గనకాంబుజక్షోదపునరుక్తవాలుకా
లలితమందాకినీపులినములును

1. ప్రాణంబుల్ దలకొం.

హంసకుటుంబనిత్యావాసహేమాబ్జ
చారుమానససరిత్తీరములును

గీ. నాదిగాఁగల్గు దివిజవిహారభూము
లన్నియును దానయై వేడ్క లగ్గలింప
ననుదినంబును నచ్చరల్వెనుకఁ దిరుగఁ
దానుఁ బ్రియయును విహరించె దైత్యవిభుఁడు. 65

వ. ఇట్లు సంతతప్రమోదంబు లగువినోదంబులఁ గాలంబు చను
చుండ నొక్కతఱి వసంత సమయావసానం బగుటయు. 66

ఉ. ఒయ్యన మాధవీలతల నుండుట లుజ్జనఁ జేసెఁ దుమ్మెదల్
గ్రుయ్యఁగఁ బాఱి పాటలతరుప్రకరంబుల మూఁగె నుక్కు
నక్,దియ్యనివింటికి న్మరుఁడు దీసిన[1]యమ్ముల గాన మెచ్చెఁదా
నెయ్యెడ మల్లెక్రొమ్మొగడ లేపునఁ బాంథుల వేఁటలాటకున్.

చ. మలయజవారిసేకముల మౌక్తికనూతనహారలీలలన్
వలిపెపుసన్నకావులను వారిరుహాక్షుల పీఁగుఁజన్నులన్
గలిగినచల్మిరిం బ్రదికెఁ గాక జనావలి యిట్టివేసవిన్
గలదె శరణ్య మన్య మనఁగాఁ గడుఁ జెర్చె నిదాఘదాహ
ముల్. 68

తే. అదరిపాటున వేసవి పొదవికొనినఁ
గలఁగి తలఁగి పోనేరక మలయపవనుఁ
డిందుఁ దలదూర్చికొనియె నా నింపొనర్చె
నమరుతాలవృంతముల మందానిలంబు. 69

1. యమ్ములు.

మ. [1]తమచుట్టుం బయలైననూత్నశశికాంతస్ఫారవేదుల్ మహో
ద్యమచంద్రోదయలీల రేలుగరఁగం దత్తోయసంసేవనల్
గమియం దనొప్పఁగంగనొప్పఁగొంగత్కేళి కాంతారభూ
జము లొప్పెమియుఁ గోలుపోకకడునిస్సారంపుఁబెన్వేసవిన్.

చ. రమణభుజానిపీడనఁ గరంగినకాంతలవిస్ఫురన్నితం
బములఁ దలిర్చు సన్నవలిపంబులు వీడియు జాఱవయ్యెఁ జె
న్నమరువినూతనక్షతనఖాంకము లింపెసలారఁ గ్రమ్ము నుం
జెమటలఁజాల బచ్చులయి చిక్కఁగ నంటి కొనంగఁ జేసినన్.

చ. పరిమెయిమెట్టితొల్తబవాలుభంగులఁ గ్రాలెడుమిత్రుజైత్రునిం
బొరిగొన [2]వచ్చు గ్రీష్మమనుపొచ్చెపుఁ[3]బేరిపురారిఫాలభా
సురపటువహ్ని యంచు వెఱఁజొచ్చినమన్మథుఁ గాచె నత్తఱిన్
సరసశిరీషకేసరలసన్మహిళామృదులాలకాగ్రముల్. 72

తే. పగళులెలతోఁటనీడలు బ్రాఁతియయ్యెఁ
బగళులును రేలు దనుగాలి బ్రాఁతియయ్యె
రేలువెన్నెలబయళులు ప్రియములయ్యె
రేలుఁబగళులు నిద్రలు ప్రియము లయ్యె. 73

వ. ఇట్టి ఘర్మసమయంబున నసురవల్లభుండు వల్లభాజనసహితం
బుగ నొక్కనాఁడు నిజమందిరాభ్యంతరకేళీకాంతారంబు
నందు. 74

సీ. ఎండకన్నెన్నఁడునెఱుఁగని క్రొమ్మావి
నీడలఁ దనుపారునెలవులందుఁ

---

1. తమచుట్టం. 2. వచ్చె. 3. శేరఁ బురారి.

కలిగొట్టుఁ బువ్వులందలి తేనియలవానఁ
దడిసినపాదరిండ్లయెడములందు
విరియనూఁకించు క్రొవ్విరపుమల్లియ మొగ్గ
లెలదావిఁ జొక్కించు నిక్కులందు
రాయంచయెఱకలరాయిడిఁ దుప్పర
సల్లెడు కొలఁకులచలువలందుఁ

గీ. దిరిగితిరిగి పెక్కుదెఱఁగులయాటల
మెఱసిమెఱసి చెన్నుమిగిలిమిగిలి
క్రాలఁ బ్రొద్దుమాపకడ నయ్యెఁ గలువల
మ్రొక్కు దైవమునకు నెక్కు నసఁగ. 75

తే. ఇట్టివేసవితఱిఁ బగ లిట్టినిడివి
యైనసయిరించునే దివిజారి యనుచు
వెఱచి తొలఁగెడు తెఱఁగున నేఁడివెలుఁగు
వరుణుఁ డేలెడు దెసవొక్కవలననొదిఁగె. 76

చ. ఇను నసమానతేజు దివసేంద్రుఁగనుంగొనుమాడ్కిఁ జూడఁ
గాఁ, జన దొరు నల్పతేజు ననుచాడ్పునఁ జంచలభృంగతా
రకా, ఘనవనజాతలోచనము గ్రక్కున మీలన మొందఁ
జేసెఁ బద్మిని పతిభక్తి సత్త్వమున మేలిమికిం గుఱి దాన
పొ మ్మనన్. 77

చ. సురుచిరతారకాకుసుమశోభినభోంగణభూమిఁ గాలమ
న్గురువపుసూత్రధారిజతనంబున దిక్పతికోటిముందటన్
సరసముగా నటింపఁగ నిశాసతి కెత్తినక్రొత్తతోఁపుఁ బెం
దెర యన [1]నొప్పెసాంధ్యనవదీధితి పశ్చిమదిక్తటంబునన్.

1. నొప్పు.

క. నలుదెసలయందుఁ దొలితొలి
తలసూపు దమఃప్రరోహతతులు విరోఁగా
కులచక్రవాకమిథునం
బుల వగయనుచిచ్చు రాఁజు [1]పొగలనఁ దగియెన్. 79

తే. [2]పొదలి యొండొండ దివియును భువియు దిశలుఁ
బొదివికొనియుండు చీఁకటి ప్రోవువలన
మిక్కుటంబుగఁ గాటుక గ్రుక్కినట్టి
[3]కరవటంబన జగదండఖండ మమరె. 80

ఉ. రాజితతేజుఁడై నదినరాజు తిరోహితుఁడైనపిమ్మటన్
రాజు దయాద్రిపీఠము తిరంబుగ నెక్కెఁడుసందికట్టునన్
భ్రాజితసత్పదంబునకు బాధయొనర్చుచు జారచోరసం
పూజితమై తమంబుగడుఁ బొంగె నధర్మము [4]తోడిజోటియై.

క. పదపడిపూర్వదిశాసతి
వదనంబునఁ దెల్పు[5]మిగిలె వచజాహితుచూ
లుదరంబునధరియించినఁ
గదిరినపాండురకపోలకాంతివిధమునన్. 82

వ. అంత. 83

సీ. తిమిరభూతముఁ సోకు[6]తెరల జగత్త్రయీ
లలనదాల్చినరక్షతిలకమనఁగ
సఖ్యంబునకునిశాసతి యొసంగిన బ్రాచి
ప్రాపించు గురివిందబంతియనఁగఁ

1. పొగలనడఁగియెన్. 2. పొదవి. 3. కరపటంబున. 4. తోడిచోట తొ. 5. మిగిలి. 6. దలియ.

దోయధి వెడఁ గ్రుంకితోఁచుపురందర
          కుంభిసిందూరితకుంభ మనఁగఁ
గులిశాయుధుని పెద్దకొలువున నెత్తిన
          దీపించుమాణిక్యదీపమనఁగఁ
గీ. కుముదినీరాగరసబద్ధగుళికయనఁగఁ
గామినీరంజనౌషధకబళమనఁగఁ
బొడవు పెంపునబింబంబుపొలుపుమిగులఁ
జంద్రుఁడుదయించెఁగాంతిని స్తంద్రుఁ డగుచు. 84

వ. ఇట్లుదయించి. 85

చ. [1]దెసలనుగొమ్మలొయ్యనతిదీర్ఘములైనకరంబులన్ బ్రియం
బెసఁగఁగ నూఁది నిక్కి రజనీశ్వరుఁ డున్నతలీలఁ [2]జేర్చునా
కసమను పేరిభూరుహము కాంతనిరంతరతారకాలస
త్కుసుమచయంబుగోయుట కొకోయనఁ బ్రాఁకె సముత్సుకా
కృతిన్. 86

ఉ. వెన్నెలవెల్లిపాల్కడలి వ్రేఁకదనంబునఁ బేర్చిదిక్కులున్
మిన్నును[3]ముంపనందుఁ రజనీకరబింబముకుండలీభవ
త్పన్నగతల్పకల్పనముభంగిఁ దనర్చెఁ దదంతరంబునన్
వెన్నునిభంగిఁ జూడ్కులకు వేడ్కయొనర్చెఁ గలంకమత్తఱిన్.

చ. వడిగొని తేకులుప్పతిలవాలినకేసరముల్ దలిర్పఁబు
ప్పొడిదల మెక్కి తేనియలు పొంగితరంగలుఁగాఁ జెలంగి పైఁ
వడునెల దేఁటిదాఁటులకుఁ [4]బండువులైనవసౌరభంబులు
గ్గడువుగనుల్లసిల్లెఘనకైరవషండము నిండువెన్నెలన్. 88

---

1. దిసలను. 2. దేర్చు, చేర్చు. 3. ముంచియందు. 4. బండువలై.

ఉ. వెన్నెలవెల్లపచ్చడమువిచ్చినయంబరశయ్యమీఁదఁజే
రన్నననుండిదిగ్వనితలాదటఁ జొట్టునుగొల్వరాత్రియన్
కన్నియఁగూర్మిచిక్కఁదనకౌఁగిటఁ జేర్చిసుఖించినాఁడనన్
జెన్నువహించెఁజందురుఁడు శ్రీకమనీయకళంకరేఖతోన్. 89

సీ. కరఁగెడునవచంద్రకాంతోపలంబుల
తఱచుసోనలఁగడు దలముకొనుచుఁ
జటులచకోరసంచయముల యొఱకల
గర్వంపుదాఁటులఁ గడలుకొనుచు
విరియుకైరవములవిపులరంధ్రములపైఁ
దీవంబుగాఁ గ్రమ్మితిప్పుకొనుచుఁ
గామినీజనములకమనీయవిభ్రమ
స్మితకాంతిలహరుల మెండుకొనుచుఁ

గీ. బొదలిపొదలి చదలఁ బొంగారిపొంగారి
మించిమించి; దిశలుముంచిముంచి
[1]యభినుతేందుచంద్రికాంభోధియఖిలంబు
నీట నిట్టలముగ నిట్టవోడిచె. 90

వ. ఇట్లతిమనోహరగంభీరధీరంబైన సుధాకరకాంతిపూరంబు రాత్రి యనుతలంపుఁ దోఁపనీక తమ్ము బహునామంబును విన నీక యవ్యక్త యనుశంక నంకురింపనీక లోచనంబులకు నమృతసేచనంబును, శరీరంబునకుఁ జందనాసారంబును, నంత రంగంబునకు నానందతరంగంబును నగుచు విజృంభించిన సమయంబున. 91

---

1. యభినుతేంద్ర.

క. తన దేవియుఁ దానును న
ద్దనుజవిభుఁడు విమలసౌధతలమునఁ గాంతా
జనపరివృతుఁడై సురతరు
జనితములగు మధురమధురసంబులు వేడ్కన్. 92

క. తెప్పించి సహజసౌరభ
సొప్పారఁగ దివ్యరుచిసమున్నత[1]ములునై
యుప్పొంగువానిఁ గనకపుఁ
జిప్పల నిండించె మగము చిప్పిలుచుండన్. 93

ఉ. అందఱుఁ గైకొనంబనిచి యాదటఁ గాంతయుఁ దానునొక్కకో
రం దనుపార దివ్యమదిరామధురామృతపానకేలి యం
దందయొనర్పఁగాఁ దోడఁగొనంబురుహాక్షులవిభ్రమక్రియా
కందళితంబులై నసవికారవిహారములింపుఁ బెంపఁగన్. 94

క. ఆరమణులమదిరారస
పూరిత[2]చషకములఁ దోఁచుపూర్ణేందుఁడు పొ
ల్పారెను వాసనకై క
ర్పూరంపుం[3]బల్కు లిడినపోలిక యమరన్. 95

చ. నెలఁతయొకర్తు చేతిహరినీలశిలామయపాత్రిఁ బూర్ణసం
వలితతరంగయై పొదలువారుణిఁ దోఁచుసుధాంశుమండలం
బలముకరాళరాహువదనాహతి స్రుక్కి కరంబుఁ బిమ్మిటిం
గలఁగి పొరింబొరిన్ వడఁకుకైవడిఁ గానఁగనయ్యె నయ్యెడన్. 96

చ. సురుచిరపానపాత్రమున సుందరియొక్కతె కేల నిండుచం
దురుఁడు ప్రకంపితాంగములతోఁ దిలకించెఁ దదాననాంబుజ

1. సముల్లై. 2. ఝషకము. 3. బల్కులిడిన; బలుకుక్కలిడిన.

స్ఫురితవికాసవైభవము సొంపులడంకువ ముచ్చిలించిచె
చ్చెరఁ జను దెంచిపట్టువడి చేడ్పడిభీతివడంకుచాడ్పునన్. 97

చ. పొలఁతుక[1] యోర్తెరెయొప్పుమధుపూరితపాత్రికఁ గానవచ్చును
జ్జ్వలహిమధాముచేతఁ దనవక్త్రము కాంతికిఁ గాంతిపూరముల్
[2]గలయఁగఁ దచ్చితేర్చి యొడికంబుగఁ బుచ్చినవెన్న కల్లుతోఁ
గలపికరంచి క్రోలుటకుఁ గా నిడికొన్న తెఱంగునందగన్. 98

ఉ. ఈరమణీలలామవదనేందునిఁ జెందిపవిత్రయైన యి
వ్వారుణిఁ గాని పాయదు ధ్రువంబుగనాత్మకలంకమంచు నిం
పార మునింగెఁగాక యమృతాంశుఁడనన్ బ్రతిబింబచంద్రుఁ
[3]డొప్పారెనొక ర్తుచేతిసముదంచితకాంచనపానపాత్రికన్.

తే. [4]చషకమునఁ గామినీముఖచంద్రుఁడును సు
ధాంశుఁడును బింబితాంగులై యలరుటొప్పె
నర్థిఁ దమలోనఁ జెలిమి సేయంగ శపథ
మునకు వరుణతనూజలో మునిఁగినట్లు. 100

వ. ఆసమయంబున. 101

చ. ఎనసిన[5] రాగబీజమున నీరికలెత్తినదర్పహాసముల్
ఘనతరశాఖలై యలమొగంబులఁ గెంపులుపల్లవచ్ఛవిన్
బనుపడ వాలుకన్గొనలఁ బర్వ మెఱుంగులు పుష్పలీలగాఁ
దనరె[6] నితంబినీజనము తద్ధ్రుమరూఢిసురాంబుసేచనన్. 102

వ. ఇట్లు మదిరాపానమత్తలైన మత్తకాశినులయుద్వృత్తవిహా
రంబులు నుత్తమలావణ్యసంస్కారంబులు నృత్తగీతవాద్య

1. యోర్తు. 2. గలయఁగఁ దేర్చిత్రచ్చి. 3. ప్పార. 4. ఝషకమున
5. రాగ. 6. నితంబినీజన దటద్ధ్రుమరూఢి.

కళావిలాసంబులు గారవించుచు సాంద్రానందహృదయుండై
పెద్దయుం బ్రొద్దు వినోదించి యందఱం బోవంబనిచి. 103

క. లలితోత్తరచ్ఛదంబగు
తలిమంబునఁ దానుహృదయదయితయు రాగా
కులసుప్తిఁ బొందె గంగా
పులినతటాభ్రము మహేంద్రపురదంతి క్రియన్. 104

వ. అంత. 105

క. కలఁగాంచి యసురవల్లభ
కులభామిని మేలుకాంచి కుతుకాద్భుతసం
చలతాపరవశయై యా
కులభావము నొంది వెండి కొండొకవడికిన్. 106

తే. పూర్వదేవవిభుండు ప్రబుద్ధుఁడయ్యె
సతినిజస్వప్నవృత్తంబు పతికిఁజెప్ప
వెఱచి మతినున్చికొనియుండె విచలమధుప
[1]కలితసుప్తపంకజయగు నలినిపోలె. 107

ఉ. రాతిరియెల్లజాటి[2]నను రాగముతోడఁగుముద్వతీరతిన్
బ్రీతిభజించి ఖేదమునఁ బ్రేయసియున్ సొగియంగ[3]దానును
ద్భూతపరిశ్రమార్తుఁడగుపోలికఁ జంద్రుఁడుపశ్చిమాబ్ధిశ
య్యాతలసుప్తికై [4]డిగెవనల్పవిభావిరళాంగరాగుఁడై. 108

ఉ. చల్లనివాఁడుగావుననిశాకరుప్రాపున దీప్తిలీలమై
నెల్లజగంబులు న్మిగిలియుష్మలనుండితిమింత నెంతయున్

---

1. కేలిసుప్తపంకజయగునలినపోలె. 2. జాటియను. 3. దానను.
4. డిగియు; 'డిగెయొ.'

దెల్లముతీవ్రమూర్తి యొరు తేజముసై పడు భానుఁగూడివ
ర్తిల్లఁగవచ్చునే యనుగతిఁ దివిచుక్కలడంగెఁదోడుతోన్.

తే. అంచితోద్యానవాటికలందు నవవి
భాతదళితకుసుమవిభాతి యమరె
నప్పుడరయంగఁ జంద్ర[1]కరాబ్ధివెల్లి
డొంకిచనఁ దోఁచునురువు తెట్టువలనంగ. 110

సీ. వెడవెడమూఁతులువిచ్చుతామరలపై
సుడిసి నెత్తావులుసూఱలాడి
యనుఁగుఁదోఁటలు సొచ్చియలరు తేనియఁ జేసి
యొలదేఁటి పదువులఁ జెలఁగినడచి
రాయంచకవలనిద్రలు దెల్పికొలఁకులఁ
దరఁగ యుయ్యాలయాట దగులుపఱచి
సోర్ణగండులుసొచ్చి సురతఖేదమునందుఁ
జెలువలఁ జెలువుర సేదదేర్చి

గీ. యడరి గృహపతాకికలకు నాటగఱపి
ప్రోది నెమళులయొఱకలపొదులువిప్పి
మందసంచారముగ సుకుమారమగుచు
మెఱసెఁ బ్రత్యూషసమయసమీరణంబు. 111

క. రవిరాకకుఁ బూర్వదిశా
యువతిగృహాంగణము కుంకుమోదకసేక
ప్రవిభాతమయ్యెననఁగా
నవారుణోదయవిజృంభణము విలసిల్లెన్. 112

---

1. వరాబ్ధి.

మ. సరసస్నేహాఘనంబులాయతదిశాసంసక్తముల్ కజ్జల
స్ఫురితోపాంతములిష్టభూరివిషయంబుల్ కామినీనేత్రభా
సురరోచుల్ దమునేఁడు[1] ద్రుంచుకరణిన్ సుస్నిగ్ధరాగంబులై
పరఁగంగావెల వెల్లనయ్యె గృహదీపవ్రాతముల్ వేకువన్.

మ. అలినీమంజుల[2]గీతులుం బటుతరంగాలోలనాదంబులున్
విలసత్తీరలతావికీర్ణసుమనోవృష్టిప్రచారంబులుం
గలహంసీహసితానులాపములునై గంభీరపద్మాకరం
బులుగోకద్వయసంగమోత్సవములంబోల్పారెఁగాల్యంబులై.

వ. అంత. 115

మ. అనితర[3]కాంతఁ బద్మినిఁ బ్రియాతిలకంబు మొఱంగిపోయిరే
యొనసినవేడ్క నొందుదనయిచ్చ మెయిన్విహరించి[1] మేనసం
టినవరాగలీల జిగిదేరఁగ*నోడియొదింగియొయ్యనొ,య్యనఁ
బొడచూపెనానుదయమయ్యెఁ బతంగుఁడు ప్రాఙ్ముఖంబునన్

సీ. కమనీయదిగ్వధూకర్ణపల్లవములా
కాశకింశుకకోరకప్రతతులు
వాసరవారణవదనసిందూరముల్
వనరుహాకుంకుమోద్వర్తనములు
కుముదినీనవతపఃక్రమవల్కలంబులు
తిమిరాపహరణప్రదీపశిఖలు
త్రైలోక్యమందిరరత్నతోరణములు
ప్రత్యూషనటరక్తపత్రకంబు

---

1. ద్రుంచు 'ఏఁగుదెంచు' అని యుండునేమో. 2. గీతులం. 3. కాంతిఁ.
4. జంటిన: *జెం,దిన నవరాగ.

గీ. లనఁగ నూతనంబులై కెంపులై సొంపు
లలర మణిమరీచు లతిశయిల్ల
నఖిలభువనమంజులాంజలిపుటపూజ్య
మానుఁడగుచు బాలభానుఁ డొప్పె. 117

వ. ఆసమయంబున నసురేశ్వరుండువిహితదినముఖవ్యాపారుండై
యంతర్గపురంబు వెలువడి యాస్థానభవనంబునకు వచ్చి సకల
సురరిపుప్రకరంబులు పరివేష్టింప నభీష్టచేష్టితంబులఁ వర్తిల్లు
చున్నయెడ భృగువంశవరుండును, దైత్యవంశగురుండును
నిజమంత్రమహిమావధీరితశక్రుండును నగుశుక్రుండును జను
దెంచి హిరణ్యకశిపుంగాంచి యతనిచేత నభినందితుండై
వివిధాశీర్వాదంబుల నమ్మహావీరు నభినందితుంజేసి తదను
మతిం దదీయ[1]జీవితేశ్వరిని దీవింప నభ్యంతరమందిరంబునకుం
జనిన. 118

మ. గురుఁ[2]దాదవ్వులఁ గాంచి సంభ్రమముఁ జక్కఁగ ప్రీతియుం
భక్తిత,త్పరభావంబును నొప్పనప్పుడు వెసంబద్ధాతిఁ ప్రత్యు
ద్గమా,దరసంసక్తి నమస్కరించెమహితోద్యత్పీఠవిన్యాసను
స్థిరసంపూజలొనర్చితత్కృతశుభాశీరుక్తకల్యాణియై. 119

వ. తత్సమీపంబున సముచితాసనంబున నుండఁగరకమలంబులు
మొగిడ్చి యమ్మహాత్మున కిట్లనియె. 120

క. రే యొక కలఁ గాంచితి ముని
నాయక యే నది మదీయనాయకుమది యొ

1. జీవితేశ్వరుని. 2. గురుఁడాదవ్వులు.

ష్టయుండఁ జేయునో యని
యాయన కెఱిఁగింపనైతి నాత్మ నునిచితిన్. 121

క. దైవము గురుఁడును బంధుఁడు
నేవిధమున మాకు మీర లీప్సితశుభస
ద్భావంబులు సతతంబును
గావింపఁగఁ గర్తలౌటఁ గవిజనవినుతా!. 122

సీ. అవధరింపుము జలదాసితవర్ణుఁడు
ఘనశంఖచక్రలాంఛనభుజుండు
మహితకోమలవనమాలాసలక్షణ
వక్షుఁడు వికసితవారిజాక్షుఁ
డభినవపీతాంబరావృతదేహుండు
భూదేవుఁడొక్కఁడు డపూర్వలీలఁ
జనుదెంచి ననుఁ జూచి సస్మితవదనుఁడై
తనచేత నొప్పు సంతానఫలము

గీ. నాకు నిచ్చి మున్ను నామెడ నున్న హా
రంబు నిజనఖాంకురములఁ దిగిచి
కొనుచు వేగ చనియె నని రాత్రి నేఁగల
గంటి నపుడు మేలుకొంటి ననఘ. 123

వ. వీనిఫలం బెయ్యది యానతీయవలయు ననినఁ గావ్యుఁడు కొం
డొక దలపోసి నిశ్చయించి యద్దైత్యరాజమహిషి కిట్లనియె.

ఉ. ఆధరణీసురోత్తముఁ డనాదియనంతుఁ డనంగ నొప్పు ల
క్ష్మీధవుఁ డచ్యుతుం డతఁడు మేకొని నీకును బుత్రు నిచ్చిన

దోఃబ్ధసమగ్రుఁడై పరఁగుపుణ్యునినింతట సంతసిల్లు మే
లాధృతిమూలఁబోమదిఁ దలంపఁగ మీఁది శుభాశుభస్థితుల్.

ఉ. చీరికిఁ గైకొనం డసురసింహుఁడు దుర్వహగర్వబుద్ధినె
వ్వారిని వారిజోదరు నవార్యభుజా స్మధుకైటభారిజం
భారిపురస్సరామరగణైకశరణ్యు వరేణ్యు భక్తని
స్తారకుఁ బేరుకొన్న మదిసైపఁడు మేలిమి యెట్లు గల్గెడున్.

క. నీమగని తేజమున ను
ద్దామరమసమగ్రుఁ డనఁగఁ దగి 'కుంపటిలోఁ
దామర మొలచిన క్రియఁద
న్వీ మునివిభుఁడైన సుతుఁడు నీకుదయించున్. 127

క. నీవైనను మనమున జగ
దావాసుని వాసుదేవు నవ్యయు నెప్పుడుం
భావింపుము దుర్గతులం
బోవరు తద్భక్తజనులు పుణ్యవిచారా. 128

వ. అట్లైనఁ బురంధ్రీరత్నంబవైన నీకతంబున నసురవంశంబు విధ్వంసంబునొందక నిర్వాహంబు వడయునని భార్గవుఁడు సెప్పి యప్పొలంతి వీడ్కొని నిజగృహంబునకుం జనియె నంత. 129

క. కలఁగన్న యదియితవనఁగ?
నెలఁతకు నెలమసలె జగమునిఖిలంబును జే
రెలమింబొందఁగఁదగియెడు
నెలమసలం దెలివసూలు నెలకొని బెలసెన్. 130

సీ. ఉదరస్థుఁ డగు బాలునుజ్జ్వల[1] కాంతియ
వెలిఁ జేర్చెనా మేను వెలరువాఱెఁ
గడుపులోఁ నొప్పారు కొడుకునిర్మలబుద్ధి
తెలుపునాఁ గనుఁగవ తెలుపువాఱె
గర్భశోభితుఁడగు నర్భకు సహజవి
రక్తినాఁ జవుల యాసక్తి దొఱఁగె
లోనున్న సుతుని విలోకవిజ్ఞానంబు
క్రమమనా నాభి వికాస మొందెఁ

గీ. కుక్షిసంగతుఁడగు పుత్త్రకుని గుణాలి
వొదలు తెఱఁగున మధ్యంబు పూర్ణమయ్యెఁ
బూర్వజన్మసంచితతపఃపుణ్యఫలమ
హోదయంబునఁ జారుపయోజముఖికి. 131

క. చాలఁగ నమృతము బాలుఁడు
గ్రోలుటకై నినిచి కనకకుంభంబులపై
నీలపుఁగుప్పెలునిలిపిన
పోలికఁ జను మొనలకప్పు పొలఁతికి నొప్పెన్. 132

తే. అఖిలగుణరత్నములకు నాయతన మనఁగ
భువనభూషణంబన నొప్పు పుత్త్రుఁదాల్చి
యున్న నా కేల తొడవు లొండన్నకరణి
నబల నైసేయుపనులయం దలసయయ్యె. 133

చ. అనుపమయోగలీల నమృతాంబుధియందు శయించుదేవునె
మ్మనమున నావహించియసమానసమంచితయోగసుప్తిమై

1. కాంతినావెలిఁ జేర్చెనన.

నెనసిన బాలుఁ జాలున వహించిన సంతతసద్గుణైకవా
సననొనిరంతరంబుగడుఁజామకుజాడ్యముదోఁచుఁజెయ్యులన్.

సీ. హరినామకీర్తనపరమోత్సవంబులఁ
గావింప ననిశంబుఁ గాంక్షసేయు
విష్ణుదాసులఁ గని వేడ్క నంజలి సేసి
కొనియాడి భక్తిమైఁ గొలువఁ గోరుఁ
బరమాత్మమహిమలు భావించి భావించి
యానందజలధి నోలాడఁ దివురు
నారాయణుని యవతారకథాసుధా
లీలలు వీనులఁ గ్రోలఁ దలఁచుఁ

గీ. దనువు ప్రాణంబు నచ్యుతార్థంబుగా న
మర్పఁగా నెంచు జగములు మహితకరుణ
నెపుడు రక్షింపఁగా నుత్సహించుఁ జెలువ
బుద్ధినంతర్గతుం డగు పుత్రువలన. 135

వ. ఇట్లు ప్రతిదినప్రవర్ధమాన గర్భలావణ్యలలితయైన హ్లాద
యేశ్వరిం గనుంగొని యసురేశ్వరుండు హర్షవికాసవిలసి
తాంతరంగుండగుచుఁ బరమోత్సవంబున భార్గవనిరూపిత
ప్రకారంబున గారవంబు మిగులఁ బుంసవనసీమంతాది కలా
పంబులు నిర్వర్తించి యనంతరంబ సముచితసమయంబునందు.

సీ. అమృతాంబునిధిసముదంచితవీచిక
కుదయించుతుహినమయూఖుఁ డనఁగఁ
జారుపురందరాశానితంబిని కుద్భ
వించు సరోజినీవిభుఁ డనంగ

విలసితరోహణాచలఖనిభూమికిఁ
బ్రభవించు మహనీయరత్న మనఁగ
సుందరనూతనమందార[1]లతికకు
జనియించు సురుచిరస్తబక మనఁగఁ
గీ. గాంతియును దేజమును మహార్ఘతయు సొకు
మార్యమును నభిరామసామగ్రిఁ బొదలఁ
బుత్త్రుఁ డుదయించెఁ ద్రైలోక్యభూతికరుఁడు
రాజబింబాస్య యగుదైత్యరాజసతికి. 137

క. పుత్త్రోదయమున నిర్జర
జైత్రుఁడు [2]మునుకొన్న యధికసమ్మదమున లో
కత్రయరాజ్యము మును నిర
మిత్రముగాఁ గనినకంటె మిక్కిలి పొంగెన్. 138

సీ. పుష్పోపహారము ల్పొలుపారఁ బురమునఁ
గావింపుఁ డనుమాటకంటె మొదల
మంగళవాదిత్రసాంగత్యభంగులు
గలిగింపుఁ డనుమాటకంటె మొదల
నిపుణవిలాసినీనివహసంచారంబు
ఘటియింపుఁ డనుమాటకంటె మొదల
భాసురవైజయంతీసహస్రంబులు
గలిగింపుఁ డనుమాటకంటె మొదల
గీ. దివ్యకుసుమవర్షంబులు దేవదుందు
భిస్వనంబును నప్సరోభినయగతులు

---

1. తిలకకు. 2. మునుగొన్న.

కల్పభూరుహాంబరపతాకలు దనర్చె
భువనహితజన్ముఁ డగు [1]బాలు భూరిమహిమ. 139

క. అవి యెల్ల గని సురద్విషుఁ
డవివేకమనస్కుఁ డగుచు నోర్వ మదీయో
త్సవమునకుఁ దగ నొనర్చిరి
[2]దివిజులు పను లనుచుఁ దనమదిఁ బ్రియ మందెన్. 140

మ. ధరణీమండలి నెందునుం బరఁగి పాతాళంబునం బర్వి ని
ర్జరనాథప్రముఖామరాఖిలనివాసశ్రేణులం దోలిమై
నెరసెన్ బంకజసంభవాలయమునన్ నిండారె నవ్వేళ శ్రీ
కరదైతేయతనూభవోద్భవకథాకల్యాణ ముద్ఘోషమై. 141

క. శ్రీకాంతునగరులోనగు
వైకుంఠపురంబు నిత్యవైభవములతో
నేకోత్సవ మయ్యె శుభ
శ్లోకుం డగుదైత్యరాజసుతుజన్మమునన్. 142

మ. స్వరసౌందర్య మెలర్ప మెల్లన శ్రుతుల్ [3]సాగించి యొ
య్యొయ్య సుస్థిరమార్గంబున యజ్ఞకోటి తలయెత్తెన్ బూజ్య
ధర్మార్థమో,క్షురహాస్యావలి యల్లనల్ల మెలఁగంగా నుత్స
హించె న్నిరం, తరదైతేయభయం బొకించుక ప్రశాంతం బై
[4]యణంగెన్ దగన్. 143

చ. దినకరుఁ డుల్లసిల్లెఁ బటుదీప్తిఁ బ్రదక్షిణభాసురార్చియై
యనలము దేజరిల్లె మహిమాంచితసౌరభరమ్యలీలతో
ననిలుఁడు సంచరించె విమలాకృతి నంతయు నొప్పె దిక్కులెం
దును భువనైకమంగళము దోఁచువిధంబు దలిర్ప నత్తఱిన్.

1. బోలు. 2. దివిజులపను. 3. సారించి. 4. వణంకెన్.

వ. దైత్యపతియును బుత్త్రోత్సవప్రమోదమానసుం డగుచుం గవిప్రముఖభూసురలోకంబు నతిలోకధననివహదానంబుల [1]నానందహృదయుఁడై యానందంబు నొందించి బంధుజనంబులు ప్రమోదంబు నొందం గుమారునకు జాతకర్మాది సంస్కారంబులు గురునిర్దిష్టప్రకారంబున నిర్వర్తించిన నిజజన్మంబున నఖిలలోకప్రహ్లాదం బొనరించుటం జేసి బాలునకుఁ బ్రహ్లాదుండను నామధేయం బొదవించె నంత. 145

తే. అంబగర్భంబు వెడలినయది మొదలుగ
విష్ణుపదకమలధ్యానవివశుఁ డగుచు
నసురరాజతనూభవుఁ డమృతవృష్టిఁ
దడుపఁబడువాఁడ పోలె వర్ధనము నొందె. 146

సీ. పసిపాపఁడై తాను బవడించుకాలంబు
వటపత్త్రశయనుభావంబు దలఁచుఁ
జెలువొందఁగా బోరగిల శయ్యఁ దడవెడు
తఱిఁ గూర్మమూర్తిఁ జిత్తమున నిలుపు
రెండుమూఁడడుగు లొండొండ తట్టాడున
ప్పుడు త్రివిక్రమలీలఁ బట్టిచూచు
లోలత వెన్నలు బాలు గ్రోలెడునాఁడు
గోపాలసంస్మృతిఁ గూర్చు నాత్మఁ

గీ. బరమపురుషభూతభావికభవ్యావ
తారబోధమహిమఁ దగ నెఱింగి
యొం డెఱుంగఁ డంబుజోదరధ్యానత
త్పరత యొకటి కాని బాలకుండు. 147

---

1. నానందహృదయుఁలై.

చ. తొలితొలియెల్ల పాపములుఁ దొక్కుచుఁ బల్కెడునట్టి తియ్యపుం
బలుకుల నచ్యుతాహ్వయముఁ బల్మఱుఁ బేర్కొను వెండి పల్కు నిం
పెలయఁగ నంబ లక్ష్మి[1] జగదేకజనిత్రి ముకుంద యంచు న
త్యలఘుతరప్రబోధమధురాక్షరవాక్యవివేకదక్షుఁ డై. 148

ఉ. ఆడఁగఁ బోయినప్పు డసురాత్మజుఁ డంబుజనాభు నవ్వయుం
బాడుద మాదిదేవుపదపంకజపూజలు సేసి భక్తిమై
నాడుద మచ్యుతైకశరణాగతులం గనికర్మబంధముల్ [కుల్.
వీడుద మంచుఁ బల్కుఁ గడు విస్మయ మందఁగఁ దోడిబాల

ఆ. కుడిచినపుడు నిద్ర గూరినయప్పుడు
మేలుకొనినయపుడు మెలఁగినపుడు
విష్ణుకీర్తనంబు విష్ణుచింతయు కాని
పలుకఁ డొండు బుద్ధిఁ దలఁపఁ డొండు. 150

తే. తొలుత 'మూఁడేండ్లలేని సద్బుద్ధి ముప్ప
దేండ్ల లే' దనుసానుడి యిట్టిదనఁగఁ
దనరెఁ బ్రహ్లాదునకుఁ బ్రౌఢమునులు గోరు
హితవివేకపాకంబు మూఁడేండ్లనాఁడె. 151

వ. అని యిట్లు ప్రహ్లాదుజన్మప్రకారంబు దేవశ్రవుచేత గాలవుం
డెఱింగిన తెఱంగున చతురమధురోపన్యాసంబుగాఁ బ్రక
టించి వెండియు,

ఆశ్వాసాంతము

క. ప్రకృతిపురుషాపవర్తీ
వికృతికరణహరణనిపుణవిశదస్ఫూర్తీ

---

1. జగదేకజనేత.

సుకృతసదయానుపూర్తీ
నికృతివరధరామనిత్యనిరుపమమూర్తీ. (?) 153

పృథ్వి. సమస్తమహిమాశ్రయా [1]జనితభూర్భువ (స్స్వ)స్త్రయా
రమాకుచపరిష్క్రియా ప్రణత[2]దాసనిత్యోదయా
సమాహితమహోదయా సకలకల్మషవ్యత్యయా
సమగ్రవిసరద్దయా జనసుసేవ్యరాగప్రియా. 154

మాలిని. చరణజనితగంగా సత్యనిత్యప్రసంగా
[3]శరద విలసదంగా సౌమ్యచిత్తాబ్జభృంగా (?)
విరచితభవభంగా వేదవేదాంతరంగా
పరమగరిమశృంగా బ్రహ్మనాడీతురంగా. 155

గద్యము. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వరచరణసరోరుహ ధ్యానానందసౌందర్యధుర్య శ్రీసూర్యకవిమిత్రసంభవశంభుదాసలక్షణాభిధేయ ఎఱ్ఱయనామధేయప్రణీతంబైన శ్రీలక్ష్మీనృసింహావతారం బను పురాణకథయందుఁ దృతీయాశ్వాసము.



1. జనిత 'సారలోకత్రయా' బ్రాకెట్టులోని భాగము పూరణము.
2. దాన. 3. జలద.—వ్రాఁతప్రతిలో నీపాఠమే గలదు.



శ్రీరస్తు

# చతుర్థాశ్వాసము

కాంతాపరి[1]రభ్యా
లోకాతిక్రమవివేకలోలుపలభ్యా
శ్రీకరనామస్మరణో
త్సేక దళితవినఘదంభా శ్రీనరసింహా. 1

వ. దేవా రోమహర్షణుండు మహర్షుల కిట్లనియె నవ్విధంబున నాశ్చర్యస్వభావుం డైన యమ్మహానుభావుచరితంబులు భాషితంబులు నంత(?)యెఱుంగని రాజసంబున నాదైత్యరాజు కేవల వాత్సల్యపరవశుండై యబ్బాలు బాలోచితంబు లైన యుపలాలనంబుల గారవింపుచుండె. తల్లియుం గొడుకు చందంబులు డెందంబున కానందంబు నొందింప నిజస్వప్నదర్శనంబు తెఱఁగును గురువాక్యప్రకారంబు తెఱంగును దలఁచి వెక్కసంబందుచు నెయ్యది గానున్నదో యని వెడ దలంకుచుఁ బంకజోదరచరణస్మరణాలాలసం బగుమానసంబుతోడం బ్రవర్తిల్లె నదనంతరంబ. 2

సీ. చౌలమౌంజీబంధసంస్కారములు యథా
కాలకల్పితములుగా [2]నొనర్పఁ

---

1. రంభా. 2. నొనర్చు.

తేజోవిశేషసందీప్తుఁ డై యొప్పి య
ప్పాపఁడు జనకునిపంపువలన
విద్యాపరిగ్రహవినయదీక్షులకునై
పూజితగురుగృహంబున వసించి
దైత్యదానవకులోత్తంసంబు లగుతన
యీడుబాలురతోడఁ గూడి చదువుఁ

గీ. జదువు చుండఁ గొంత చనియెఁ గాలం బంత
నొక్కనాఁడు దండ్రి యుల్ల మలరఁ
గొడుకుచదువు వినఁగఁ గోరి కుమారు నొ
జ్జలను గారవమునఁ బిలువఁ బంచె. 3

వ. ఇట్లు రావించినం జను దెంచి మదిరాపానగోష్ఠీసమయంబున ననేకవిలాసినీపరివృతుండై యున్న జనకునింగని నమస్కరించి యుపాధ్యాయసహితంబుగా నంతంత నాసీనుండై యున్న పుత్త్రునకు నసురేశ్వరుం డి ట్లనియె. 4

ఉ. పాపఁడ యింతకాలమును బాయక యొజ్జలయొద్దనుండి నీ
వేపగిదిన్ బఠించి తద యేర్పడఁ బ్రస్ఫురితార్థసార మై
తీపులు వీనులం గురియు దివ్యసుభాషితరత్న మొక్క టు
ద్దీపితధీవిజృంభణవిధేయత యొప్ప నుపన్యసింపుమా. 5

క. అనుటయుఁ బ్రహ్లాదుం డి
ట్లనియెను నీయానతిచ్చినట్టిద యయ్యా
వినిపించెద నామది మె
చ్చినయర్థం బవధరింపు చిత్తప్రీతిన్. 6

సీ. ఆదియు మధ్యంబు నంతంబు నెవ్వాని
కరయ లే దని చెప్పు నాగమములు

పొడముటయును లేక పొదలుటయును లేక
తలఁగుటయును లేక తనరు నెవ్వఁ
డెవ్వనివలనన యంతయు సంభవ
స్థానసమాహారదశలఁ జెందఁ
గారణంబుల కెల్ల కారణం బై యెవ్వఁ
డపగతకారణుం డై వెలుఁగు
గీ. నమ్మహానుభావు నచ్యుతు నవికారు
నమితతేజు విష్ణు నాదిదేవు
నాశ్రయించినాఁడ నధిప యింతయ కాక
యితర మైన యర్థ మెఱుఁగ నేను. 7
చ. అన విని గుబ్బునం బొడమునల్కకు నెచ్చెలు లై [1]కనుంగవం
గనలెడుదంట[2]కెంపును మొగంబునఁ బొడ్తెడుఘర్మజాలకం
బును నిటలంబునం దనరు భ్రూకుటియుం భయముం దనర్పని
ట్లును నతఁ డొజ్జఁ గన్గొని నిరంతరవిస్ఫురితాధరోష్ఠుఁ డై. 8
ఉ. అక్కట బ్రహ్మబంధువ దురాత్మక నాపగవానికీర్తనం
బెక్కడనుండి యీశిశువు నెప్పగిదిం జదివించి తిజ్జగం
[3]బెక్కటి నేలునామహిమ యేమియుఁ గైకొన కివ్విధంబునం
దక్కువపాటొనర్చితి వృథాపరిజల్పనకల్పనంబునన్. 9
వ. అనిన సురేశ్వరునకు నుపాధ్యాయుం డి ట్లనియె. 10
చ. కినియకు దైత్యనాథ యొకకీడును నాదెస లేదు చెప్ప నీ
తనయుఁడు వక్రశీలుఁడు నితాంతనయోక్తుల నేను సెప్పఁగా
వినక నిజేచ్ఛమైఁ గడఁగి వేమఱు నిట్లన యుగ్గడించు నీ
యనువున నిట్టిఘోరదపుటాలరి శిక్షల కేల చేపడున్. 11

1. జనుంగవన్. 2. కెంపున. 3. బెక్కటియేలు.

వ. అనవుడు నతండు కుమారుం గనుంగొని. 12

క. ఓ వత్స! నీవు చెప్పిన
యీవిధ మేఁ జెప్ప ననియె నిదె యొజ్జలు నీ
[1]కేవాఁడు గఱపె నేర్పడఁ
గా వెఱవక చెప్పు మట్టిఖలు దండింతున్. 13

ఉ. నావుడు దైత్యరాజకులనందనుఁ డిట్లను సర్వభూతస
ద్భావములందునుండిపనుపం గఱపంగఁ బ్రభుం డొకండుమా
దేవుఁడు వాసుదేవుఁడు సుధీసువిధేయుఁడు చిత్సుఖోదయ
శ్రీవరుఁ డింతకంటె మఱి చెప్పఁగలండె ప్రశాస్త్రియెవ్వఁడున్.

ఆ. అనిన మండిపడి సురారి దురాత్మక
యేను జగములెల్ల నేలువాఁడ
విష్ణుఁడనఁగఁ గలఁడు వేఱొకం డనియెద
వేల చెడితి రోరి యెవ్వఁ డతఁడు. 15

చ. అనుటయు నల్ల నవ్వి కొడు కయ్యకు నిట్లను నెవ్వఁడన్న నే
మని తెలుపంగవచ్చుఁ బరమాత్ముని నాతఁడయీసమస్తమున్
వినుము తదేకహేతుకము విశ్వముఁ శాశ్వత మైనతత్పదం
బనిశము పుణ్యశీలురు నిజానుభవంబునఁ గాంతు రేర్పడన్.

వ. అప్పరమేశ్వరుండు శబ్దగోచరుండు గాఁ డనిన నతం "డేను
సకలలోకపరమేశ్వరుండనై యుండ నాయెదురం బరమేశ్వ
రుండు పరమేశ్వరుఁ డని పరుని పలుమాఱు నుదాహరించెద
వోరి చావం దలంచితి వేల" యనవుడు ప్రహ్లాదుండు. 17

తే. నాక కాదు లోకములకు నీకుఁ బ్రభుఁడు
వినుము పరమేశ్వరుం డనువిష్ణుఁ డొకఁడ

1. కెవ్వాఁడు

ధాతయును విధాతయు నతండ[1] యిందు
నలుక విడుము శాంతుఁడ వగుమయ్య తండ్రి. 18

క. నావుడు హిరణ్యకశిపుం
డీవెడగుదనంబు భూత మెయ్యది యో యి
ట్లావేశించెం గా కిటఁ
డీవిధమున నేల యఱచు నిటు ప్రహ్లదముల్. 19

వ. అనినఁ బ్రహ్లాదుం డిట్లనియె. 20

ఉ. నామన మొక్కఁడేల దితినందన సర్వము నావహించి[2] తే
జోమహిమన్ వెలుంగు హరి చోద్యపుభూతమతండు లీల మై
వేమఱు నిన్ను నన్నుఁ బెఱ విశ్వచరాచరభూతజాతమున్
భ్రామకుఁ డై నిజోచితవిభావితచేష్టలఁ గూర్చు నెప్పుడున్.

వ. ఇది తదావేశవిశేషంబు గాని వికారకార్యంబు గా దనిన దనుజేశ్వరుండు పరిసరవర్తులం జూచి వీనిం గొనిపోయి గురుగృహంబునం ద్రోచి రండు. విపక్ష సంస్తవాకారం[3] బయిన చేతోవికారంబు చక్కనగునంతదాఁకనుం దగిన యుపాయంబుల శాసింపవలయు ననిన నయ్యసుర లయ్యసురరాజకుమారుం గొనిపోయి యుపాధ్యాయసదనంబున నునిచి రుపాధ్యాయుండును బ్రభుశాసనంబున నతని శిక్షించుచుండె నాతఁ గొంతకాలంబు సనినఁ గొడుకుం బిలిపించి తండ్రి యొప్పటియట్ల యొక్కసుభాషితంబుఁ జదువు మని పంచిన నతండు. 22

1. యుందు. 2. నావహింపఁడే. 3. సంస్తరాకారం.

క. ప్రకృతిపురుషాత్మకంబును
సకలచరాచరవిశేషసర్గము నెవ్వా
నికిఁ గార్యం బవ్విష్ణుని
వికారవిరహితు సమస్తవిభుఁ బ్రణుతింతున్. 23

క. అనినఁ గడుఁ గడిఁదిగ్నై మది
గనలు నిగుడఁ బుత్రభావకలితస్నేహం
-బును గృపయుఁ బాయ సురరిపుఁ
డనుచరులం జూచి యిట్టు లను రభసమునన్. 24

క. కులమునకు గొప్పగుద్దలి
ఖలుఁడు కులాంగారకంబు కష్టుఁడు వీనిం
బొలియింపుఁడు ఘనశస్త్రం
బుల వెస నొక గుడ్డు [1]మురిగిపోనేమి యగున్. 25

ఆ. కొడుకు తండ్రిమాటఁ గొనక యూరసమున
నడచునేని వాఁడు కడిఁదిదాయ
గాన పగతుఁ జంపఁ గాఁ దగుఁ బగవాని
పక్షమైనవాగు పగతె కారె. 26

వ. కావున నేను చూచుచుండ వీని నిప్పుడ యలుఁగులపాలు సేయుం డని పంచిన శతసహస్రసంఖ్యు లంతకాకారు లగు క్రూరు లక్కుమారుం బొదివి కొదమసింగంబునకు భంగం బుగాఁ గూడినసారమేయంబులచందంబునఁ బ్రచండశస్త్రం బుల నుగ్రకర్మంబులకు సమకట్టు సమయంబున. 27

1. మఁనిక బోయేమి.

సీ. ఏలయొడ్డారించె నీపాపఁ డిటు[1]పాప
మడసెఁ గటా యని యడలువారు
తల్లి యైనను నాకుఁ దనయుతోడిద యని
పూని యాడద యని పొక్కువారు
కావ్యుఁ డైనను వచ్చి కాదు కూడ దనంగ
వలదె యిత్తఱి నని పనరువారు
హరి యైనఁ బొడసూపి కరుణామై బాలకు
కిడుకు మాన్పడ యని యొదలు వారు

గీ. నగుచు సాధుజనము లంతంతఁ జేష్టలు
దక్కి మ్రగ్గి కలఁగి తలఁగి యొదుఁగ
నమరవైరి బంధు లాగి దేవునిబంటుఁ
గదిసి పొడువ నడువఁ గడఁగి రపుడు. 28

తే. అక్కుమారుఁడు మహితసమాధినిష్ఠుఁ
డై మహోగ్రశస్త్రావలియందు నసుర
లందుఁ దనయందు వెలుఁగుసర్వాత్ము విష్ణుఁ
గనుచు నుండె నిశ్చలనిర్వికారలీల. 29

వ. అంత. 30

చ. అనుపమ మేరుభూధర తటాధికనిష్ఠురవక్షు వజ్రసం
హననుఁ గుమారుఁ జెంది యసురాధమకింకరనిర్విశంకపా
[3]తనకనదస్త్రశస్త్రములు దందడిఁ దుత్తుము రై మహీతలం
బునఁ దొరఁగెన్న వోత్పలసముజ్జ్వలనూత్నదళంబులో యనన్.

1. పాపమడిసె. సూ. ని. పా. 2. తటాదిక. 3. తనరకదస్త్ర.

క. అది యట్లు గాదె! 'నిప్పునఁ
జెదలంటునె' దేవదేవు శ్రీరమణీశున్
మది నునిచినయుత్తమమునిఁ
బొదవునె యాపదలు సూర్యుఁ బొందునె తమముల్. 32

వ. ఇట్లు నిరపాయనిత్యోద్దీప్తప్రకాయుండును నతర్కితోపాయుండును సహజసముజ్జ్వలోల్లాసుండును నగువిష్ణుదాసుం జూచి యాచపలుండు [1]క్రోధవిరోధంబుఁ బాపికొన నేరక యి ట్లనియె. 33

ఆ. ఓరి పగఱఁ బొగడు పోరామి యేమిరా
యీతలంపు విడువు మింకనైనఁ
బ్రాణభయమువలనఁ బాపి ప్రోచెద నాదు
బుద్ధి వినవ [2]యువిధిఁ బోవ నేల. 34

వ. అనినఁ బ్రహ్లాదుండు మహాహ్లాదమధురోపన్యాసంబున నవ్యాసవారి కి ట్లనియె. 35

చ. భయములనెల్లఁ బాపుటకుఁ బాల్పడినాఁడుపయోరుహాక్షుఁడ
క్షయుఁ డచలుం డనంతుఁ డనిశంబునునామదిలోనసుండఁగా
భయ మొకఁ డెందునుం గలదె పంకరుహోదరపాదపంకజా
శ్రయులకుఁ దండ్రి పుట్టువుజరామరణాదిభయంబు లేమియున్.

ఆ. అనిన నొడుగఱచి యమరద్విషుండోరి
పడుచ నాకుఁ బుట్టి చెడుగ వైతి
పేర్చి [3]నోరుమూయ పెడతలవాపోయె
దిట్టి వదర గలఁడె యెచ్చట నైన. 37

1. క్రోధనిరోధంబు. 2. యవధి. 3. నోరుమూయుఁ.

క. సర్వంబును విష్ణుం డఁట
సర్వము [1]సృజియించెనఁట జగ మావిష్ణుం
డోర్వఁగ వచ్చునె విష్ణుఁడ
సర్వేశ్వరుఁ డంటి యీయసత్యోక్తులకున్. 38

క. నో రెత్తితేని యింకను
సైరింపఁ జుమీ దురాత్మ! చలమున నిదె నా
కోరంపుటుక్కు గదఁ గొని
బోరునఁ దల వ్రయ్య నడిచి పొరిగొని విడుతున్. 39

వ. అని పలికి తత్క్షణంబ తక్షక ప్రభృతు లగుభీషణభుజంగంబు
లం బిలిచి విషతుల్యభాషణుండును [2]విషమాచారుండును
నగు నక్కులదూషకుని దుర్విషానలజ్వాలాజాలంబులం గ్రేలి
పడఁ బొదువుం డని పనిచిన. 40

సీ. కన్నులఁ జిఱజిఱఁ గ్రమ్ము మంటలతోడ
మండెడు ఘనఫణామణులతోఁడ
బోరల దేహమున నిబ్బరపుమ్రోఁపులతోడ
లోలతఁ గ్రాలు నాలుకలతోఁడ
బొదలెడు నాభీలఫూత్కారములతోడ
[3]నాడవు కెంకల బేర్చు నొడలితోఁడ
మెఱయు నోళ్లను వెలి కుఱుకు దాడలతోడ
భుగులను నుగ్రంపుఁ [4]బొడలతోఁడ

1. సృజియించినట్టి. 2. విషమాచరుండగు. 3. నాడవు నిక్కల దేర్చు నొడలతోడ. 4. బొగల.

గీ. [1]బాపపదుపు లదరి పట్టి బాలకుఁ జొట్టి
నెఱకులెల్ల బిట్టు గఱచి కఱచి
విసము సల్లి సల్లి మిసిమింతుఁడును గాక
యున్నయతనిఁ జూచి యుక్కుడక్క. 41

వ. దైత్యేశ్వరున కిట్లనిరి. 42

చ. కఱచితి మెయ్యెడన్ విసముఁ గ్రక్కితి మీతనియందు
నెట్టివా, కఱచిన కాట్లకున్ శిశువు కాయము తోలును స్రుగ్గ
దయ్యె మా, కఱిమిటి మాఁడిపోయె మణులొప్పఁదలలుం
దుము రయ్యె దంష్ట్రికల్, పటిపటి యయ్యె నోరు లధిపా
[2]యవియంగఁ బోణంగ నంగముల్. 43

క. హరిహరి యంచు నితం డిదె
గిరివోలెం దెరలఁ డితనికిని బరిపీడా
కరు లగునస్త్రలు గలిగిన
వరసి పసుపుదేవ! యరిగా నస్మద్బలమున్. 44

వ. అనుచున్న పన్నగనివహంబులవివశత్వం బుపలక్షించి యక్షు
తుం డైనయమ్మోక్షశీలు నీక్షించి సంక్షుభితహృదయుం
డగుచు నయ్యుదయుండు బృందారక[3]ద్విరదబృందంబులం
బిలిచి వీఁడు మదీయపక్షంబువాఁడై మాకులంబునకు నపకా
రంబుఁ గావింపంగడంగె. నాపుత్త్రుండని విచారింపవలదు.
తరువునం దోఁచికాదె దహనుండు తరుసముదయంబులం
బొడవణంచుం గావున వీని మీరు తీవ్రదంతాభిఘాతంబులం
జించి వెంబడి నాకుం బ్రియంబు సేయుం డని నియోగించిన.

1. బాపపదువ - పదుప. 2. నవియంగ. 3. ద్వార.

సీ. తరఁగలై తొరఁగెడుదానధారలచేత
నురునిర్ఝరస్ఫారగిరులు వోలె
దారుణోత్కటఘాతదంతకాండములచే
ఘనదండధరుచెలికాండ్రు వోలె
నెఱమంట లుమియుచు నెసఁగుచూడ్కులచేతఁ
బ్రళయాగ్నిమూర్త్యంతరములు వోలె
వలఁతులై నిగిడెడివలుఁదతుండములచే
[1]సుదరి చేచాచుమృత్యువులు వోలె

ఆ. కింక లంకురింప జంకెలు నర్తింప
[2]బింకె మెసఁగ నిర్విశంకసరణి
నడరి దిగ్గజంబు లమ్మహాభాగునిఁ
బొదివి పొడువ నడువ నదుమఁ దొడఁగె. 46

వ. ఇవ్విధంబున నవ్వేదండంబు లొండొండ చండక్రీడఁ గోడాడుచుండం బుండరీకాక్షు సాక్షాత్కారంబున సొంపారుడెందంబున నానందనిశ్చలుం డై యచలంబునుం బోలెఁ బోలుచుబాలునిదృఢదేహంబు [3]సోఁకి. 47

క. సురకుంజరములకొమ్ములు
మురిసెఁ దొండములు [4]విరిసె మోములు [5]విరిసెఁ
బొరిఁబొరి నఖిలాంగంబులు
నెరసెఁ జిత్తంబు లురిసె [6]నిరిసె జగంబుల్. 43

అప్పుడు ప్రహ్లాదుండు తండ్రిం జూచి యయ్యా! యిది మదీయహృదయస్థుం డైన యచ్యుతుమాహాత్మ్యంబుగాని

---

1. నొద. 2. బింకెబొసఁగ. 3. సోఁకె. 4. గురిసె. 5. నలిసెఁ [illegible] క. గ పాఠము. చూ. నరియు. 6. నిడిసె.

నాలావు గాదు కాని నాకుఁ గులిశకఠోరంబులగు దిగ్వారణ
దంతప్రహారంబులు సైరించు శరీరంబు లేక్కడిది యని
యూరకుండె నంత. 49

ఉ. ఆవిధ మంతయుం గని సురాహితుఁ డంతటనైనఁ దెల్విఁ గిం
1దావలమీనిరోషమునఁ దద్దయు మేను వడంక నింక నోం
డేవియుఁ గావు తీవ్రబహుశైంధనదీప్తకృశానుకీలలన్
ద్రోచ్చుఁడు వీని నంచుఁ గడుదుష్టమనస్కులఁ బంచెఁబల్వురన్.

వ. పనుచుటయు వారవారితరభసంబున భూరితరదారుసంచ
యం బొనరించి యనలంబు దరికొల్పుటయు ననిలుం డసుర
పతిపనుపున నయ్యగ్నిఁ బ్రజ్వరిల్లం జేసె నప్పాపనిం
బాపాత్ములాందీపితదహనంబునం ద్రోచినం బడి ప్రహ్లా
దుండు మేదురజ్వలనజ్వాలాకలాపదందహ్యమానుం డగుచు
నుండియు నఖండజలధరధారాసిచ్యమానాంగుండు గావున
వేఁడిమిం గందక మందస్మితాననుండై దానవేశ్వరున
కి ట్లనియె. 51

ఉ. శౌరిపదాంబుజస్మృతిరసంబునఁ దేలెడునామనంబు తం
డ్రీ రుచియింప దన్యముఁ గడిందిగ నీ వొనరించినట్టియు
ద్దారుణవహ్నియున్ వినుము తామరసాకరమయ్యె నాకుఁ బ్ర
2స్ఫారితవీచులీశిఖలు చల్లనితుప్పర విస్ఫులింగముల్. 52

వ. అనియెడు నప్పు డద్భుతరోషమాత్సర్యవిహ్వలుం డగుచున్న
యాహిరణ్యకశిపుం గదిసి భార్గవనందనులు కొందఱు
తదీయపురోహితులు గావున హితంబుఁ జెప్పవలయువారై
సామవచనంబుల నతని కి ట్లనిరి 53

1. దావలమాన. 2. స్ఫారితవీచు.

చ. [1]మునుమునఁబుట్టి నీ కకట ముద్దులపట్టి గదయ్య వీఁడు మె
త్తనియొడలింత యోర్చునె కృతంబుల సైఁచునె మాను
మింతతోఁ, గినుకలు నీవు గట్టలుక కీ డొనరింపఁగఁ బొందఁ
జాలువా, రనిమిషసిద్ధయక్షఖచరాదులు గాక తనూజుఁ డే
నృపా! 54

క. బాలత్వ మెల్ల కీళ్లకు
నాలయ మట్లగుట వినియు నజ్ఞానము ద
పైప లొచ్చువడఁగఁ గోపం
బేలా నీ యంతవారి కిప్పడుచుపయిన్. 55

తే. అవధరింపుము మాపంత మధిప యేము
వదల కీబాలు శిక్షించువార మింక
నొయ్య నొయ్యనఁ దెలివికి నోజపఱిచి
వెట్టి దేర్తుము మాటలు వేయు నేల. 56

క. ఈతనికి విష్ణుదెసఁగల
ప్రీతి విడువఁ దెలుపు టెంత పెద్ద, యధికరో
షాతురుఁ డై యితఁ డతని వి
ఘాతింపను గడఁగు బుద్ధిఁ గఱపెద మోలిన్. 57

ఉ. మావచనంబుల న్వినక మాధవుపైఁ గలపక్షపాతముణ్
[2]బోవఁగఁ ద్రోవ కి ట్లయయిపోయిన నీ వటుచూచి
మెచ్చుఁ గ్రో,థావలి యైనకృత్యఁ గడు నద్భుతభంగి సృజించి
పంతు మీ, కావలమంతతో [3]నడఁగు గష్టపుఁ బొల్లుచు
దైత్యపుంగవా. 58

1. మునుమునబుట్ట. 2. ద్రోవగ. 3. డగను.

వ. అనిన నట్ల చేయుం డను దైత్యపతిపనుపున నతనిబంట్లు
మంటలోనున్న పి న్నాతని వెడలం దిగిచి భార్గవాత్మజుల
కొప్పించిన వారునుం గొనిపోయి తమయింటం బెట్టుకొని
బాలుకం గొందఱ సంగడంబు గూర్చి చదివించుచు బుద్ధులు
సెప్పుచుం దెలుపుచు బుజ్జగించుచుం దట్టించుచు ననేక
ప్రకారంబుల శిక్షించుచుండ నతఁడో భవ్యస్వభావుం డగు
నప్పుణ్యభావుం డొక్కొక్కతఱి నెడగొని తనతోడఁ
జదువు దానవదైత్యకుమారుల కిట్లని యుపదేశించు. 59

క. వినరయ్య యేను జెప్పెద
ననుపమతత్త్వార్థ మైన యాత్మహితంబుఁ
మనమున మాకొఁకొక్కయి
ట్లనిచెప్పెడు నిప్పు ఢితఁ డని చూడకుఁడీ. 60

ఆ. పుట్టు పెరుఁగుఁ బ్రాయములఁ జాలఁ జెన్నొందు
ముదిమిచేతఁ జిక్కుఁ బిదపఁ జచ్చుఁ
బురుషుఁ డట్టిదెసలఁ బొందు టదృష్టంబ
యిందు లేదు గాదె సందియంబు. 61

క. చచ్చినజీవుఁడు గ్రమ్మఱ
వచ్చుఁ బుట్టువున కను ట పాయము గా దీ
యచ్చు మునులు శ్రుతిజలములఁ
ద్రచ్చి కనిన తెలివి గాన తప్పని దదియున్. 62

ఆ. కారణంబు లేక గలుగదు జన్మంబు
కారణం[1]బు పూర్వకర్మఫలము

1. బహుపూర్వ.

కాన యుక్తియుక్తమైనది యిదియుఁ బ్ర
త్యక్ష మెట్ల యనఘులార. 63

క. తలపోయఁ దల్లికడుపున
నొలసిన నరుఁ గొంతకాల మునికియు లోకం
బుల కెల్ల దృష్టమత్తఱిఁ
గలుగు నిరోధంబు [1]శాంతగతిఁ గొనఁ బొసఁగున్. 64

వ. అది యెట్టిదనిన.

తే. ఆఁకలియు నీరువట్టు నగ్యోఖ్య వెరవుల
నడఁచు దాఁక సౌఖ్యముఁ జూతు రల్పబుద్ధు
లెప్పుడు నాఱనిచిచ్చుతో నిడుమఁబడుట
గరము దుఃఖంబు గాక సుఖంబె చెప్పుఁడ. 66

క. పెల్లగునాఁకట నన్నము
సల్లనినీ ర[2]వెన్న సౌఖ్యదములు నాఁ
జెల్లు నవి కాక యుండిన
నెల్లపగిది నివియ దుఃఖహేతువులు దగన్. 67

క. మదురువుగొని యెడ లెఱుఁగక
మదాకులమనస్కుఁ డయిన మానవునకు నిం
పొదవియుఁ బిడికిళ్లం గొని
చదియఁ బొడుచునేని యదియు సౌఖ్యం బగునే. 68

క. కావునఁ గేవలసుఖదం
బేవస్తువు లేదు వినరె యిదె సంసృతి నై

1. శాంతగతిఁగొన. 'శాంత శమనుఁగొనఁ బసఁగుఁ'. శ.ర. పసఁగు=విశద మగు - (శ. ర). 2. వెన్న.

యేవిధి సుఖదము దుఃఖ
మై వెస దుఃఖమును సుఖద మై తిరుగఁబడున్. 69

చ. మృగమదచందనాద్యనుపమేయసుఖోచితసారవస్తువుల్
దగఁ గఫవాతపైత్యకలితం బగుకీడులప్రోక్ష యైన యా
యగుణశరీరముం గదిసినంతన దుష్టతఁ బొందు మేలుఁ గీ
డుగ నొనరించు నీముఃఖకీడొక్క మనంబున నమ్మఁ బాడియే.

క. ఎంత ప్రియవస్తువులపై
నంతఃకరణంబు గలుగు నది మీఁదట న
త్యంతం బగు సంతాపం
బంతయుఁ గూర్పఁగ నిమిత్త మగుఁ బురుషునకున్. 71

ఆ. ఆలు బిడ్డ లిండ్లు నర్థంబుఁ జెలులును
బ్రోపు గూడఁ బెట్టి పొదలు కుమతి
యవియు పిదపఁ జెడఁగ నన్నింటిఁ దగిలిన
మనసు నుడుపలేక మడిసిపోవు. 72

ఉ. [1]ఏపుగ నెమ్మియుం బొదలు నీభవవారిధి నిస్తరింపఁగాఁ
దేపగయంగ వేఱొకటి దెల్లము చెప్పఁగ [2]లేదు చెప్పెదర
నాపలు కాత్మ నిక్కముగ నమ్ముఁడు విష్ణు ననంతు నాద్యు ల
క్ష్మీపతిఁ గొల్వఁ దవ్విభుఁడు చేకొని కాచు నిజైకచిత్తులన్.

క. చెడిపోకుఁడు సంసారముఁ
గడతేర్పఁడు శౌరిచరణకమలము [3]లెడ్డం
బిడికొనుఁ డూరక కాలము
కడపకుఁడి వివేకవీథిఁ గడఁగుఁడు నడవన్. 74

1. ఏపున. 2. లేదు. 3. నెడఁదర, ఇడికొని.

సీ. బాలుఁడ నేనిప్పు బాలోచిత క్రీడ
లనుభవించెద మఱి యౌవనమున
నెఱవాది నై ధర్మ మెఱిఁగి చేసెదఁ గాక
యని పోవు నటపోయి యౌవనమున
సుఖములచవిఁ జొక్కుఁ జొక్కి యున్న దిగదా
ముదిమి ధర్మము నెల్ల నొదువఁ జేయ
నని చనుఁ జని వృద్ధుఁ డై యౌవనమునంద
జెన్నొంద ధర్మంబు చేయనైతి

గీ. నేమి సేయుదుఁ గాలు చే యించుకయును
వసము గాదు చిత్తంబు తామసము గప్పె
ననుచు నట తాను బొలియు నట్లాత్మహితము
సేయ నబ్బ దెప్పుడు మూఢ చేతసునకు. 75

ఉ. కావున శైశవంబునన కష్టతరం బగు మోహ మింతయుఁ
బోవఁగఁ ద్రోచి విష్ణుమయపుణ్య[1]సమాహితతత్త్వచింతతోఁ
దేవలయుఁ మనంబు సుగతిప్రద మివ్విధ మిట్లు సేయుఁడా
భావన నన్య ముల్లమునఁ బట్టఁగ నీకుఁడు భక్తియుక్తులై.

చ. అలజడి లేదు చిత్తమున కంగములందుఁ బ్రయత్నమేమి
యుఁ, వలవదు నిర్మలత్వము నవారితబోధము లోనుగా
శుభంబులు సమకూ[2]ర్పఁ జేయు నతిపుణ్యపదంబు ముకుంద
సంస్మృతిఁ, గలదె యొకింతయేనియును గానితెఱం గటు
సూడుఁడా మదిన్. 77

వ. మఱియు నొక్కటి చెప్పెద. 78

---

1. సమానత. 2. అజేయలఁతి.

చ. జలరుహలోచనుం డరయ సర్వశరీరములందు నాత్మయై
యొలసినవాఁడు గావునఁ దదూర్జితభక్తి రమించువారి క
గ్గలముగ సర్వభూతదయ గాదిలిఁ గావలయుం జుఁడీ విని
శ్చలసమబుద్ధి యి ట్లొదవ సర్వవిపద్ధళనంబు దా నగున్. 79

తే. అరయ [1]దాపత్రయాహితం బఖిలజగము
[2]నిట్లుపుట్టిన గోఅలిన యొడయుచున్న
జీవులకు నొక్కకీడును సేయఁదగునె
చనదె దుఃఖశీలురదెసఃగనికరంబు. 80

చ. తన కరయంగ వేఱొకటి తక్కువజంతువు గల్గె నేనిఁ ద
త్తనువున కెగ్గు సేయమి గదా తగు నన్యశరీర మెక్కుడై
యనయము దానహీనుఁ డగు[3]నట్టిదె యైనను మేలె వైర మే
యనువున భూతమైత్రియ యపాయము లేనియుపాయ
మాత్మకున్. 81

క. వైరంబున భూతంబులఁ
గారించు దురాత్ము మాఱు గావించుఁ గడుం
వైరంబున భూతంబులు
ధీరుల కిది దెలియుఁ గుమతి తెలియం డెపుడున్. 82

తే. మనమునను దుస్స్వభావసంజనిత యైన
[4]భేదబుద్ధి నొఅంగి య[5]భిన్నుఁ డైన
విష్ణు నఖిలభావములందు వెదకి కాంచి
యనఘులార పొందుద మనయము సుఖంబు. 83

---

1. దాపత్రయా. 2. నిట్లుపుట్టిన గొదవల నెరియఁచున్న-ఇది ముద్రిత పాఠము. 'నిట్లుపుట్టిన గొఅలెడు నెరయుచున్న' అనునది వ్రా. ప్ర. పాఠము. దీనినిబట్టి పైరీతిగా సవరింపఁబడినది. 3. నట్టెద. 4. భేదబుద్ధి. 5. యభిన్ను.

సీ. అనిలునిచేఁ గాల దర్కునిచేఁ గ్రాఁగ
దమృతాంశుచేత శైత్యమునఁ బడదు
పవనుచే నివురదు పర్జన్యవరుణుల
చే వృద్ధి పొందదు సిద్ధయక్ష
గరుడోరగామరగంధర్వకిన్నర
నరమృగాదులచేత నాశవృద్ధు
లొందదు గుల్మమహోదరాదికరోగ
తతిచేత సుడియదు దంభలోభ

గీ. మత్సరాదుల నలయదు మహిమసహిత
మేపదంబు మహాయోగిహృదయగమ్య
మట్టి యానందతత్త్వంబు ననుభవించు
హరిసమర్పితమానసుం డగుబుధుండు. 84

వ. అని యనేకప్రకారంబుల వివరింపుచుండ విని తమమనంబు
లం దలంచి దైత్యబాలురు దైత్యపాలికిం జని యవ్విధం
బంతయుఁ జెప్పిన నలిగి యతండు. 85

ఆ. తాను చెడుట గాక తక్కినవారిని
జెఱుపఁ జూచె నౌర గొఱకు [1]పడుచు
వీని నెట్లయిన విసుపక [2]పొలియింప
వలయు నేమి వెరవు గలదొ యింక. 86

వ. అని తలంచి వంటలవారిం బిలిచి దుర్మార్గదర్శనుండును దురా
త్ముండును నగు ప్రహ్లాదుండు మత్పుత్త్రుం డని యనుమానిం
పక మీరు రహస్యయత్నంబున వీనికి భక్ష్యభోజ్యాదుల

1. బడుచు. - పాలింప.

యందు హాలాహలాభిధానం బగుమహావిషంబుఁ బ్రయో
గింపుఁ డని పనిచినం జని వారును బ్రభుశాసనంబుఁ జేసిన.

చ. అమృతు ననంతు నచ్యుతుని నాత్మఁ దిరంబుగ నున్చి నిత్యబో
ధమునఁ గరంగఁ నప్పరమధార్మికుఁ డింపుగ నారగించున
య్యమితహాలాహలాద్భుతవిషానలసంచయభక్షణంబునఁ
దమృతముకంటెఁ బ్రీతికర మయ్యెఁదదంతరబాహ్యచేష్టలన్.

క. విషమచరితుండు బాలుఁడు
[1]విషానుహరణమునఁ జాల వెలుఁ గొందె మహా
విషనిధిజనితవిశృంఖల
విషానలము మ్రింగి పొంగువిషమాక్షు క్రియన్. 89

వ. ఇట్లు విషాన్నంబుఁ బ్రయోగించి నిర్వికారుం డై యున్న
యక్కుమారునిం జూచి సూపకారులు లోకాపకారి యగు
దివిజవైరిపాలికిం బోయి తమచేసినపనియు వమ్మగుటయుం
జెప్పినయప్పు డమ్మోటకుండు పురోహితులం బిలిపించి
మీరు మునుపు ప్రతిజ్ఞ చేసిన వారు కారె? ఈ ప్రహ్లాదుం
డనుదురాత్ముం బొరిగొనుకృత్తి నుత్పాదించు నది యనిన
నియ్యకొని పోయి వారు ప్రహ్లాదునకుం దొలుత సామ
పూర్వకంబుగా ని ట్లనిరి. 90

ఉ. అన్న! త్రిలోకపూజ్యుఁ డగునంబుజగర్భుని యన్వయంబు
నం, దున్నతిఁ బుట్టి తా శౌలఁదియో యిట యెక్కుడు
చూడు తండ్రి పెం,పెన్ని తెఱంగులం జలము [2]లేటికిఁ బెద్దల
పంపుఁ జేయుమా, నిన్ను నుతించు లోకములు నీకు నపా
యము లేక యుండినన్. 91

1. విషాహారణమునను. 2. నేటికి.

క. హరి గోవిందుఁ డనంతుఁడు
పురుషోత్తముఁ డనుచు నేల పొగడెదు చెప్పుమా
యరుల నుతించిన స్వైరతు రె
నరపతు లిది మానవే జనస్తుత! యింకన్. 92

తే. ఇట్టితండ్రి కడుపునను బుట్టి నీకు
నొరులఁ జేర నేల యితని యుల్లమునకు
వచ్చుతెఱఁగున మెలఁగెదువాఁడ వైన
నితనిరాజ్యంబు నీదకా కెవ్వరి దగు. 93

క. గురుఁ డనఁగఁ దండ్రి కంటెను
నరసి యొకనిఁ జదివి చెప్పుమా శ్రుతిధర్మం
బురలక్ ద్రోవఁగ [1]నగు నే
గురుశాసన [2]ముజ్జగించు కుటిలపుఁదెలివిన్. 94

క. దేవుండు వాసుదేవుఁడు
దేవోత్తముఁ డంచు నేల దేఁకువ సెడితో
దేవుఁడు గీవుఁడు దక్కన
దేవతలును నెంతవారు దితిసూనునకున్. 95

వ. ఇంతకు మిక్కిలి చెప్ప నేర మిటమీఁద నీవ యెఱుంగుదు వనినఁ బ్రహ్లాదుం డమ్మహీసురుల కిట్లనియె. 96

సీ. మీరు చెప్పినయట్ల మేదినీసురకులం
బునఁ [3]బుట్టు తండ్రి పంపన ఘనంబు
జనకుఁ డెక్కుడు గురుజనముల కెల్లను
నతనిశాసనము సేయంగవలయు

1. నగు విన. 2. ముజ్జగించి. 3. బుట్టెఁ దండ్రి కంపున.

నీతగ వింతయు నెఱుఁగనివాఁడఁ గా
నదియు నట్లుండె మీ రరయ మాకు
నాచార్యులరు మిమ్ము నతకరించుట దోస
మైనను నొకమాట యాడవలసె

గీ. వాసుదేవసంస్తుతి సేయ వలన దనిన
కుత్సితోక్తి మీకిట్లు వాక్రువ్వఁ దగునె
చదువరే యెఱుఁగరె మీరు చదివి యెఱిఁగి
వినిన యాఢ్యుల నడవడి వినరె తలఁగి. 97

వ. ఇట్టిమాటలు మీకే యొప్పు నని చిఱునవ్వు నవ్వి యబ్బా
లుం డావృద్ధులం గనుఁగొని వెండియు. 98

క. [1]కినగినబడ (?) యించుక మీ
తనయుని విన్నపము వినఁగఁ దగ వని బాల్యం
బునఁ గదిరినచాపలమున
మనమునఁ దోఁచినటు లాడుమాటలు సుండీ. 99

సీ. మనకంటెఁ బెద్దలు [2]ఘనబోధయుతులు ద
క్షాదులును వసిష్ఠాదు లవల
నత్రిపులస్త్యాదు లట మఱి వ్యాసులు
వెఱ్ఱులై కొలిచిరె విష్ణుదేవుఁ
గొందఱు ధర్మంబుఁ గోరి భజింపఁగఁ
గొంద ఱర్థము మదిఁ గోరి కొలువఁ
గొందఱు కామంబుఁ గోరి సేవింపఁగఁ
గొందఱు మోక్షంబుఁ గోరి [3]తెలియ

1. కినగినండి 2. ఘనబోధనీయులు దక్షాదులును వసిష్ఠాదు లవల. 3. తెలుప.

గీ. నిండఱకును సేవ్యుఁ డేవేలు పొక్కప
ద్మాక్షుఁ డజుఁ డనంతుఁ డప్రమేయుఁ
డచ్యుతుఁడు పురాణుఁ డనునొక్కరుఁడు గాక
వెండి దైవమనఁగ నొండుగలఁడె. 100

క. జ్ఞానము [1]కలిమున్న తిసం
తానం బైశ్వర్యమధికధనముమఱియు నే
మేనియుఁ గలసినఁ బెఱవెర
వైనఁగల దేహారిపదాంబుజార్చనఁ దక్కన్. 101

ఉ. మాటలు వేయు నేమిటికి మాధవుఁ డొక్కఁడ దైవమేను ము
మ్మాటికిఁ జాటితిఁ గుటిలమత్సరభావము లుజ్జగించి య
మ్మేటి భజింపుఁడీ తెరువు మేలుగఁ గైకొనుఁ డాత్మలోన మో
మోటయొకింత లేదు హరి నొల్లమి యొప్పదు చెప్పితిం జుఁడీ.

తే. హరియొకండ జగత్కర్త యఖిలభర్త
విశ్వసంహర్త భోక్త వివేకయోక్త
తలఁపుబలుపును గొలుపును దెలుపునతని
దెసన కావింపనగు నొండుదిక్కు వోక. 103

వ. అని చెప్పి ప్రహ్లాదుండు. 104

క. ఇది యగునో కాదో చెప్పుఁడా
తుదిఁ బడుచులమాట లంత [2]దూల్వంగలదే
మది నైఁపవలయు మిక్కిలి
చదివినయొఱుకలకు సరియె చదువనియొఱుకల్. 105

వ. అనినఁ గోపించి భార్గవాత్మజు లతని కిట్లనిరి. .06

1. సిరులు. 2. దూష్యం.

ఉ. పట్టికరంబుఁ గిన్కఁ బటుపావకకీలలఁ ద్రోఁచి యెంతయుం
గట్టిఁడి తండ్రి నిన్ను నిటుగాల్పఁగ నడ్డము సొచ్చి వానితోఁ
బెట్టిద [1]మాడి నిన్వెడలఁ బెట్టినచుట్టలతోడి [2]సాకతం
బిట్టిదయయ్యె నోర ఖలుఁడేమియెఱుంగుమహోపకారముల్.

క. ఇంక నిటమీఁద మాతో
వంకలపదురులునువాఁడువాఁడవ యగుమీ
జంకెలపనిలే దిదె నిను
గొంకర వో[3]నడచుకృత్యఁ గొల్పెదము వెసన్. 108

క. రక్షించువారిపలుకు [4]ల
పేక్షించనివానిపక్ష మేటికి నిన్నున్
భక్షించుకృత్య నీప
రమాత్ముఁడు రక్షించుఁగాక యప్పుడకణఁకన్. 109

వ. అనిన నమ్మహానుభావుండు. 110

తే. ఒకఁడువధియించువాఁడగు [5]నొకఁడువధ్యుఁ
డొకఁడురక్షించువాఁడగునొకఁడురక్ష్యుఁ
డనఁగనిదియంతయును భ్రాంతి యాత్మరూపు
లిన్ని తెఱఁగులవాఁడు సర్వేశ్వరుండు. 111

వ. అని యిట్లుపలికిన విని యధికరోషదందహ్యమానమానసు
లగు నసురపతిపురోహితులును [6]దక్షిణంబ యగ్ని
ముఖంబుఁ జేసి ప్రేల్చి కృత్య నుత్పాదించి ప్రహ్లాదుపయిం
బనిచిన.

---

1. మాడ. 2. సాగతం. 3. నడుచు. 4. లపేక్షించినవాని. 5. నొకఁడవధ్యు. 6. సులక్షణంబ యజ్ఞ.

ఉ. ఆఁకయొకింతలేక వివృతాస్యరటత్ స్ఫుట వహ్ని కీలముల్
దాఁకదిగంతముల్ గమియ దౌడలుదీటుచు వాఁడికిన్కఁ జే
రాఁకలినీజగత్త్రయము నాహుతిచేయఁ దలంచెనో యనన్
వీఁకఁగడంగి కృత్య యొకవ్రేఁకనిశూలముఁ గేలఁ దాల్చుచున్.

చ. కడఁగికుమారు పేరురము [1]గబ్బును నుబ్బును దొంగలింపఁగాఁ
బొడిచె నభేద్యమాద్య మనఁబూహాము మోహాము విష్ణుతత్త్వ
ముం, డెడు దేపనమ్మహాపురుషు డెంగము [2]వ్రాల్చుట నందొకింత
యున్, దొడరదునొప్పిగంటియును దోఁపదుతోలును స్రగ్గ
దేమియున్. 114

చ. ఘనకులిశోల్లసత్కఠినగాఢశరీరుఁ గుమారుఁ జెందియా
బినుఁగుపిశాచికై దువాక బెండునుబోలె నిమేషమాత్రలోఁ
దునిసితొలంగి నేలఁబడి తుత్తుమురై పెను [3]బుగ్గి బ్రుంగె బ్రుం
గినఁగనిభీతిమైమఱలెఁ గృత్యయకృత్య*నికృంతగర్వయై. 115

క. నిక్కముహరిదాసులకును
మొక్కలమునఁగీడుచేయ మొనసినయేనిం
స్రుక్కదె వాపవు[4]పట్టిన
చొక్కపుఁ [5]బలుకైదువైన శూలంబైనన్. 116

వ. అని యివ్విధంబున మరలి యాకృత్యదైత్యపతి పురోహితులన పొదవి ఘోరానలజ్వాలారూపంబునం దాపం బొనరించి ప్రాణంబులు వెలుకదొడంగిన నమ్మహీసురు లాక్రోశింప ననుకంపానుకింపమానమానసుం డగుచు నమ్మహానుభావుం డసమానధ్యానముకుళిత లోచనుండై. 117

---

1. గబ్బున. 2. గావున. 3. భృంగి. * నికృత్త? 4. బట్టిన. 5. బలుకైన పెద్ద.

తే. కృష్ణకృష్ణ యనంత యే కీడు లేదు
వీరి దెస వెట్టులై వీరు తారు తమకుఁ
దీర్పరానియాపెనుచిచ్చుఁ దెచ్చుకొనిరి
కరుణ నీ విప్రవర్యులఁ గావవలయు. 118

వ. అని యార్తస్థితుఁ డైనపరమేశ్వరుఁ బ్రార్థించి. 119

చ. సకలజగన్నియామకుఁడు సర్వచరాచరకర్తవిశ్వ
గర్భుఁ డఖిలేశ్వరుండు నవతామరసాక్షుఁ డనంతుఁ డాద్యుఁ డీ
ప్రకటితభూతజాతమునఁ బ్రబ్బి యొకండ వెలుంగుచున్కి యే
నొకటన మోసపోక కనియుండుదు నొండెఱుఁగం దలంపునన్.

సీ. క్రొవ్వాఁడియలుఁగులఁ గొని తూఱఁబొడుచుచో
ఘనవిషదంష్ట్రలఁ గఱచుచోటఁ
దోరంపుఁగొమ్ములఁ గోరి చెండాడుచోఁ
గడిఁది చిచ్చునఁ ద్రోచి కాల్చుచోట
నక్కజంబైనవిషాన్నంబు వెట్టుచోఁ
బటుకృత్యజము దూఱఁ బనుచుచోట
నట్టిక్రూరమునకు నట్టిఘోరమునకు
నట్టియుక్కివమున కట్టి తెగువ

గీ. కట్టి బెట్టిదమున కట్టి[1] శంకలమది (?)
నేనసూయ సేయ నింత నింక
నీనిజంబువలన నీవిప్రులిది[2] చేక
వహ్నిఁబడక బ్రతుకువారు గాత. 121

వ. అని పలికి నిరంతరనిజకారుణ్యసుధాసారసేకంబున నమ్మహా
ద్విజుల[3] నుజ్జీవితులఁ జేసినవారును నిరామయదేహులును

1. శంకరు. 2. చొర. 3. నుజ్జ్వలితుల.

విగతసమ్మోహులును నై యమ్మహానుభావుఁ జేరం జనుదెంచి వేనవేలు దీవన లిచ్చి చని హిరణ్యకశిపునకుఁ దద్వృత్తాంతం బంతయు నెఱింగించిన వెఱగుపడి కొడుకు రావించి యతం డతని కిట్లనియె. 122

క. మంత్రబలమొ మాయయొ యీ
తంత్రము సహజంబొ నీకుఁ దనయా! వినవీ
జంత్రమునకు విస్మయపర
తంత్రంబైనది మనంబు తథ్యము చెపుమా. 123

క. అని యడిగినఁ బ్రహ్లాదుఁడు
జనకునిచరణద్వయంబు సంప్రీతిమెయిన్
దనశిరము సోఁక [1]నెఱఁగి స
వినయంబుగ నిట్టు లనియె విహితాంజలియై. 124

తే. అయ్య! యిదిమంత్రబలముగా దరయ మాయ
గాదు నాదగునైజంబు గాదు వినవె
యెవ్వరికి నైనఁ జొప్పడు నిట్టిపేర్మి
యుల్లమున విష్ణుఁ దిరముగా నునిచి రేని. 125

వ. విష్ణుపరాయణత్వం బెట్టిదనిన. 126

క. ఒరులకుఁ గీడు తలంపమి
హరిభక్తికి రూప మొరుల నాత్మసమముగాఁ
బరికించువారి నాపద
బొరయునె కారణము లేక పొందునె భయముల్. 127

1. సెఱఁగిన.

తే. మనసుఁ బలుకును జేఁతయు ననఁగ నిట్టి
మూఁడు దెఱఁగులపాపంబు ముదిరెనేని
నదియ సంసారవారిధి నదిమియుండు
మనుజుఁడెన్నఁడుఁ దలయెత్తికొనఁగ లేఁడు. 128

ఉ. ఇంతయుఁ జూచి నిక్కముగ నేను నచింత్యు ననంతు నచ్యు
తుం, జింతన సేయుదుఁ సకలజీవులయందును గాంతు నవ్వి
భుఁ, భ్రాంతి యొకింత లేదు మదిఁ బండినభక్తియు నొందు
దిక్కువో, దెంతటివేర్మి గ్రైన నగు నిట్టితెఱంగున దైత్య
పుంగవా! 129

తే. అనినఁ బులిఁగోల వ్రేసినయట్లు రేఁగి
కాఁగి హాస్మని యసురయంగంబు వడఁక
బేర్చుకినుకఁ గింకరకోటిఁ బిల్చిపిల్చి
నెలుఁగు నింగిఁ బొంగారంగ నిట్టు లనియె. 130

చ. ఇది శతయోజనోన్నతము హేమగిరిప్రతిమంబు హర్మ్య
మిూ, తుద నిలువెక్కి వీని దిగఁ ద్రోపుఁడు క్రిందట నున్న
చట్టుపైఁ, జదియఁగఁ గాలి మేనఁ గలచర్మము నెమ్ములు
కండలుఁ వెసఁ, జిదురుపలై చనం బొలియుఁ జింతయు
వంతయు మాను నంతలోన్. 131

వ. అనినం గ్రందుకొన నమ్ముకుంచదాసుం బ్రాసాదశిఖరంబునకుం
గొనిపోయి పట్టి దిగఁద్రోచిరి. 132

చ. కుడువఁగ నొల్ల కెంతయును గ్రొవ్వునఁ గూలఁగఁ [1] ద్రోయు
దుఁ దిగం, బడియెడుదానవప్రభునిపాలిటిభాగ్యమువోలె

1. ద్రోచుదుఁ.

మేడమీఁ, దెడలెడుబాలు విష్ణుమయ[1]హృత్కు ధరించె
ధరిత్రిదూదిప్రో[2]విడి మునుమున్న యాతనికి నింపుగఁ జేసిన
సెజ్జయో యనన్. 133

మ. కని దైత్యేంద్రుఁడు గాఢమోహబలవద్గ్రాహంబు పెన్వాతఁ
జిక్కినచేతోగతిఁ ద్రిప్పలేక మఱియుఁ గిన్కెక్కఁగా శం
బరుం,డను [3]పేరంగలదానవుం బిలిచి మాయల్ పెక్కు
[4]గావించి చిక్కొనరింపంగలవిద్య నీపాలుపు నేఁ డుల్లాస
ముం జూపుమా. 134

చ. [5]కఱదలు పెద్ద వీనికిటు కాఱియఁ బెల్లెడుమాన కేమిటన్, [6]నెఱి
కలు మీటుచుండుఁ దననీచపుమాటలు వీనిఁ బట్టి క్రచ్చఱఁ
బరిమార్పఁ జేసినయుపాయము లన్నియు గొడ్డువోయె నీ,
వుఱక వధింపఁగావలయు సుగ్రపుమాయల నిద్దురాత్మునిన్.

వ. అనినఁ బొంగి యఖర్వగర్వాడంబరుం డగుచు శంబరుం
డతని కిట్లనియె. 136

తే. కలవు నూఱులు వేలు లక్షలును గోటు
లప్రమేయలు ఘనమాయ లధిప నాకు
వానిఁ దగులక పోరాదు వనజభవున
కైన నభవునకైనను నన్యు లెంత. 137

వ. అని దుర్బుద్ధియగు నయ్యసంబంధుండు [7]బద్ధమత్సరుండై
కడంగిన. 138

---

1. హృత్కు. 2. విడె. 3. పేరుంగల. 4. గావించుఁజి. 5. కఱతలు. 6. కొఱుకలు, కొఱఁకులు. (సూ. ని) 7. బాధ.

క. కులశైలంబులు వడఁకెను
గలఁగెఁ బయోధులు పయోజగర్భుఁడు సురలున్
దలఁకిరి మునులమనంబులు
గళవళ మయ్యెన్ దదీయగర్వోద్ధతికిన్. 139

వ. అంత. 140

ఉ. మాయలు డాయనీక యసమానత నత్యుపమానమై ముని,
ధ్యేయతభక్తితత్పరవిధేయమనం దగువిష్ణుతత్త్వమున్, బా
యనిచూడ్కి సర్వసమభావనఁ గ్రాలెడుబాలు బాలిశుం, జేయ
నతండు సూపెఁ దన చెన్నఁటిమాయలదొంతు లన్నియున్.

తే. వీఁడుమాయలఁ దను నేఁచువాఁడు దాయ
వీఁడునాకు నెగ్గొనరించువాఁడుకుమతి
[1]యనక శంబరునందును నమ్మహాత్ముఁ
డప్పుడనసూయుఁడై యుండె నల్ల నగుచు. 142

వ. అట్టిసమయంబున భక్తపరాధీనుండును బరాపరేశ్వరుండును
నగుపరమపురుషుం డప్పుణ్యపురుషునకుఁ బరిరక్షణార్థంబుగా
సకలదురితాపకర్షనం బగు సుదర్శనంబు నాజ్ఞాపించిన. 143

ఉ. ఘోరయుగాంతకాలకృతకోపఖరాంశుకకోరదారుణా
కారముతోడఁ జక్రమతిఖండితచండ సమిద్ధమండల
స్ఫారత నేగుదేర సురశత్రుఁ డొనర్చినమాయ[2]రొయ్యనీ
హారముపోలె మాయమయి యచ్చటనచ్చటఁగ్రాఁగె వ్రేల్మిడిన్.

వ. తదనంతరంబ యమ్మహాస్త్రం బంతర్హితం బయ్యె నట్లు శంబర
నిర్మితమాయాసహస్రంబులు సమసిన తమిస్రంబులం బాసిన

1. యనఁగ. 2. వోయ.

సహస్రకరుండునుంబోలె వెలుంగుబాలునాలోకించి వెండి
యు దానవేంద్రుండు. 145

క. తన్నుఁ బొలియింపఁ బుట్టిన
చెన్నఁటిచలమపుడు [1]వెట్టిఁ జేయ నలుకతో
నన్నిచుఁ డచటఁ జేరువ
నున్నపవనుఁ జూచిపలికె నుగ్రాకృతియై. 146

ఉ. ఓయి సమీర! యీఖలు దురుక్తిధురంధరు శత్రుపక్షసం
ధాయకు మాయలాని సముదగ్రజవంబునఁ దాఁకి వీనిదు
ష్కాయముఁ జొచ్చి ధాతువులఁ గ్రాఁచి వెసం[2]బెనుపొట్టు
కట్టగాఁ, జేయుము నీదుశోషణవిశేషణనైపుణికల్మి
యేర్పడన్. 147

వ. అని పనిచినం బనిపూని సంశోషణాభిధానుం డగునప్పవ
మానుం డాదైత్యరాజసూను శరీరంబుఁ బ్రవేశించి నిజ
వ్యాపారవికారంబులు గావింపం దొడంగిన. 148

ఉ. హానియు వృద్ధియుం బొరయ కస్తసమస్తవికారుఁ డైన ల
క్ష్మీనిధి మేదినీధరునిఁ జిత్తమునందు ధరించియున్న మే
ధానిధియయ్యశోనిధికృతస్మితచారుముఖారవిందుఁ డై
తానొకయీసులేక ప్రమదంబున నుండె నకంపితస్థితిన్. 149

ఉ. అంతఁ దదీయహృద్గతుఁ డనంతుఁ డనంతదయాంతరంగుఁ డ
త్యంతవిభూతి నప్పవనమంతయుఁ గ్రోలినఁ గృత్తమూలమై
యంతటఁ బేరడంగె నదియాత్మఁ బ్రమోదము పొందె
లోకమే,కాంతవివేకులఁ వికృతులందునె యొందును నెవ్వి
ధంబునన్. 150

---

1 వెట్టిచేయుం. 2. బెనుపట్టి.

వ. అసురేశ్వరుండును నసమానలజ్జాకందళితాంతరంగుఁ డగుచు నభ్యంతరంబునకుం జనియె నంత ప్రహ్లాదుండునుం గురు గృహంబునకుం జని పూర్వప్రకారంబునం జదువుచుండె నాచార్యుం డతనికిం గ్రమంబున భార్గవప్రణీతం బైననీతి తంత్రంబు సకలంబును నవగతంబుఁ గావించి నుతనిశాస్త్ర పారీణత్వంబు దృఢంబుగా నెఱింగి యొక్కనాఁడు హిరణ్య కశిపునాలికిం జని యిట్లనియె. 151

చ. పవలును [1]రేయి దుఃఖపడి బాలుని నొయ్యనబుజ్జగించిదా
నవకులనాథ! యేను జతనంబునఁ జెప్పితి రాజనీతివై
భవపరిబోధకారియగు భార్గవసూక్తమహార్థతంత్రమం
[2]త్రవిశదబుద్ధి నీకొడుకు దా దుదిముట్ట నుదాత్తవిద్యలన్.

వ. అనిన సంతసిల్లి తండ్రి కొడుకు నాప్రాద్దురావించి చేరువ నునుచుకొని యన్నా! నిన్ను మీయొజ్జ నయకళాపారంగ తుంగా నుదాహరించినది మాకుం దెల్లంబుగా నెఱుంగ వలయు, రాజులకు మిత్రు లమిత్రులు నుదాసీనులను మూఁడు దెఱంగులవారలు గలరు, వారలయందు భూపతి యెట్టి యెడలఁ బ్రవర్తిల్లు నభ్యంతరులు బాహ్యులు నగునమా త్యులయెడ నెవ్విధంబులవాఁడుగాఁదగుఁ,జారసంచారంబును బౌరజానపదజనానులాపనంబు నేలాగునం జెల్లించు, విశ్వా సుల నవిశ్వాసుల నెట్లుగనుఁగొనుఁ, గార్యంబు నకార్యంబు నే వెరవున నిర్ణయించు, దుర్గంబు లేమియయి సవరించు, నరణ్యశోధనులగు దక్షకిరాతాదుల నేమాడ్కి నియ

1. రేలు. 2. త్రవికలబుద్ధి.

మించుఁ, గంటకుల నేభంగిభంగించునివియు మఱియు
వలయు విషయంబుల వివరించి చెప్పుమా యనఁ బ్రహ్లాదుం
డాదైతేయప్రభువునకు నభివందనంబుఁ జేసి చేతులు మొగిడ్చి
వినయవినమితమస్తకుం డగుచు నిట్లనియె. 153

చ. ఒకటఁ గొఱంతలేదు గురునొద్ద నృపాలనయోపచారముల్
సకలము నభ్యసించితి నిజం బవిమాచివిగావు దేవయే
నొకగతివిన్నవింతుఁ బుఱుఁగోడక యిప్పుడు దాని నీ వాకిం
చుకపడి చిత్తగింపు మనసూయుఁడవై మదిఁగింక వాయఁగన్.

ఉ. సామము తొల్త దాన ముపజాపము దండము వెండి[1]
యేలుకో. [2]ర్వేమలునీయుపాయములు [3]విద్విషుఁ డాదిగ
ముప్పురందు నె, ట్లేమియి నెట్లుపొందుపడు నెవ్వనియందది
యట్లొనర్పఁగా, నేమముగల్గు రాజునకు సిద్ధపదం [4]బిది నీతి
పద్ధతిన్. 155

చ. విను మిదియెల్ల నామదివివేకముచొప్పునఁ జెప్ప నప్రయో
జనములు తండ్రి మిత్త్రుఁ డన శత్త్రుఁ డనంగ సముం డనంగ
వీఁ,డని యెఱుఁగం ద్రికాలములయందును సాధ్యము తొల్తఁ
గల్గ సా, ధన మట తోఁచుఁగాత వితథంబుగ సాధన మూర
కేటికిన్. 156

క. మేనుల కెల్లను జీవుఁడు
తానే గోవిందుఁ డొకఁడు తండ్రీ! యున్నాఁ
డా నిక్కము తన కబ్బెను
గానుపు రిపుమిత్ర [5]మధ్యగణనకుఁబోలమై. 157

1. మూలి. 2. లేమఱుడీ. 3. విద్వడు. 4. బెది. 5. సుత్య.

చ. నిఖిలజగన్మయుండు హరి నీకును నాత్ముఁడ యెంచిచూడఁగా
నఖిలశరీరధారులకు నాత్ముఁడు దీని నిజం బెఱుంగు చి
త్సుఖభరితుండు మాయలకుఁ జొప్పడఁ డప్పని గాన ము క్తి
కు, న్సుఖత వహింపఁగావలయుఁ మోహముఁ బాయఁగఁ
[1]ద్రోచి భ క్తిమైన్. 158

క. మిడుఁగు అనితలఁచు బాలుఁడు
మిడుగురు బుర్వు[2] గని మేన [3]మిడి కెడుజనుఁడుర్
బొమగునఁడగు[4] ప్రోవింతయు
జడనిధిగాఁ జూచునవులజాలని తెలివిన్. 159

వ. అట్లగుటం జేసి. 160

క. పెడవిద్య లెవ్వియనుభవ
ముడుపఁగలే వాత్మబంధ ముడుపనదియ యొ
క్కుడువిద్య [5]యట్టి విద్యలు
వోడఁగుపనియ మంచిపని విధూతకలంకా. 161

క. ఇదియంతయుఁ దగఁ గనుఁగొని
మదినిస్సారంపువిద్య మఱఁగకబంధ
చ్ఛిదఁ జేయు నాత్మవిద్యకు
నొదవఁ దొడఁగివాఁడ నుడుగ నుద్యమ మెట్లున్. 162

సీ. ఉద్యోగముల కెల్ల నొదవునె ఫలసిద్ధి
యెవ్వాఁడు దొలుమేన నెంతఁ జేసె
నంతియ వానికి నబ్బు నిబ్బాముఁన
శ్రీలు విద్యలు నెల్ల మేలు నాత్మఁ

1. బ్రోచి. 2. బ్రువ్వు. 3. మేద్వడుజనుఁడుర్. 4. ప్రోలింత' ప్రోవింతయు. 5. యొట్టి.

• గోరనివాఁడును గోరి యోపినయంత
నుత్సహింపనివాఁడు నొకఁడు గలఁడె
శూరత లేక యుదారత లేక యే
తెలివియు లేక యే తెఱఁగు లేక
గీ. యూరకుండెడు నీచులకొదవు గరిమ
వానివెరవున నెయ్యది వచ్చుఁ జెపుమ
యయిన నుద్యోగిగావలె నండ్రు బుధులు
భాగ్యమిట్టిది యని కానఁబడదుగాన. 163

క. కావున ముక్తికియత్నము
గావింపఁగవలయు సమత గల్గుటఁగోరం
గావలయు నెప్పుడును స
ద్భావంబువ సమత[1]యెవ్విధం బండ్రేనిన్. 164

క. చెప్పినమాటలె పలుమఱుఁ
జెప్పంగా వలసె నీదుచిత్తముసొరమిఁ
దప్పకయ విన్నవించెద
నొప్పుగఁ గృప నవధరింపు మూర్జితచరితా! 165

ఉ. దైవతదైత్యమానుషకదంబములోనుగఁ గల్గుజంగమ
స్థావరభూతసంచయము సర్వము విష్ణుశరీర మిందులో
నేవిధి నేశరీరమున కించుకనొప్పియుఁ జెందకుండఁగాఁ
గేవలసత్కృపానిరతి గీల్కొని[2]యుంటసమత్వ మారయన్.

చ. విను దనుజేంద్ర యిట్టిసమవృత్తిఁ జరించువివేకశాలికిన్, వన
రుహలోచనుం డజుఁ డవార్యుఁ డచింత్యుఁ డనంతుఁ డచ్యు

---

1. యవ్విధం. 2. యున్న.

థుం, డెనయఁగ మెచ్చు, నట్టిపరమేశ్వరు మెచ్చొనరించుఁ
దీవ్రసం,జననజరానిరాసనవిశారదసారసమగ్రసౌఖ్యముల్.

మహాస్రగ్ధర. అనినం గల్పాంతవాత్యాహతవిబుధనగోగ్రాకృతిన్
హేమసింహా,సనభాగోత్తానవేగోజ్జ్వలుఁడు దశనవిస్పష్టదం
ష్ట్రాధరోష్ఠుం,డును రోషోత్కంపతివ్రుండును ఘనరభసా
టోపదీప్తుండునై యద్దనుజుం డాపుణ్యవతీస్థలముఁ గడు
వడిం దాఁచె నిశ్శృంఖలాంఘ్రిన్. 168

వ. ఇవ్విధంబునం దాఁచి. 169

ఉ. కోలుమసంగి చేచఱచికొంచు మొగంబునఁ గన్నుఁగోనలన్,
రాలఁగ నిప్పులిత్రిభువనంబుల నొక్కట మ్రింగఁ జూచెనో,
కాలుఁడొ యీతఁ డింతటికిఁ గాలము నిండెనొ కాక
యంచు భూ, కాలి దలంక నిల్చి యసురాధిపుఁ డిట్లని
వల్కె బంట్లతోన్. 170

ఆ. ఓయి విప్రజిత్తి! యోయి రాహువ! యోయి
బలుఁడ! రండు వీనిఁ బట్టిపెట్టి
చటులనాగపాశసంచయంబులఁ గట్టి
యబ్ధినడుమఁ ద్రొక్కుఁ [1]డదటణంగ. 171

క. ఇటుసేయకున్న నిటమీఁ
దటమనయసురాన్వయంబుఁ దక్కెనజగముల్.
కుటిలుఁ డగువీనిమాటలఁ
దటమటగమనంబు లూని తప్పఁగ [2]నడచున్. 172

చ. మనదెసఁ గీడు లేదు పలుమాఱును జప్పిడినోరి శత్రుకీ, ర్తన
మిటు సేయఁ గాఁ దగదు[3] రా యని యొమ్మెయిఁ జాటి చెప్పి.

---

1. దదటనంగ. 2. నడుచున్. 3. కాయని యిమ్మెయి.

నర్, విన(డు దురాత్ము లైనయవివేకులకుఁ బ్రతికార మెమ్మె
యిఁక, మును గలదే వెసం జిదియ మోఁదుట చింపుట దక్క
నెక్కడన్. 173

వ. అని యాజ్ఞాపించిన నజ్ఞానదూషితు లగునద్దోషకారు లక్కు
మారుఁ గ్రూరకుటిలభుజంగపాశబద్ధుం జేసి కొనిపోయి
మున్నీట వైచిన. 174

క. ఘనభుజగశతఫణావృత
తనుఁ డై బాలుఁడు పయోధితరఁగలమీఁదన్
బెనుబాపసెజ్జఁ బవడిం
చినవెన్నునిపాటి యగుచుఁ జెన్నె సలారన్. 175

ఉ. అంత నిరంతరోర్ములు దిగంతము లందుచు మ్రోఁతకుం జగం,
బెంతయు భ్రాంతిఁ బొందఁ దెర లెత్తి కుమారునిపీడ సైఁప
క,త్యంతరయంబునం బుడమియంతయు ముంచు ననంగఁ
బొంగెఁ గ,ల్పాంతమునాఁడు నిట్ల యనునట్లు సరిత్పతి భీక
రాకృతిన్. 176

వ. అట్టియద్భుతప్రకారంబుఁ గనుంగొని యసురేశ్వరుం డసు
రల నందఱ రావించి యి ట్లనియె. 177

సీ. అలుఁగులఁ బొడిపించి యహికోటిఁ గఱపించి
కరులచేఁ ద్రొక్కించి కసలుటగ్నిఁ
ద్రోయించి విషమున దోఁగిన యన్నంబుఁ
బెట్టించి కృత్యఁ గొల్పించి [1]పాడవు

1. పాడువు.

నందుండి వెసఁ దల క్రిందుగాఁ గెడయించి
క్రూరంపుమాయల కొంకులందుఁ
దవిలించి పవనుచే నివురించి [1]యిప్పుడు
నీమహాంభోధిలో నిట్టు వైచి

గీ. యెట్టుఁ జాల మైతి మీశాఖలు మర్ధింప
దాయ యింక మనకుఁ దాన చిక్కె
[2]నూడుకొనఁగ వైవుఁ దుర్వ్యధ ములు [3]వీని
మీఁద మెలఁగ కుండ [4]మిడుకకుండ. 178

శా. చావండొండొకవెంట నేమిట మరిక్ జర్పించి యే నెప్పు
డుం, భావం బేర్పడఁ గంటి నిట్టు లొనరింపక్ గ్రొవ్వ పెం
పాఱుడిం, బోవం బెద్దయుఁ గాలముండి కవియుం బుత్రాళి
తిక్ శత్రుఁ డై, తా వేభంగుల నన్ను నేఁచుఁ దగ దీద
ర్పాంధు సైరింపఁగన్. 179

చ. అనవుడు దానవేశ్వరునియానతి నష్టసహస్ర[6]సంఖ్యల
ద్దనుజులు పేర్చి యార్చుచు నుదగ్రనగంబులు దెచ్చి తెచ్చి
యో,జనములు పెక్కు-వేలయెడసాలఁగఁ [7]బ్రబ్బఁగ బిట్టు
వైచిరా,ఘనతరమూర్తిమీఁదఁ దదకంపితలీలకుఁ జోద్య
మందుచున్. 180

ఉ. వీపున నబ్ధినొక్క-పృథివీధరముక్ దగఁ దాల్చె నంచు ల
క్ష్మీపతి పేర్మి సాలఁగడుఁ జిట్టలుగా శ్రుతు లుగ్గడించు నీ
రూపునఁ గోటిసంఖ్యల [8]గిరుల్ ధరియించినవిష్ణుదాసు పెం
పేపగిది న్నుతించునొకో యింకని వెక్కస మందె లోకముల్.

---

1. యప్పుడు. 2. నూదు. 3. నవి. 4. మిడుగ. 5. నవియుఁక్. 6. సంఖ్య. 7. ప్రబ్బిన. 8. గరుల్.

ఉ. పిండలిపండుగాఁ గలఁగెఁ బెల్లుగ నంబుధు లెల్ల మేదినీ
మండలి దిర్దిరందిరిగె మ్రగ్గె దిశాకరిసంచయంబు మా
ర్తాండుఁడు మాసె [1]విశ్వములు దామరపాకుననీరువోలెనొం
డొండ [2]చలించె నయ్యనఘుఁ డున్న నితాంతనిరోధభంగికిన్.

క. అప్పుడు నెందును జెందక
చిప్పిలుభక్తిరసలీలఁ జిత్తము దనువున్
దొప్పందోఁగఁగ బాలుం
డెప్పటిక్రియ నుండె జగదధీశ్వరచింతన్. 183

వ. ఇట్లు మహితసమాధినిష్ఠుం డై యున్న యబ్భాగవతశ్రేష్ఠుండు నిజగరిష్ఠభావనివాసుం డై భాసిల్లువాసుదేవు ననేకప్రకారంబుల వినుతించుచుం దలంపులుం [3]దెలువులును మున్నీరు చొచ్చినయేఱులచందంబున గోవిందునందు డిందనానందకాంతి నధిష్ఠించి యుండ నొండొండ నయ్యురగరాజరజ్జువులు [4]నజ్జరాలగ రాళశైలసహస్రంబుల రాసులు [5](ప్రశ్నిపాసి) వారాశింబడిమునింగిపోవం గసుగందకసుందరశరీరంబుతో సముత్థితుం డై సముద్రతరంగతురంగమారూఢుం డై రయంబునం దీరంబున కరుగుదెంచి. 184

ఆ. మనసుగొంతవెలికిఁ గొని వచ్చి తాను బ్ర
హ్లాదుఁడని జగంబులనఁగఁ గలుగు
నాత్మభిన్నభావ మాపచారికదృష్టిఁ
జూచుచుండె వికృతి సోఁకకుండ. 185

---

1. విశ్వమును 2. చరించె. 3. దెలువులం జేయు. 4. నజ్జరాలట. 5. (ప్రశ్నిపాసి).

క. అని ప్రహ్లాదచరిత్రము
మునివరుఁడగుగాలవునకు మోదాద్భుతసం
జనకంబుగ నుగ్రశ్రవుఁ
డనుపమతేజుండు చెప్పె నని తగ మఱియున్. 186

క. తల్పితరత్నాకర సం
కల్పితభక్తజనకావ్యకల్పనచూడా
కల్పితశితికంఠచ్ఛద
శిల్పితజగదండచతురచిత్రవినోదా. 187

మందాక్రాంతవృత్తము.—
వేలాక్రాంతత్రిభువనమహాద్వీపవిద్వీపలక్షసూక్ష్మా
[1]స్థూలాణుత్వస్ఫురితరచనాదుర్నిరూపాత్మ ఖేలో
త్కోలాకారక్షుభితవలయోత్కూలకల్లోలమాలో
ల్లోలాంభోధిందోల్లుఠితవసుధాలోకరక్షా[2]సమీక్షా. 188

క. దైతేయభయద, పృథుతర
పీతాంబర, కంబుహస్త [3]పీతాంబర ప్ర
స్ఫీతాంబురుహేక్షణభవ
భీతాభయదానకరణ పేశలకరుణా. 189

అంబురుహవృత్తము.—
దేవకులార్చితదేవశిరోమణి దేవదేవజగ[4]త్త్రయీ
పావనమూర్తి కృపావనవర్తి విభావనామకచిత్తరా (?)

1. స్థూలావిత్వ. 2. సమక్షా. 3. ప్రీతాంబర. 4. త్రయా.

జీవమధువ్రతజీవదశాపరిచేష్టితాఖిలలోకల
క్ష్మీవదనాసవశీతల సౌరభసేవనాంచితజీవనా. 190

గద్యము. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వరచరణసరోరుహధ్యానానందసౌందర్యధుర్య శ్రీసూర్యసుకవిమిత్రసంభవ శంభుదాసలక్షణాభిధేయ యెఱ్ఱయనామధేయప్రణీతం బైన శ్రీలక్ష్మీనృసింహావతారం బను పురాణకథయందుఁ జతుర్థాశ్వాసము.

---

శ్రీ ర స్తు

# ప ం చ మా శ్వా స ము



శ్రీకరకటాక్షనిగమ
శ్లోకితవివిధావధాన సురశరణభుజ
ప్రాకార, కృపాసిత్య
స్వీకార యహోబలేశ శ్రీనరసింహా. 1

వ. దేవా రోమహర్షణుండు మహర్షుల కిట్లనియె నివ్విధంబునం బటుశస్త్రపాతంబు మొదలుగా దైత్యనాయకుండు చేయు నపాయంబు లనేకంబుల నెందును దగులుపడక నిగుడు ప్రకటితాహ్లాదుం డగు ప్రహ్లాదుచందంబుఁ గనుచుం దజ్జనని భయవిస్మయానందంబులసందడింబడినడెందంబుతోడ భవిష్యత్కాలవిపాకంబునకు నాశంకిత యగుచునుండు నంత. 2

క. కట్టినకట్టులు వదువున
దెట్టిన పెనుకొండ[1]పొదులు దీఱిచికొనుచుఁ
బిట్టు జలధి వెడలినయా
దిట్టని తెఱఁగసురవిభుఁడు తెలియఁగ విసియున్. 3

వ. ఇట్లు బహుభంగులఁ దనకావించు కల్మషంబుల ముసిముట్టక మెఱయు నాజగజెట్టి చందంబు విని డెందంబున భయంబును

---

1. పొదలు.

నద్భుతంబునుం గోపంబును ముప్పిరిగొన హిరణ్యాక్షుపూర్వ జుండు గర్వంబువాఁడిమియుఁ జిత్తంబువేఁడిమియు మాత్స ర్యంబు పోఁడిమియు [1]దలంకి నెఱకులమెఱుంగుటమ్ములు మెఱమినతెఱంగున నతనిచరిత్రస్మరణంబులు చిత్తోత్కం పంబు నొనరింపఁ గంపితశరీరుండును భ్రుకుటీవికారుండును గల్పితస్వేదసంచారుండును నగుచుఁ [2]దదపాయంబున కుపాయంబూహించి యెద్దియుం గానక కలుచపడి వెలుచ నంతిపురంబు వెలువడి కొలువుకూటంబునకు వచ్చి సింహా సనాసీనుండై పెద్దలునుం బ్రెగ్గడలును దొరలునుంబరివేష్టింపఁ గొలువుండి కొడుకుం బిలిపించిన. 4

క. బహుమేఘపటలపరివృత
సహస్రకిరణుండపోలెఁ జనుదెంచె జగ
న్మహితుఁడు ప్రహ్లాదుఁడు దు
స్సహతేజుఁడు ఘోరదనుజసంవేష్టితుఁడై. 5

మ. హరినామాంకము లుగ్గడించుచు ముకుందానేకచారిత్ర ముల్, వరుసం గీర్తనసేయుచుక్ వరదుఁ దత్త్వవ్యాప్తిఁ జింతించుచుక్, బరమానందనిరూఢినొండొకటియుక్ భావిం పకేతెంచున, ప్పురుషశ్రేష్ఠునిఁజూచి దైత్యవిభుఁ డుద్భ్రా తాధికోద్వేగుఁడై. 6

చ. కవిదెసఁజూచి వీఁడు కడుఁ గష్టుఁడు వీనిమనోగతంబునం దవిలిన దైవ మెవ్విధులఁ దక్కఁ ద యక్కటయింకఁ జేయ[3]నే

1. దరంకి. 2. దద్వధోపాయంబున. 3. నేమిరవునగల్గు.

మిపెరవుగల్గునీ[1]శిశువు మేవడితోడన తెల్పి తెల్పి యీ
యవినయబుద్ధిమాన్పఁగలయంతయు నింకను నాడి చూతమే.

క. కానితెలుఁ గైన మనకును
వీని [2]దెసం గార్య మేమి వెడలనడత మె
చ్చోనైన నుండుఁగా కను
[3]దానవపతి మాటలఁ గవి దగుఁ దగుననియెన్. 8

వ. ప్రహ్లాదుండును తదాస్థానంబుఁ దఱియంజొచ్చి తండ్రికి నాచార్యునకు నమస్కరించినం గావ్యుం డతని నాసీనుండ వగుమని పనిచిన నట్లచేసె నాసనుయంబున. 9

తే. అతనిఁ జూచి యసురలందఱుఁ బెలుచ డెం
దములు కలఁగి కరము దైన్యమంద
బాలభానుఁగనిన బహుళనీలోత్పల
షండమనఁగఁ బోలు చుండెఁగొలువు. 10

క. దితివంశవల్లభుఁడు భృగు
సుతువదనమునందుఁదనదు చూడ్కి నిలిపి కు
త్సితుఁడగు వీనికిఁజెప్పుఁడు
మతిగానని దుష్పథంబు మానుతెఱంగున్. 11

ఉ. వేఁదులు గొన్న మానవుని వేమఱుగంటియుబిట్టుగాల్చియుఁ
మోఁదియునీటఁద్రోక్కియును ముక్కునితీర్పఁగడంగు వెజ్జన
ట్లేఁదఁగనిన్నిచందముల నీతని దీర్పుటకై పెనంగితిఁ
బేదఱికంబు గట్టుకొని బెట్టుగఁజిక్కితి నేమి సేయుదున్. 12

వ. [4]అన శుక్రుఁడు ప్రహ్లాదు నాలోకించి. 13

1. శిఖుని. 2. దెస. 3. దానవగతిమాటలఁగలిదగు. 4. అది.

శా. అన్నా! బాధలఁబొందనేల జనకాజ్ఞాయత్తచిత్తుండవై
యున్నన్ క్షేమముగాదె? తండ్రులప్రియం బొందించుటం
బోలఁగా, నెన్నన్ ధర్మముగల్గునే? గురుహితం బెబ్భంగి
దుష్కర్మమై, యున్నన్ బుణ్యపదంబుగా బుధజనం బూ
హించు ధర్మస్థితిన్. 14

క. జననీజనకుల కప్రియ
[1]మనఁజను సద్ధర్మమైన నది దురితమకా
మును లుగ్గడింతు రదినీ
మనమునఁ దలపోయవలదె మహితవిచారా. 15

ఆ. అనినఁ గేలుమోడ్చి యద్దానవాన్వయా
చార్యుఁజూచి వినయసంప్రయోగ
కలితచిత్తుఁడగుచు గంభీరరవమున
నిటుల ననియె బాలుఁ డెల్లవినఁగ. 16

క. మీ రరయనిధర్మంబుల
మేరలు నెలుకలును గలవె మీకుం దగవే
నారాయణభక్తిపరత
వారించెద ననుట యిట్లు వైదికవర్యా! 17

ఆ. మీరు గురులుగారె మీమాట యతనికి
వినఁగవలదె కలుషవృత్తి విడిచి
వాసుదేవుమీఁది వైరంబుదక్కి వ
ర్తిల్లు [2]గురువుగాఁగఁ దెలుపవలదె? 18

1. మన జన. 2. టురవు.

క. తామసుఁ డితండు విష్ణుమ
హామహిమలకోలఁది యెఱుఁగఁ డద్వైపు దేసఁ
వేదాఱు నలుగనంతయు
సోమించిన నుడిని బ్రదుకు సులభంబగునే. (?) 19

తే. తల్లిదండ్రులకును వేసఁదగుహితంబు
చెప్పుదురుగాక యెప్పుడు నిషిద్ధమైన
యుభయలోకవిరుద్ధమహోగ్రవృత్తి
కార్యముగఁజెప్పు టెందునుగలదె యనఘ! 20

వ. అవధరింపుము. 21

సీ. వాసుదేవుని పాదవనరుహంబులభక్తి
తగదనుతండ్రియుఁ దండ్రిగాఁడు
వేదచోదితమైన విష్ణుధర్మమునకుఁ
గోపించుగురుఁడును గురుఁడుగాఁడు
భవదుఃఖములుమాన్పఁ బ్రభువైన హరిసేవ
నెడలించుహితుఁడును హితుఁడుగాఁడు
పరయోగమత మగువైష్ణవజ్ఞానంబు
వదలినచదువును జదువుగాదు

గీ. కేశవాకారలీలలు గీలుకొని ము
దంబుఃబొందని తలఁపును దలఁపుగాదు
మాధవస్తోత్రఘనసుధామధురరుచులఁ
జిలుకకుండెడుజిహ్వయు జిహ్వగాదు. 22

ఉ. పురుషగుణంబు మేనఁగలపోఁడిమి నొందిన వాఁడు మేలు కీ,
డరయఁగఁ జాలుబుద్ధిఁ బొలుపారినవాఁడు సుఖంబు నాయు

వుణ్, జిరముగఁ గోరువాఁడు సరసీరుహనాభు ముకుందు నిందిరా, వరుభజియింపనొల్లఁడఁటెవానికి నెక్కడివే శుభంబులున్. 23

ఉ. ఊషరబీజముల్ భసితయోజ్యఘృతంబులు షండకన్యకా
న్వేషణముల్ పయోధిగతవృష్టితతుల్ మృగతృష్ణికాంబుగం
డూషలు దుర్గకాననకరోరితచంద్రిక [1]లేడమూకస
ద్భాషలు విష్ణుమంగళకథావిముఖాత్ములదుష్టజన్మముల్. 24

క. మోహాంధుఁడు దుర్గతిపద
సాహసికుఁడు బహుళదురిత సాగరవీచీ
గాహనశీలుండాత్మ
ద్రోహిగదా విష్ణుభజనదూరుఁడు ధరణిన్. 25

వ. అని పలికి హిరణ్యకశిపు నాలోకించి. 26

క. నిన్నింతవానిఁ జేసిన
యన్నాలుగుమోములతఁడు హరి[2]పొక్కిటియం
దున్న వెలిదమ్మి యీనిన
[3]కున్నయగుట తెలిసి విడువు కోపముతండ్రీ. 27

క. హరికంటెఁ బరము లేదిది
పరమార్థము నీవుదీనిఁ బాటింపుము సు
స్థిరముగఁ దలఁపుమతనిమ
చ్చరమునఁ గన్నయది తలఁతె [4]చలమో ఫలమో? 28

వ. నావుడు నేయిపోసిన మండు నగ్నియుఁబోలె నగ్గలంబైన కోపంబు దీపింప నిలింపవైరి నిజసేవాగతుఁడై యున్న దండ

1. వేదమూక, వేఁడమూగ, 2. యొక్కటి, పక్కటి. 3. కూన. 4. పలమో

ధరుఁజూచి నీవు సకలప్రాణిసంహరణాధికారధురీణుండవు కావున నిప్పాపాత్ముని పాపంబున కనురూపంబుగా [1]నాగ్ర హించి యాతనలం బనుపుమని యనుశాసించినఁ బ్రసాదంబని యయ్యంతకుం డనంతధ్యానపరవశుం దనవశంబు సేయ సమకట్టె. 29

ఉ. కింకరకోటిఁ బిల్చిమదిఁ గింకమొగంబున నంకురింపఁగా
జంకెలు మిక్కుటంబుగఁ బ్రచండపుదండముఁ [2]గేలఁబూని ని
శ్శంకతఁగాలపాశములఁ జాలనమర్చి మహోగ్రమూర్తియై
[3]బింకమెలర్పఁడాసెఁ బటుభీషణ[4]మృత్యు పురస్సరంబుగాన్.

వ. ఆసమయంబున నార్తశరణ్యుండగు గరుడధ్వజుండు పనుపఁ దదీయసేనాధిపతి విష్వక్సేనుండు కింకరకోటియుఁ దానును దివ్యహాయుధట్టంబులతో దాడివెట్టి బిట్టుఱఁ గృతాంతకింక రుల ముట్టి కనుపుగొట్టం దొడంగినం గని దైత్యపతి తానును భయభ్రాంతుఁడై డగ్గి తొలంగి యభ్యంతర గృహంబునకుం బఱచి వెఱచఱచి సందులు *బ్రిందులు గొందులు దూఱియుండె నాలోన. 31

మ. ఖరఘోటాగ్రఖురావపాతనిహతిన్ ఖండంబులై యాశ్వీక స్ఫురదుద్దామకృపాణకుంతముఖవిస్ఫోటంబులన్ వ్రస్సి భీ కరసేనాపతిచక్రధారఁదుముకై గర్వోల్లసత్కాలకిం కరసైన్యంబులువెల్లిడిన్ బొలిసెనుత్కంపింపఁద్రైలోక్యముల్.

క. అంతఁ బరమాత్ము కింకరు
[5]లంతకుఁ బట్టుకొని యోరి హరిదాసులని

1. నాగ్రహింప. 2. గేల. 3. బింకె. 4. మర్త్య. * క్రిందులు?
5. లంతంబట్టుకొని.

ర్జింతునని వూనఁగా నీ
వెంతటివాఁడవిటఁ గుడువు మీఫలమనుచున్. 33

క. మొగమును ముక్కును జవియఁగ
బిగువగుపిడికిళ్ళఁబొడువ బెగడి జముండుర్
సుగుణాకర[1] ప్రహ్లాదుఁడ
విగతభయుఁడ నన్నుఁగావవే కృప ననఁగన్. 34

ఆ. అమ్మహానుభావుఁ డమ్మహావీరుల
ననునయించి వీఁడు ననపరాధుఁ
డీకృతాంతువిడువుఁ [2]డితఁడు పరాధీనుఁ
డేమిచేయు? సుజనుఁ డీసులేదు. 35

వ. అనిన నట్లకాక యని యంతకు విడిచి యసురాంతకభృత్యులు
దైత్యపతి మున్ను తలయుం జీరయు[3]విడనాడఁ బొఱుటఁ
జూచినవారు గావున వాఁడు నరసింహనఖంబుల కెరగాఁ
గలవాఁడని నిశ్చయించినవారై యేమియుం జేయనొల్లక
యాదితిసూనుపురంబు గాల్చి దైత్యులఁగొందఱ బొరిసమరి
సమదగమనంబునన్ జనిరి. ప్రహ్లాదుండును దండ్రికడకుఁ జని
యి ట్లనియె. 36

మ. సకలేశుండగువిష్ణుసైన్యపతి విష్వక్సేనుఁ డీపేరుఁ దె
న్నికకున్ బెక్కుబలంబు లీతనికి వర్ణింపంగ శక్యంబె యి
ట్లొకఁడే తెంచినఁ బొల్ల[4]నాఁ బొలిసెనీయుద్దామదర్పంబు, తా
నకడంకన్ హరివచ్చినం జెపుమనిన్ గావంగనింకొక్కనిన్.

---

1. ప్రహ్లాదుఁడు. 2. డితఁ డపరాధీను. 3. విడనాడిపొఱుట.
4. రా పొలుసె, రాఁ బొలసె.

వ. ఇది దృష్టంబుగాఁ గన్గొని. 38

ఉ. [1]చెన్నటి యింకనుం జెడక శ్రీరమణీకుచకుంకుమచ్ఛటా
చ్ఛన్నశరీరు నుద్యదసి శంఖసుదర్శనహస్తుఁ గౌస్తుభో
ద్భిన్నగభస్తివిస్తరణదీప్తభుజాంతరు నంతరంగసం
పన్నదయాంతరంగు హరిభక్తవిధేయు భజింపుమింపునన్. 39

క. ఖేదంబుల భేదంబుల
వాదంబులఁ బ్రోపులేదు వనజాక్షుమహా
త్మ్యోదయము నిండఁ దెలివికిఁ
గాదిలిగై చేరుదీనఁ గనుఁగొనుమనఘా. 40

వ. అని చెప్పి ప్రహ్లాదుం డూరకుండె నయ్యసురేశ్వరుండును
నట్లు బెండుపడినవాఁడై తనలో నిట్లని వితర్కించు. 41

సీ. హరినాకుఁ బగగదా యతనిపక్షంబుదా
వీఁడెంతచేసిన విడువఁడింక
వీనికినై కాను వేమాఱుఁదనలావుఁ
జూపుచున్నాఁడు విష్ణుఁడు గడంగి
యయిననేమగుఁ జూతమాతనిబలిమియుఁ
గలిమియుఁ జెలువును నిలుకడయును
ఎఱుఁగుదీఁ డిదిగొల్లనిప్పుడువీనివా
క్యంబులచొప్పునునరసిచూచి

గీ. యాముకుందునిపై దాడియరిగి యతని
నొల్లమంతయు వెసఁగొని ముట్టిపట్టి
కట్టుకొనివచ్చి చెఱఁబెట్టి కష్టపఱుతుఁ
బూనిముచ్చున్న దివిజులలోనఁ గలపి. 42

1. చెన్నుఁటి, చెన్నది.

వ. అనితలపోసి క్రమ్మఱ నంతఃపురంబు నిర్గమించి సమంచిత కాంచనరత్న రచితమహాస్తంభ శతసంభారమండితంబగు సభామంటపంబుఁ బ్రవేశించి యెప్పటియట్లయనుజీవలోకంబు గొలువం బెద్దగద్దియపైనుండి ప్రహ్లాదుఁ రావించి యి ట్లనియె.

ఆ. పయికి వెఱవకిట్లు పగవారి వాఁడవై
మమ్ము నేఁచె దింకమాటలేల
యీవిధమున నీకు లావిచ్చి పెనఁగించు
నతనిఁ గాక నిన్ను ననఁగనేల. 44

క. నీవ కనుంగొనుచుండుము
మీఁ విష్ణునిఁ బట్టి తెచ్చి మెదిపెద మునునా
లావున కగపడి యడఁగిన
నీవిబుధులకంటెనాతఁ డెక్కుడుగొలమే. 45

వ. అనిన నగుచుం బ్రహ్లాదుం డి ట్లనియె. 46

తే. అయ్య! నీవేమి సేయుదు వఖిలజగము
వెట్టిచేయంగఁబుట్టినవిష్ణుమాయ
నిన్నుఁ దెలియంగ [1]నీక దుర్నీతిఁ దెలుపు
చుండనీ ప్రల్లదంబుల సొంపు మెఱసి. 47

సీ. నీవెంతవాఁడవు దేవతలైనను
మునులైనఘనులైన మోసపోదు
రమ్మహామాయచే హరిభక్తిసీమకు
నడ్డమైత్రోవఁగనలవిగాక

1. నీకు.

విలసిల్లునమ్మాయ విశ్వాత్ముఁడగువిష్ణు
తలఁపులోననతాను గలిగియుండుఁ
ద్రిభువనవ్యాప్తిని ద్రిపురుషాధీశ్వరి
త్రిగుణస్వరూపయాదివ్యశక్తి
గీ. యబ్జలోచనుకరుణాకటాక్షదీవి*
వ్రాలు[1] నేవారలవ్వారచాలువారు
మాయకడలినిబడమిక మ్మహితభక్తి
కలితహృదయులై తఱచుగాఁ గలరెధరణి. ? 48

ఉ. తామసజీవులై భవనిధానమునాఁజనుమాయచేయును
ద్దామవికారముల్ గదిరిధర్మవిదూరులు కొందఱచ్యుతుఁ
దామరసాక్షుఁ గైకొనకదర్పము మచ్చరముఁ దలిర్పఁగా
వేమఱుఁబుట్టుచుఁ జెడుచు వేగుదురుత్కటసార కాగ్నులన్.

చ. తపములొనర్చిదానములధర్మములఁ దుదిముట్టనిష్ఠతో
జపములునిర్వహించిశమసంయమసౌమ్యసమాధిఁబండిభ
వ్యపు దెసఁ జెందఁగా బహుసహస్రభవంబులపిమ్మటంగదా
విపులముకుందభక్తిపదవీథిఁ బ్రపన్నతనొందఁ గాంచుటల్.

సీ. ఎసఁగువానయుసీతు నెండయుసైరించి
తనువులింకఁగఁజేయు తపముకొఱలి
యిడుమలుబడి కన్నయొడలువంచించి ని
ర్ణయముననడుపు జన్మములపంట
లాసతో నమ్మికయాధారముగఁజేయు
వివిధదానంబులవెలలచొప్ప

* దీప్తి 1. నేవారిపైవార.

[1]కాలీచవడ నెల్లకడభూమిఁ గ్రుమ్మఱి
యాడుతీర్థములయాయాసఫలము

గీ. దివిజకాంతలయిఱిచన్నుఁగవలమీఁద
వ్రాలికలఁగన్న తెఱఁగున [2]సోలు నొకట
సత్యమత్యంతమనఘమక్షయమనంత
మచ్యుతార్చనాసంభృతోదాత్తఫలము. (?) 51

చ. జడధులునింకుఁగూలుఁగులశైలచయంబును ధాత్రియుఱ్ఱడిగం
బడుఁబెడబాయుభానుశశిభవ్యపదంబులునబ్జసూతియుఱ్
సుడివడు నెన్నఁడుఱ్జెడనిచోటు ముకుందపదప్రపన్నులుం
డెదునెడయెట్టివారలకుడెందములందనిగొందియొమ్మెయిన్. 52

శా. అక్రూరాత్ములుసత్యసంగతులుమాయాదూరులత్యంతని
ర్వక్రాచారులుధీరులుత్తమకృపావ్యాపారులుద్యద్యశో
విక్రాంతాఖిలలోకులూర్జితసమావేశప్రకాశోన్నతుల్
శక్రాద్యామరపూజ్యులచ్యుతకథాసక్తుల్ మహాత్ముల్ మహిన్.

సీ. వలసినఁజారుగీర్వాణతరుశ్రేణు
లాదవిపెందోఁటలై యుల్లసిల్లు
వలసినఁగామధుగ్వరధేనువులుపెను
[3]గదుపులై ముందఱిగడపఁబరఁగు
వలసినఁ బ్రస్ఫురదలఘుచింతామణి
వ్రాతముల్ క్రీడాద్రులైతనర్చు

1. కాలిచిపడ, (కాలచిపడ) ఇది వ్రా. ప్ర. పాఠము. దీనినుండి పైపాఠ మూహింపఁబడినది. 2. సోల నొకఁడు. 3. గదుపులై.

వలసినసుద్గతోఁ జ్వలసిద్ధరసములు
[1]గరువంపు టేరులై తరఁగలొత్తు

గీ. సమరగరుడనిశాచరయక్షఖచర
వితతివలసినఁగింకరస్థితిఁజరించు
నయినహరిభక్తివర్యులయనుపమాన
నిత్యమహనీయమహిమవర్ణింపవశమె. 54

చ. అమరపదంబు మెచ్చరమరాధిపులీలగణింపరేమియుం
గమలభవత్వముం సరకుగాఁగొనరాకులితార్థధర్మమో
క్షములతెఱంగుఁజేరికిసిగైకొనరచ్యుతదాస్యవృత్తిమై [ల్.
నమితసుఖానుభూతినమృతాంబుధిఁదేలుచునుండు సాత్త్వికు

క. తారొకరులమాటలచనిఁ
గోరరుహరినామసుధయ క్రోలుచుఁబెఱలం
గోరరుసంతతసౌఖ్యులు
శ్రీరమ్యులువిష్ణుచరణసేవాసక్తుల్. 56

క. నారాయణనామము సం
సారసదాపథము దురితసముదయభూభృ
ద్దారుణభిదురము మంగళ
కారణ మది ఖలుల కెట్లు గఱపఁగవచ్చున్. 57

క. దాతవ్యుఁ డొకఁడు విష్ణుఁడు
శ్రోతవ్యం డొకఁడు దనుజసూదనుఁడు [2]సము
ద్ఘాతవ్యము హరినామము
చేతవ్యము విష్ణుభక్తిచే నఖిలంబున్. 58

1. గరువంపుఁ జేరులై. 2. సముద్ఘ్రాతవ్యము.

క. విష్ణుమయము వేదంబులు
విష్ణుమయము[1] సర్గము లఖిలవిజ్ఞానములుఁ
విష్ణుమయము జగమంతయు
విష్ణుమయము విష్ణుఁడొకఁడ వేద్యుఁడు బుద్ధిన్. 59

సీ. త్రిభువనవ్యాపకదీప్తి నిర్గుణమూర్తి
వాసుదేవాఖ్యను జ్జ్వలత నొంది
జగదేకసంహారసమద తామసమూర్తి
నతులసంకర్షణాహ్వాయతఁ జేర్చి
విశ్వరక్షాకరవినుతసాత్త్వికమూర్తిఁ
బ్రద్యుమ్ననామవిభాతిఁ బరఁగి
భువనసంభవహేతుభూతరాజసమూర్తి
ననిరుద్ధనామధేయాప్తి నొంది
గీ. శ్రుతిపదంబులు దనుఁ జతుర్మూర్తి యనఁగ
నఖిలకథలును దను జతురాత్ముఁ డనఁగ
[2]నాగమంబులు దను జతురత్ముఁ డనఁగ
నొక్కరుఁ డయాతఁడచ్యుతుఁ డుల్లసిల్లు. 60

క. మఖనేతయు మఖధాతయు
మఖదాతయు [3]మఖవిధానమాతయు మఖదు
ర్మఖజేతయుఁ బీతాంబరుఁ
డఖిలమునకుఁ దానకాక యన్యుఁడు గలఁడే. 61

క. జీవునిఁ బ్రకృతిం దొలితొలి
కావించెను బుద్ధిమొదలుగాఁ గల్గిన త

1. వర్గ. 2. ఈపాదము వ్రా.ప్ర.లో లేదు. 3. మఖఫలప్రమాతయుం.

త్త్వావలి నోలి సృజించెను
గోవిందుఁడు దాన యింతకును మూలంబై. 62

సీ. బోద్ధునఁ దామరఁ బుట్టించి యం దజుఁ
గలిగించి లోకాధికారమిచ్చె
నాగమంబులు నాలు గంగంబు లాఱును
మఱిపురాణములు[1]మీమాంసయనఁగ
న్యాయంబు ధర్మశాస్త్రావలి [2]యనఁబడు
నాలుగు విద్యలు నోలినిలిపె
బ్రహ్మాండములను నబ్రముగ దొంతులుపేర్చి
యందులోభువనంబు లఱులుదీర్చె

గీ. నబ్ధులన గిరులన దీవులనఁగ నేఁఱు
లనఁగ నడవులనఁగ నూరులనఁగ వరుస
నచ్చుకట్టి యిన్నింటికి నధికరులఁ
బనిచెఁ బరమేశుఁ డబ్జలోచనుఁడు దాన. 63

క. మనువులు మన్వంతరములు
మునులును దివిజులును దివిజముఖ్యులు మనునం
దనులును దత్కులజనితులు
వనజోదరునాజ్ఞ నుద్భవస్థితికారుల్. 64

క. తారగ్రహనక్షత్ర
స్ఫారవ్యాపారములును భవనస్కంధా
వారనిబంధస్థితులును
నారాయణ శాసన ప్రణయకీలితముల్. 65

---

1. మీమాంసమనఁగ. 2. యనఁబడు.

క. వసురుద్రాదిత్యాది
శ్వసనగణంబులును సిద్ధసాధ్యోరగరా
క్షసయక్షభూతదైతే
యసమూహంబులును విష్ణునాజ్ఞాకారుల్. 66

మత్తకోకిల. కాలచక్రము నిర్వికల్పముగా ముకుందుఁడు
ద్రిప్పును, స్మీలితక్రమవిక్రమైకస మృద్ధిమైలయ [1]విక్రియా,
వేళనింతయు సంహరించుఁ బ్రవృద్ధయోగ [2]పరోల్లస, త్కాల
రూపముదాల్చి దుర్వహాగర్వనిర్వహబుద్ధియై. 67

తే. అతఁడు కనుదెర్వ బ్రహ్మాండ వితతియొదవు
నతఁడు గనుమూయ నన్నియు నడఁగిపోవు
భువనసంభవసంహారభూరిమహిమ
తోయజాక్షున కరయ లీలాయితంబు. 68

క. తా నిట్లింతటివాఁడును
నైనట్టుల యుండు నిక్క మారసిచూడం
గా నేమిటివాఁడునుగాఁ
డానందచిదేకమూర్తి యచ్యుతుఁడెందున్. 69

మ. జననం బొందు ననంగరా దజుఁడు నాశక్యంబుగా దబ్ధియం
దనిశంబుం బవడించునా నిజముగా దత్యంతబద్ధుండునాఁ
జన దేకాంతతపస్వినాఁ జనదు శశ్వత్క్రీడినాఁ బోల దే
వనివర్ణింతును వారిజోదరునియత్యాశ్చర్యచారిత్రముల్.

క. ఆలించునార్తరవము
న్మాలించును ఖలులసతతముం సజ్జనులం

1. లయవిక్రమా. 2. ఘరోల్లస.

బాలించును గృప నెంతయు
శీలించును మత్ప్రభుండు శ్రీవిభుఁ డాత్మన్. 71

మ. ఒకకేలన్ విలసత్సుదర్శనము వేఱొంటం బరిస్ఫారనం,
దకమున్ బ్రస్ఫురితాన్యహస్తమున నుదయత్పాంచజన్యంబు
నొం,డొకటం శార్ఙ్గము దాల్చి ధర్మరిపులన్ఘోరాజిమర్దింపు
చున్, సకలైకాశ్రయమూర్తితోడ నెపుడున్ వర్తించు
నాముందటన్. 72

వ. అనుచు ననేకవిధంబులఁ బ్రహ్లాదుండు విజ్ఞానపరవశుండై
పలుకుచున్న పలుకు లపహాసించి యసురేశ్వరుండు. 73

క. తొలిమేనికర్మవశమున
బలవంతపువెఱ్ఱి బిట్టుఁ బట్టిన నీభం
గుల నోరు మూయనేరక
పలుదెఱఁగులఁ బ్రేలె దీవు ప్రాజ్ఞులు దెగడన్. 74

వ. ఇంక నున్మత్తుతోడిమాటలఁ బ్రయోజనంబు గలదె యనిన
నమ్మహానుభావుం డమ్మోహాంధున కి ట్లనియె. 75

ఉ. ఆదికి నాదియైన పరమాత్ముని విష్ణునిమూర్తిఁగాన బ్ర
హ్మాదుల చాల రవ్విభుశుభాకృతి నస్ఖలితైకభక్తిసం
చోదితుఁడై కృపం బొడవు చూపుఁ బ్రపన్నులకిచ్చ [1]నైన న
వ్వేదమయుండుపొందుపడు వేఱొకటొల్లక తన్నుఁ జెందినన్.

క. ఎఱిఁగిన వానికి నెందును
గుఱుకొని తో నుండుఁదన్నుఁ గొనకుండెడువా

1. లైన.

[1]గొఱిఱకులకుఁ(?) జేరువయ్యును
బొఱియందగఁ డతఁడు నిఖిలభువనములందున్. 77

సీ. కలఁడు మేదిని [2]యందుఁగలఁ డుదకంబులఁ
గలఁడు వాయువునందుఁ గలఁడు వహ్నిఁ
గలఁడు భానునియందుఁ గలఁడు సోమునియందుఁ
గలఁ డంబరంబునఁ గలఁడు దిశలఁ
గలఁడు చరంబులఁ గలఁ డచరంబులఁ
గలఁడు బాహ్యంబునఁ గలఁడు లోనఁ
గలఁడు సారంబులఁ గలఁడు కాలంబులఁ
గలఁడు ధర్మంబులఁ గలఁడు క్రియలఁ

గీ. గలఁడు కలవానియందును గలఁడు లేని
వానియందును గలఁడెల్లవానియందు
నింక వేయును నేల [3]సర్వేశ్వరుండు
కలఁడు నీయందు నాయందుఁ గలఁడు కలఁడు. 78

చ. అనవుడు రోషహాసవివృతాననుఁడై దివిజారి యోరి నీ
[4]వనయము నెందుఁగల్గఁగ సమర్థనఁ జేసినయాతఁ డిందుఁ గఁ
ల్గునె యనుచున్ జగద్వలయఘోరకరాహతి వ్రేసెఁ గంబమ
త్యనుపమతత్సభాభవన మల్లల నాడఁ [5]గలంగ లోకముల్.

వ. ఇట్లు వ్రేసిన. 80

సీ. బడబానలాహతి జడనిధిలో నున్న
పటుశైలతతి వ్రేలి పెటిలె నొక్కొ

1. ఎఱుకలకు. 2. యిందు. 3. సర్వేశుండు. 4. వనయత నెందుఁ గల్గునని వర్ణన. 5. గలంక.

ఘనతరోత్పాతనిర్ఘాతసహస్రంబు
  గడఁగి యొక్కట మ్రోసి పడియె నొక్కొ
పెక్కు జీవులు లోన [1]బిక్కట్టువడఁగ నా
  బ్రహ్మాండభాండంబు పగిలె నొక్కొ
తఱి గాక యున్న [2]సుద్ధతిఁ జేర్చి రుద్రుండు
  విలయోగ్ర[3]పటలంబు వ్రేసె నొక్కొ
గీ. యనఁగ నాకాశసకలదేశావకాశ
భరితమై విశ్వమును మూర్ఛపాలుపడఁగ
[4]మొనసి పెఢిలు పెఢిల్లను మ్రోఁత వెడలెఁ
బగిలెఁ గంబంబు భువన[5]కంపంబు గదుర. 81

స్తంభోద్భవ వచనము.—

అమ్మహాస్తంభంబున విజృంభమాణ జిహ్వాలవివృతవదన గహ్వరస్ఫురదసహ్యకహాకహోత్తర్జనగర్జాస్ఫూర్జితంబును వికటకఠోరఘోరదంష్ట్రాదండదారుణ దహనదందహ్యమాన దశదిశాభాగంబును విపులకపిలక్రూరతరలతారకాతరంగితోద్వృత్తవృత్తాయతేక్షణరూక్షరదనస్ఫులింగపూరితభువన రంధ్రంబును నభంగభ్రూభంగభయదఫాలభాగప్రాంతభంగుర భ్రమరకదురవలోకంబును విశ్వధురంధరస్కంధపరిణాహ పరిణతోదగ్రకింజల్క పుంజపింజరితభాసురకేసరప్రసర [6]ప్రక్షాలితాంతరిక్షంబును హేమకమలతంతు కాంతికోమల రోమవల్లరిగహనకరాళ కర్ణకోటీరఘటితకుండలమణిమరీచి

1. ఇక్కట్టు? 2. హద్ధతిఁ జేర్చు. 3. పటచుంబు. 4. మొనన.
5. కంబంబు. 6. విప్రక్షలితాం.

ఝుంజరీరంజితగండస్థలోద్భాసితంబును గల్పాంతపవనకల్పా
నల్ప[1]దర్పోచ్ఛ్వసితసమీరసంపాదితకంపాకులిత కులధరనిక
రంబును సముత్కటోత్కటకోటికుట్టనకుంఠితకుటిలకుం
తలాయమానశ్యామజీమూత సకలమనోజ్ఞమూర్ధభాగంబును
శ్రీవత్సకౌస్తుభవైజయంతీ ప్రముఖనిఖిలలక్షణోల్లక్ష్యమాణ
వక్షస్స్థలప్రస్థూలప్రాలంబ నిర్విలంబలక్ష్మీసమారోహణోత్స
వంబును భక్తజనవచన[2]రచనవర్తనచింతనానురోధనిరవ[3]గాఢ
కరుణాసుధాపూరపూరిత పుణ్యహృదయప్రదేశంబును
దితి సుతవ్యపదేశపశుబంధనోపయుక్తయూపస్తంభాయితో
రుయుగళంబును [4]గనత్కనకమణీమేఖలాకలాపకలితకటితటీ
కాంచనవస[5]నాంచలాందోళనధగద్ధగితధామచ్ఛటాస్ఫురితజ
గదండఖండంబును బహుళమాణిక్యహంసకావతంస సిత
నఖాభిరామశ్రీమచ్చరణసరోరుహ [6]ప్రసభభాగ్యహాఘట్టనా
గ్రహోగ్రాటోపరభస క్షుభితక్షోణివలయంబును హిరణ్యక
శిపుప్రహ్లాదవిషయనిగ్రహానుగ్రహావేశవ్యతికర విషమసంరం
భదుర్వారగర్వారంభభీషణాభిరూపసంస్థానంబును శృంగార
వీరకరుణాద్భుతానేకరసనికరసంకులప్రకార దుర్నిరూపోప
ప్లావంబును సహస్రకిరణకృశానుశశాంక సహస్రకోటితేజగ
ప్రతాపకాంతిసమ్మేళన మహితోత్సాహసుసహతీవ్రసౌమ్య
స్వభావభావితంబును రుద్రద్రుహిణపురుహూతాది సకల
దేవతాశక్తిసభాసంభావనీయంబును సర్వైశ్వర్యసంజననం

1. దర్పోల్లసిత. 2. వచన. 3. గాహన. 4. గత్కనక. 5. నాం
చవా. 6. ప్రసభాగ్రహిః.

బును సర్వలోకాతిరిక్తంబును సర్వజగదుద్భవకరణకారణం
బును సర్వైశ్వర్యధుర్యంబును సకలవిభవానుభావగంభీరం
బును సకలశ్రుతిస్మృతిపురాణసిద్ధాంతసిద్ధదర్శనంబును సకల
మంత్రతంత్రయోగవినియోజ్యంబును సమస్తసమాశ్రిత
జనాభయప్రదానపరమవ్రతైకపారంగతంబును సమస్తమనో
రథఫలైకసాధనంబును సమస్తసాధుజనహృదయవ్యాపారప
రానందనిష్యందంబును [1]సమస్తతమోనిరసనప్రదీపంబును
నగు శ్రీ నరసింహరూపం బావిర్భవించిన. 82

ఉ. అక్కజమైన యీనరమృగాకృతితేజము లోకమంతటం
బిక్కటిలంగఁ దీవ్రగతిఁ బేర్చితలిర్చినఁ దేఱిచూడలే
కెక్కడయుం జనంగఁ దెలియింప(?) నెఱుంగక దైత్యుఁ డెంత
యుం, [2]జొక్కి మనంబునం దిగులు [3]చొచ్చి నఁ(?) జేష్టల
దక్కి నత్తఱిన్. 83

తే. కురిసె నందనమందార కుసుమవృష్టి
మొరసె గంధర్వ[4]కరహతమురజ రవము
బెరసె నారదముఖమునిబృందనుతులు
బలసె నింద్రాది నిర్జరపరికరంబు. 84

వ. ఇట్లు విజృంభించిన దేవదేవుదివ్యావతారం బాలోకించి
ప్రహ్లాదుండును భయసంభ్రమాద్భుతభక్తియుక్తం బగు
చిత్తంబుతోడ సుదాత్తధ్యానాతివందనస్తోత్రపరవశుం డగు
చు నెదుర్కొని నిశ్చేష్టితుం డగుతండ్రిఁ బేర్కొని యమ్మ
హామూర్తిని నతనికిఁ జూపి యిట్లనియె. 85

1. సమస్తనిరసన. 2. జొక్క 3. చొచ్చె 4. కర్త

చ. అతులతపస్సమాధినియతాత్ములకైనను గానరాని య
ద్భుతపరమాత్మమూర్తియిదె తోఁచెఁ గృతార్థులమైతి మింక
నీ, [1]కతలను మాని యివ్విభు నగణ్యకృపానిధి నాశ్రయిం
పు దుష్కృతములకెల్ల శుద్ధియగుఁ జేకుఱు నీకు ననంత
సౌఖ్యముల్. 86

క. నీకడుపునఁ బుట్టినఋణ
మేకరణిం బాతునో యేనని పడితిఁ
గైకొనవే నాపలు కీ
పాకము దప్పాటయు భయము [2]వాటిలదు జుమీ. 87

తే. అనిన నప్పుడు దనుఁ గాల్పఁ గొనినచలము
విడువఁజాలక దైతేయవిభుఁడు రేఁగి
కేల యేల మాటల వెఱపింప నన్నుఁ
[3]జూడు మెవ్వఁడు నవ లిటు చూడుమింక. 88

క. ఈవికృతరూప మిటులై
చావఁ దలఁచి తోఁచె దీని సమయించెద నా
లావున కెదురై పెనఁగఁగ
నీవిశ్వమునందుఁ గలఁడె యెవ్వాఁడైనన్. 89

వ. అని పలికి యుత్సాహంబు మెఱయ బాహుబలంబు చూపు
టకు నాటోపంబునం జాపకృపాణాదిసాధనంబులు ధరియించి
యానరసింహమూర్తికి నెదురు నడచి కదనంబునకుం జొచ్చె
నసురులు నిజేశ్వరు[4]తెగువఁ జూచి యేచిసహస్ర[5]సంఖ్యలు

1. కతలును 2. వాటిల్లు. 3. జూచి యెవ్వఁడు. 4. తెగుట. 5. సంఖ్యులు.

గూడఁబడియార్చుచు నర్చిష్మంతుమీఁదఁ బ్రచురశస్త్రాస్త్ర
పాతంబుఁ జేయం దొడంగిరి తదనంతరంబ. 90

ఉ. వారల యేపుఁ గోపము నవారితశస్త్రఘనాస్త్రలీలలున్
వారిధిఁ జెందె డిందెడు స్రవంతికలట్లు నృసింహు తేజమున్
జేరి యడంగిపోయె విలసిల్లె జగన్నివహంబు లప్పుడున్
గోరి సుతుండు తండ్రి యతికోపము దీర్పఁగడంగె నర్మిలిన్.

ఉ. శ్రీనరసింహరూపమునఁ జెన్నుగఁ దోఁచె సహస్రకోటిసం
ఖ్యానము లైనబాహువులయం దొడగూడినచక్రమున్ విల
భ్యానుపమానశత్రునివహంబులచే నొకమాత్రలోన న
ద్దానవసేనయంతయును దగ్ధ్గఁ దదీశుఁడు బెగ్గడిల్లఁగన్? 92

వ. ఇట్లు తనచుట్టు శూన్యంబైన దైన్యంబు మొగంబున నెగయ
వెడబిగువుగ బిగియించుకొనుచుఁ జలంబు మిగుల నసురపతి
యప్రతిహతానేకదివ్యాస్త్ర ప్రయోగం బొనరించిన నది
యంతయు నయ్యనంతతేజోరాశియందు నిరాసంబు నొందె
నాసమయంబున. 93

సీ. ఈదైత్యమాత్రకు నిట్టిరౌద్రపుమూర్తి
శ్రీనాథుఁ డేటికిఁ జెందెనొక్కొ
మడిసిరి దైత్యులు మడిసినవాఁడ త
త్పతి దేవుఁ డిట మీఁదఁ దలఁగు నొక్కొ
యీయేపు చూడఁగ నీశుఁ [1]డీసంతన
కల్పాంతమును జేయఁ గడఁగు నొక్కొ

1. డీశంతన.

తక్కువయును లేని ధర్మ[1]చిత్తులఁ గర్త
కాలంబు నిండక [2]క్రాచు నొక్కొ
గీ. మనము వేఁడినఁ బ్రహ్మాదుఁ డనునయింప
నాదిదేవుండు శాంతత నందు నొక్కొ
యనుచు నింద్రాదిదివిజులు నఖిలమునులు
నద్భుతోద్వేగనిర్మగ్ను లగుచునుండ. 94

ఉ. కోఱలుగీటుచు న్నయనకోణములం దహనస్ఫులింగముల్
గాఱఁగఁ గర్ణముల్ బిగియఁగా ఘనకేసరముల్ విదుర్చు
చుం, మీఁజినయుబ్బునం బొదలి మీఁదికి మూరెఁడు పేర్చి
కింకదై, వాఱఁగఁ బట్టె బిట్టు దితిపట్టి నృసింహుఁ డసహ్య
తీవ్రతన్. 95

సీ. పటుమృగాధిపుఁజూడఁ [3]బాఱిమదంబేది
వడఁకు బంధురమదావళముభంగి
నుద్దామవిహగేంద్రు నురువడి-కగపడి
యదలుచు నొఱలు మహాహిపోల్కి
మెదలి కోల్పులి బిట్టు [4]పొదివినఁ బోలేక
బెగడొందు సారంగవిభునిమాడ్కిఁ
గడఁగి సాగరచరగ్రాహంబు [5]నొడుపున
జడిసి చిక్కిన[6]తీరఝషములీల

1. చిత్తులు. 2. కాచు. 3. బారి. 4. నణఁగుచుఁ బోలిక. (వ్రా. ప్ర.)
5. నొడపున. 6. తీవ్ర.

గీ. రౌద్రవేగరోషరభస నిరంతర
స్ఫూర్తియగు నృసింహమూర్తి కప్పు
డగ్గమై సురారి యపగతతేజుఁడై
యడఁగి యుండె [1]మెదల మిడుకలేక. 97

వ. ఇవ్విధంబున నాగ్రహంబునకు ననువుపడినయాకడింది యసు
రంబోదివిపట్టి నెట్టిన నల్పవిహగంబు [2]నొడిసినబలుడేగయుం
బోలె గగనంబునకెగసి యయ్యాదిమవీరుండు దుర్నిరీక్ష్య
ప్రకారుం డగుచుఁ బ్రహ్లాదముఖభక్తజనంబులును మునిదేవ
గంధర్వాదులును జయజయశబ్దముఖసహితులగుచునుండఁ
గొండొకసేపు చటులనటనాటోపంబున దీపించి యనంతరంబ
సముత్తుంగశృంగసంఘటితవియత్తలం బగుమహాశైలంబునకు
ననతరించి యందాసీనుండై. 98

చ. దివిజులు 'హేనృసింహ! భవదీయ[3]మిదంనమ' యంచునం
చిత, స్తవములొనర్ప సన్మునులు 'సత్యమహాబలరుద్రరూప
మా, ధవభవతే నమో' యన నుదగ్రనిజాంకతలంబునందు
దైత్యవిభుని నున్చి విశ్వజనతాభయ[4]కారణఘోరవీరతన్.

చ. అలఘుతరాట్టహాసము లజాండకటాహము వ్రయ్య(?)భీషణో
జ్జ్వలవికటస్ఫురత్కులిశశాతనఖాంకురతీవ్రపాతనం
బుల నసురేంద్రు పేరురము బొల్పెఱఁ జించికలంచి శోణితం
బులు దొరఁగించెఁ ద్రుంచెఁ బెనుబ్రోవులుగా బలుప్రేవు
లుక్కునన్. 100

---

1. మొదల. 2. నొడసిన. 3. మిదంనతి. అని వ్రాతప్ర. మిదంనతియంచు. (ము. పా.) 4. తారణ.

చ. తొలితొలిఁ గ్రమ్ముదైత్యపతి తోరపునెత్తురు నీటిధారలం
గలియ నుదగ్రమైన నిజకాయముఁ దొప్పఁగఁ దోఁచితోఁచి
యం, దలవడ నాత్రిలోకమయుఁ డారిపుదేహముఁ [1]బాసె
రాగదు, శ్వేలసితమూర్తి నప్పుడటు [2]వెల్వడినిల్చిన యాత్మఁ
డో యనన్? 101

ఉ. పెల్లుగదోయిలించుకొని భీషణదానవదేహరక్తముల్
వెల్లిగొనంగ సానువులవెంటమఱిన్నరసింహదేవుఁడుర్
జల్లఁగ నిండుఁగాలువలు సాగి [3]కరంబు భయంకరంబుగా
నెల్లెడఁ గ్రొత్తకావి సెలయేఱుల చెన్నొదగూడెనగ్గిరిన్? 102

క. దనుజేంద్ర మృత్యుకారణ
ఘన సంధ్యాసమయదీప్తిఁ గడు నొప్పిన య
వ్వినువీథితోడఁ బురుణిం
చినక్రియ మహి దైత్యరక్తసిక్తత నొప్పెన్. 103

క. నరహరి చల్లిన యసురే
శ్వరుశోణితశీకరములు వనపజ్క్తులపైఁ
దొరిఁగి నిరంతరపల్లవ
విరచితనూతనవసంతవిభ్రమ మొసఁగెన్. 104

క. పగయింతఁ గాని పోదని
తగదానవు మేనిశోణితపు వెల్లువనిం
పుగఁ దోఁగిరనఁగ నమరులుఁ
బ్రగుణేతరక్తాంగులైరి ప్రమదము పేర్మిన్. 105

1. బాసి. 2. వేల్వడి. 3. కరంబె.

తే. వీరనరసింహదేవుఁ డుద్వృత్తిఁ జెఱికి
పాఱవైచినఁ [1]బడియొప్పెఁ బగతుప్రోవు
లసురసంపద యను కాంత యఱుతనుండి
త్రెప్పి డోఁగిన హారంపుఁ దీవెలనఁగ. 106

క. శితనారసింహనఖరా
హతదైత్యమహీపసూపహారంబునఁ ద
ర్పితయయ్యె ననఁగఁ బరిశాం
తతనొందెఁ ద్రిలోకపీడ తత్క్షణమాత్రన్. 107

వ. ఆసమయంబున. 108

సీ. ఒండొండ వీడ్వడ నునిచినఁ బోలుపారు
పదములఁ బర్యంకబంధమమరఁ
దొడలపై నున్న దైత్యునిప్రేవులిరుదెసఁ
దివిచిరొత్తిన కరద్వితయ మమరఁ
గమనీయ శంఖచక్రప్రభాభాసురం
బై పెఱహస్తద్వయంబు నమర
దంష్ట్రాకరాళంబు దరళజిహ్వాయునగు
వదనంబులింత ? [2]యొప్పిదముచూపఁ

గీ. దీవ్రలోచనత్రయదీప్తి దీటుకొనఁగ
నిభృతకర్ణ కేసరకాంతి నివ్వటిల్ల
దివిజ సురముని ధ్యానవిధేయలీలఁ
దేజరిల్లె శ్రీనరసింహదేవమూర్తి. 109

1. బడియొప్పి. 2. యొప్పితము.

వ. అమ్మహామూర్తిఁ గనుంగొనుచు నాదిత్యులు నాదిమునులు ప్రహ్లాదపురస్సరంబుగా నభివందనము లొనరించుచు నంజలి పుటంబులు నిటలంబుల ఘటియించి యిట్లని వినుతించిరి.

దండకము.—

శ్రీనాథనాథా జగన్నాథ నమ్రైకరక్షాసమక్షా సరోజాక్ష సర్వాభివంద్యా మహానంద గోవింద నీవెందు నీవిశ్వదృశ్యప్రపంచంబునన్ నిండియుండొండ యంతర్బహిర్వ్యాప్తి శోభిల్లు నందంబు చిందమ్ములై మ్రోసి తేల్పన్ బరానందకందమ్ములామ్నాయబృందంబు లిట్లున్న నీయున్నరూపాత్మ రూపించు దీపించు నిక్కంబులే యింకఁ జొక్కంబులై చిక్క నీచిక్కు వాపంగ నేలా గురూక్త ప్రపన్నత్వనిష్ఠానుసంధానసంధూత సందేహులై యున్న నీ యున్నతస్థాన మెట్లైన నఁ జేయందునా [1]యెందు నెందున్ సురారాతిధామంబులున్ సోఁక కేరాకలందేక యేపాకమున్ గాక లోకాతిరేకామలాలోకమై యొప్పు లోకంబు నీలోక మాలోకనీయంబె నీలోకసామాన్యధర్మావబోధానురోధంబులన్ క్రోధకామాదులన్ దాఁకి యే చింతలన్ జెంతలన్ జేరఁగానీక యేకాంతికస్వాంతులై యుండువారుండువారందు నీదాఁక రాలేక లోలోర్మిడోలావలీకేలిలోలా జగన్మూల మూలాలవాలోల్లసత్సంవిదానంద నిష్యందసీమాసమారామరమ్యస్ఫురద్ధామ సత్యప్రకాశావకాశా గుణావేశ దేవేశ నీవిశ్రుతైశ్వర్యమోవిశ్వధుర్యం బవార్యంబ[2]నార్యుల్ సమాత్సర్యులై పూని దుర్బోధబోధా

1. యందు. 2. నార్యున్.

పగాధీశులోఁ గ్రుంగి పొంగారు మాయాతరంగోరుసంఘాత
సంఘట్టనం దూలి యే త్రోవలం దావులం బొంద కుద్దామదృ
ప్యగ్భవగ్రాహనిగ్రాహ్యులై పోదురవ్యక్త సువ్యక్త దివ్యా
కృతీ కృష్ణతృష్ణాపహాయోద్వృత్తివేలాయితాఖర్వయోగాప
యోగా మహాయోగినిర్ణేత నీతత్త్వమాద్యంబ నాద్యంత
మత్యంత మక్షోభమక్షీబ మక్షీణమక్లీబ మక్లేశ మవ్యాజ
మాజేయనిర్వాణసర్వస్వమూలంబు మూలంబు నున్మూల
మామూల మానస్వతంత్రీభవల్లోకశోకం(?) బవేలంబకాలంబ
కర్మంబు నిస్సీమశర్మంబు నిర్మాయధర్మంబు నిష్పంకలేశంబు
నిశ్శంకరూపంబు నిశ్శ్రేయసప్రత్యయోద్భూతిహేతుత్వ
సిద్ధంబు సిద్ధాంత సిద్ధార్థసంపాద మిట్లుండఁగా నేని నానాను
మానాదిబంధాత్ములున్ బుద్ధినైర్మల్యకల్యాణముం బొంద
కున్నారు దుశ్శాస్త్రశస్త్రక్షతప్రాము లుద్యుక్తశక్తిన్ మహా
భక్తిసంయుక్తులై సత్యసంవిత్సుధాసిక్తసూక్తుల్ భవత్పాద
పంకేరుహాభ్యర్చకై కూర్చు నీకూర్చువారై నిరాతంకకైం
కర్యసామ్రాజ్య సంపూజ్యతం బొల్చువారౌదురే యెల్ల
వారున్ ముకుందా సముద్రాంతరానందనందాత్మజానందక
క్రీడనాభ్యస్త హస్తాహతోద్వృత్త నిర్వృత్త నిర్వక్ర
చక్రానలజ్వాలికాహూతి దైతేయ సమ్రాట్పతంగా పతం
గాగ్ని కోటిప్రభాఖర్వ సర్వంకషోత్తేజ తేజోమయాకార
కారుణ్య గాఢోత్తరంగా విహంగాధినాథా పరోపక్రియా
దక్షరక్షాపరత్వంబు మీపాలు మాపాలు నీపాలన ప్రౌఢి
భావంబు భావించి సేవించు భావంబు భవ్యాగమవ్రాత
చౌర్యంబు కార్యంబుగాఁ గొన్న యన్నీచుమున్నీటఁ బెన్నీటఁ

బాతాళ[1]మూలంబునఁ గిట్టి వేపట్టి చెండాడి క్రీడాగసో త్సేకపాకంబుఁ గైకొన్న యన్నిర్ఝరోన్మానమీనావతార క్రియావిభ్రమంబుఁ బరిభ్రామ్యమాణస్ఫుటోత్తుంగశృంగ క్షతాకాశకూలంబు శైలంబు కవ్వంబు గరోద్వేల్లసత్కాలకాకోలకాలానలాభీలభోగంబు నాగంబు [2]వేత్రంబు చిత్రంబు వెం[3]పొందఁ బొంగారు నుజ్జృంభితాంభోధి కుంభంబునై నట్టి పెన్మోపుదీపెక్క నింపెక్క సంపద్యమానాత్మసంపత్కళానంద[4]తంద్రాలువై వొల్చునక్కూర్మమూర్తిత్వశిల్పంబు కల్పక్షయోద్వృత్తతోయంబులం జెంది పొందేదియందేదియుఁ దిక్కుదాఁగానమిం గ్రాఁగు పెన్నేల నన్నేలువాఁడిప్పుడిప్పాటులీలం గటాక్షించునో యంచుఁ బేరాస గూరంగనారంపుఁ జేర్మిం నడుంగేద నాబాలు క్రొవ్వాలుగోరం గడుం బ్రేమ నాలింగితుంజేసి వేతెంచి యిచ్ఛానురూపస్థితిం మిన్ను మన్నందమన్నించి నిష్పంకతాచిత్రవిద్యన్మనగపల్వలక్రోడ సంక్రీడ శీలించు నుత్తాలకోలస్వరూపావలేపంబునై పేర్చియుఁ [5]స్వర్భిదాకారఘోరాసురా[6]ధీశ వక్షస్థ్సలోద్వేల కీలార్కబాలార్కుచేలీలఁ త్రైలోక్యచేతస్స్ఫురద్ధ్వాంతముం ద్రోచి[7]రోచిష్ణువై యున్న [8]యీభవ్యదివ్యావతారోదయస్ఫూర్తి నాపూర్తమై యొప్పు నీయొప్పు మమ్మెప్డు రక్షించు లక్ష్మీశ యీశా నృసింహా నమస్తే నమస్తే నమస్తే నమః. 111

1. మూలంబులఁ. 2. వేత్రంబు. 3. పొందుఁ. 4. తంద్రాలువై.
5. స్వర్భిదాకార. 6. ధీర. 7. రోచిష్ణులై. 8. యాభవ్య.

చ. అని బహుభంగుల న్మునిసురావలి తన్నినుతించువాఙ్మయ
ధ్వనులు నభోదిగంతమిళితంబులుగా మదవేగవిస్ఫుర
ద్ఘనదితిసూనుకుంజర విదారణ దారుణ ఖేలనంబునం
దన నరసింహలీల వినుతస్థితి సార్థకమై తనర్చెఁగన్. 112

తే. వీరరౌద్రభయానకవిస్మయాఖ్య
రసములను బోధ్యభంగుల నెసక మెసఁగ
నఖిలభువనహృద్యంబుగ నవ్విభుండు
నిపుణవక్రతానటనంబు నిర్వహించు. 113

*క. తదనంతరంబ యయ్యు
న్మదఘోరవిజృంభణంబు [1]మాని వికాసం
బొదవఁగఁ బ్రహర్షసామ్ము
ఖ్యదయాసౌందర్యనూతనాకారుండై. 114

క. సితకమలదళంబులకుఁ
బ్రతియగు లోచనములందుఁ బ్రబలు ప్రసాద
స్మితరుచిజాలములు దిశా
ప్రతతిఁ బూర్ణేందురుచులభంగి వెలింగెన్. 115

వ. అయ్యాదిదేవుండు ప్రహ్లాదు నాలోకించి నిజ జనకుని జన
నంబు భక్తివిరహితం బయ్యె మమ్ముఁ గలయుటకు లెమ్మని
యంతరంగంబుతోడ నున్న యతనియాకారం బుపలక్షించి
నగుచు నిట్లనియె. 116

తే. తండ్రి యుఱక లేమికి విషాదంబు వలదు
కాలగతితోడ నతనికి మేలు గలుగుఁ

---

* ఈపద్యము వ్రాతప్రతిలో లేదు. 1. మాన.

బుత్రకృత్యంబు లెల్లను బూనినడపు
జనకునకుఁ దద్విభూతియు సంభవించు. 117

క. మెచ్చితి నిను నీకీపారఁ
బొచ్చెపుఁబలు కేల యింక బుధపూజిత! నీ
సచ్చరిత మిచట నచ్చపు
[1]టచ్చు మదీయప్రపత్తి కఖిలమునందున్. 118

క. దైతేయరాజ్యవిభవ
ఖ్యాతి యెసఁగ నీవు పెద్దకాలము భవ భో
[2]గాతిశయ మనాసక్తుఁడ
వై తగ భుజియించి పొందు మస్మత్పదమున్. 119

క. నాయెడ నసూయ చేసె
న్నీయయ్య యనంగ వలదు నిజ మితఁడును దో
షాయత్తుఁడు గాఁడు తుదిఁ
జేయుదు [3]నితనికిని బరమసిద్ధి కుమారా!. 120

ఉ. ఈవనరాసు[4] (లేకులమహీధరసప్తక) మీరవిందుతా
రావిభవంబు లెగగన మీదిశలుండెడునంతకాలముఁ
గోవిదకీర్తనోల్లసితఘోషణమై భవదాత్మభక్తిస
ద్భావవివేకపాకజనితం బగుపేర్మి ప్రసిద్ధి నొందెడున్. 121

వ. అని ప్రహ్లాదుం డాహ్లాదంబు నొందు కృపామ
ధురవచనంబు లుపచరించుచున్న యప్పరమాత్ము పరమ
వాత్సల్యవైభవంబునకుం బొంగి మహామునులును ననిమిషు

---

1. టచ్చు. 2. గాతిశయము నాసక్తుఁడవై. 3. నతనికిని. 4. వ్రాత ప్రతిలో లేదు. దరణ మీ-అని మాత్ర మున్నది.

లును జయజయశబ్దంబుల నద్దేవు నభినందించిరి. తదనంత
రంబ యయ్యంధజుఁ బ్రసాదదృష్టి నాలోకించి యజ్జగదీశ్వ
రుం డి ట్లనియె. ఈ మహానీయ స్థానంబు పరమమంగళంబై
నన్నుం దనయందు నునుపంగోరుచున్నయది. నా హృదయం
బునకు జూడ్కులు నిండం బ్రియంబు నొందెం గావున
నిమ్మహాశైలంబునందు యుండంగలవాఁడ మీరు మదీయ
బలం బహోబలశబ్దపూర్వకంబుగాఁ బ్రశంసించితిరి గావున
నీతీర్థం బహోబలనామధేయంబునఁ ద్రిభువనపావనంబై
వెలయుంగాత నాచేత నధిరూఢంబైన యిగ్గిరియును గరు
డాద్రియనం బ్రఖ్యాతివహించునని యానతిచ్చె నప్పు డగ్ర
భాగంబున. 122

ఉ. శ్రీకమనీయమూర్తి నరసింహపదాంబుజసేవఁ గోరిమం
దాకిని ధాత్రి మీఁది కవతార [1] మొనర్చె నిజాంగలీల న
స్తోకతరంగసంఘములతో సవదాలిమనోజ్ఞపంకజా
త్యేకముతో లసచ్ఛిశిరసేకమనోజ్ఞమహోత్సవంబుతోన్. 123

వ. అమ్మహానది కొలువు సైకొనియె నాదేవుండు (దాని) భవ
నాశినీసమాహ్వయం బని యభినందించె, నింద్రాదిసురలును
ప్రహ్లాదప్రముఖులును గొనియాడిరి. తదనంతరంబ తత్ప్ర
దేశంబునఁ బున్నాగ నాగకేసర సరళ రసాల తాల హిం
తాల తమాల నారికేళ నారంగ మాతులుంగ లవంగ లికుచ
క్రముక కుటజ నిచుల చందన చంపక వకుళ కురువ కాశోక
శమ్యాక శమీక మధూక మాధవీతిలక తింత్రిణీ నింబ

1. మొనర్చె.

జంబూ జంబీర పనస హారిభద్ర భద్రదారు దాడిమీ సుమనో మల్లికా మరువకతులసీ ప్రముఖ వివిధ తరు లతాల కృతంబును నిరంతర వసంతవాసభవనంబును నగువనంబునం దుండి. 124

సీ. నిండారుచందురు నెరసుఁ గొండొక జేసి
మిగులఁ జెన్నొందిన నగు మొగంబు
వెలిదమ్మిరేకుల చెలువు మాయించి యు
గ్గడువుగ బెలసిన కన్నుగవయుఁ
*గనకకుంభములఁ జుల్కలుచేసి యొంతయుఁ
గ్రొవ్వాడి ప్రేఁగైన కుచయుగంబుఁ
గెందలిరాకులయందంబు వెసఁ జించి
రంజిల్ల మెఱయు కరద్వయంబుఁ

గీ. గలిగి సర్వలక్షణశుభాకారలీల
విమల[1]భూషాంబరోజ్జ్వలవేష మమర
నాదిలక్ష్మియు సకల లోకైకమాత
యమ్మహామూర్తిఁ జేరంగ నరుగుదెంచె. 125

ఉ. శాంతియుఁ [2]దుష్టియుఁ ధృతియు సన్మతియుఁ మొదలైన నెచ్చెలుల్, సంతతభక్తిఁ దన్గొలువ సంయమిదేవగణంబు లద్భుతా, క్రాంతకుతూహలస్ఫురణఁ గన్గొనుచుండఁగ నట్లు

* "మెఱుఁగెక్కు పవడంబు నొఱపుఁ జేకొన, కనుమ్ము దేతెసు పల్ల వాధరంబు." అని యొకపాఠము. వ్రా. ప్ర. యం దధికముగాఁ గలదు.

1. భూషణాంబ. 2. దృష్టియుఁ.

వచ్చి శ్రీకాంత ముకుందునంకతటిఁ గై కొనియెన్ సవిలాస
ఖేలతన్. 126

ఉ. కోరిక లంకురింపఁ దనకూర్మి నితంబిని యూరుపీఠముల్
జేరిన మేన నెల్లెడలఁ జెన్నలరన్ బులకంబు లొక్కుమై
నీరిక లెత్తఁ గన్నులకు నెక్కుడుచాయలు సెంద నవ్వానిం
డార మొగంబునం బెలయనప్పరమేశ్వరుఁ డొప్పె[1]నెంతయున్.

క. ఆలక్ష్మీపతి యాకృతి
యాలోకంబులను నంత రాలోకములన్
గ్రోలుచు నానందాంబుధిఁ
దేలుచునుండిరి మునీంద్ర దివిజ ప్రవరుల్. 128

వ. అమ్మహాలక్ష్మీనివాసం బైనయారమణీయోద్యానంబును లక్ష్మీ
వనం బను పేర నమరులచేతన్ గీర్తితంబయ్యె నాతఁడంబ
వేదంబులునాల్గును సాకారంబులై తత్సమీపశైలంబున నవ
తరించి సపరించి చనుదెంచి లక్ష్మీనరసింహు ననేక ప్రకా
రంబులన్ బ్రస్తుతించె నది కారణంబుగా మును లాశైలం
బునకు వేదాద్రి యను నభిధానంబొనరించి కొనియాడి రిట్లు
లక్ష్మీసమేతుండై యానృసింహదేవుండు తేజః ప్రసాదోల్లాస
దేదీప్యమానదేహుండగుచున్న యవసరంబున. 129

మ. సుతలక్ష్మీవనపుష్పసౌరభముల [2]నొంపారి లోలోర్మి [3]సం
గతిరంగద్ఘనాశినీసలిలసేకస్వైరశీతాత్ముఁ డై
యతులోద్యన్మృదులీల మందపవనుం డబ్జాక్షసేవాసమా
గతదేవద్విజకోటిచిత్తములకుం గావించె నాహ్లాదమున్. 130

---

1. నంతయున్. 2. నొప్పారి. 3. సంగత.

సీ. కిన్నరగంధర్వగీతనాదంబులు
వింతచందంబున విస్తరిల్లె
దివ్యదోఃప్రహతవాదిత్రఘోషంబులు
చిత్రరూఢంబులై చెన్నుమీఱె
నమరకాంతల లసదభినయోల్లాసంబు
లభినవన్యాసంబు లమరఁ[1]బేర్చెఁ
గల్పభూరుహపుష్ప కమనీయవృష్టి య
పూర్వసౌరభములఁ బొల్పుమిగులె

గీ. ప్రమదములు నిండెఁ బావనప్రతిభ నెఱసె
నఖిలకల్యాణభంగులు నతిశయిల్లెఁ
గరుణ నరసింహదేవుండు చిరతరముగఁ
దగిలి శ్రీమదహోబలస్థాయియైన. 131

వ. తదనంతరంబ. 132

చ. సనకసనందనాదియతిసంఘము నత్రిమరీచు లాదిగాఁ
దనరు విధాతలున్ బ్రకటధర్మతపోవ్రతనిత్యకీర్తులున్
మనువులుఁ దోడరా భువనమాన్యుఁడు పద్మజుఁ డేగుదెంచె న
వ్వనరుహనాభు భక్తజనవత్సలు భక్తి భజించువేడుకన్. 133

వ. మఱియును మేరుమందరహిమవద్వింధ్యనిషధ హేమకూట కైలాసచక్రవాళాది శైలంబులును గంగాయమునా నర్మదా మహానదులును ప్రభాసపుష్కరప్రయాగసాలగ్రామ గయా వటకాశ్మీరకాలంజరకేదారాది మహాతీర్థంబులును గాశీక్షేత్ర కురుక్షేత్రాది పుణ్యక్షేత్రంబులును పుష్కరారణ్యదండ

1. పేర్చె.

కారణ్య నైమిశారణ్యాద్యరణ్యంబులును లవణోదక శుద్ధోద[1]కాదిసాగరంబులును జంబూప్లక్షశాల్మలాదిమహాద్వీపంబులును నగ్నిష్టోమ వాజపేయాతిరాత్ర[2]హయమేధాదిమహాధ్వరంబులును యమనియమాదియోగాంగంబులును మహాపద్మశంఖమకరకచ్ఛపాదిమహానిధులును నహోరాత్రపక్షమాసర్త్వయనసంవత్సరాదికాల విశేషంబులును భూలోకభువర్లోకాదిలోకంబులును దిగ్విదిగ్గగనంబులును కమనీయాకారంబులుధరియించి యయ్యాదిదేవుంగొలువ నావిర్భవించె. వసురుద్రమరుదశ్వి[3]విశ్వేదేవాది దేవగణంబుల జయజయశబ్దంబులును బరమయోగీంద్రమునీంద్రనివహంబుల సాధువాదంబులును బ్రహ్మాదనారదప్రముఖభక్తజనంబుల నిరంతరస్తోత్రనాదంబులును బ్రహ్మేంద్రమరుత్ప్రజాపతులమహాప్రసాదాభినందనధ్వనులును గిన్నరవీణాస్వనంబులును భరతాదులయాతోద్యనినదంబులును గలసి బ్రహ్మాండకటాహంబు పూరించె నివ్విధంబున నభినవస్వర్గంబనం దగి యపరబ్రహ్మలోకంబు నా నొప్పారి ద్వితీయ వైకుంఠం బనం బరఁగి యహోబలంబు సకలకల్యాణంబులకు జన్మభూమియు సమస్తసంపదలకు నాస్పదంబును నఖిలధర్మంబులకు నాధారంబును బరమభాగవతైశ్వర్యంబులకు నిత్యనివాసంబును నై ప్రకాశించుచుండె నట్టియెడ. 134

క. తనబింబము వేలోకలై
వెనుఁబొందినయట్లు మెఱయు వెలిగొడుగు ప్రియం

1. కాద్యాది. 2. హయమేధాది. 3. విశ్వధ్యాధి

బునఁ బట్టెనమృత కిరణుం
దనుపమతేజున కహోబలాధీశునకున్. 135

చ. ఇరుదెస నబ్ధినాథుఁడు సమీరుఁడు కాంచనదారు[1]దండచా
మరములుదాల్చి తన్మృదులమారుతలీలఁ జతుర్భుజాంక సు
స్థిరయగునిందిరారమణి శ్రీకరకుంతలభారచారువ
ల్లరులకు నూత్నరత్నవిలాసము లిచ్చుచునుండి రచ్చటన్

ఉ. ముందట వైనతేయుఁడు సముజ్జ్వలనూతనపక్షమాలికా
సుందరమేరు[2]శైలమన సొంపగునున్నతిఁ జేర్చియుక్ భయా
స్పందితమానసోల్లసితభక్తిపరానతమూర్తియై జగ
ద్వందితునయ్యహోబలనివాసు భజించె నృసింహదేవునిన్.

శా. ఏకాలంబును రా నెఱుంగరు మనం బేకాంతవిజ్ఞానకే
లీకాంతంబుగ నల్లసిల్లుదురు పాలింతుర్ జగజ్జాలముక్
వైకుంఠస్థిరవాసు లట్టి ఘనకైవల్యాధ్యుల్యులుక్ వచ్చిరా
లోకస్వామి నహోబలేశ్వరుఁ గృపాలోలాత్ము సేవింపఁగన్.

వ. ఇట్లు పరమమహోత్సవంబై యున్న లక్ష్మీనరసింహు పేరోల
గంబున మౌనీంద్రులును యోగీంద్రులును సురేంద్రులును
సాంద్రానందసందోహసుందరాకారులును, భక్తివినయసం
భావగంభీరులును గరపుటకమ్రఫాలతలస్ఫారులునగుచుండ
నఖండితైశ్వర్యధుర్యుండును ప్రసిద్ధభాషాచాతుర్యుండును
లక్ష్మీశదయాలాభోన్ముఖుండును నైన చతుర్ముఖుండు కృతాం
జలియై యాదేవదేవున కిట్లనియె. 139

1. చండ. 2. శైలమున.

ఉ. ఆగమతత్త్వవాచ్యుఁడ వనంతయశోబల ధర్మ*వాఙ్మయా
యోగరమాసమగ్రుఁడవు యోగిమనస్సరసీపరిస్ఫుర
ద్భోగమరాళనాథుఁడవు దుర్దమదోర్గ్బలదారితారి వ
[1]క్షోగణితప్రదీప్తనఖశోభనమూర్తి వహోబలాధిపా! 140

క. నీకృప నీవిక్రమరస
పాకము నీకేళిలీల ప్రస్తుతిసేయన్
నాకు వశంబె దయాకర!
శ్రీకర! నరసింహా! గుణవశీకృతలోకా! 141

సీ. దైత్యుని యత్యుగ్రతపమున [2]కిచ్చిన
కోఱగామి నాయందు నెఱయఁగలదు
క్రొవ్వి యయ్యసుర యక్కోలఁదుల నిలువక
చేసిన తప్పును జెప్పఁ బెద్ద
బాములన్నియుఁ బడి నామీఁద నొలయక
యున్న వేల్పుల తాల్మి యొప్పఁ బొగడ
దిక్కెవ్వరును లేనిదీనుల సురలఁ గై
కొన్న నీకరుణకు గుఱుతుగలదె

ఆ. పగతు దునుమ నీవు పన్నిన మతములు
దెలుప నుగ్గడింపఁ దరమె దేవ!
భక్తివిభవసులభ! ప్రహ్లాదవరద! ల
క్ష్మీనృసింహా! నిగమశిఖరిసింహా! 142

చ. [3]అసురులె సంగి నప్పు డమరావళిఁ గ్రుంగిన యప్డు ధర్మముల్
వసమఱి తూలినప్పు డపవర్గము వ్రాలినయప్డు దోఃకళా

* వాఙ్మయీ. 1. క్షోణిగణితా. 2. కించిన. 3. అసురులు వంగి నప్పు

రసికశుభావతారములఁ బ్రస్తుతి పొందుదు విశ్వరక్షణా
వ్యసనమతిన్ జతుర్యుగములందును నీకృప యిట్లు శ్రీనిధీ!

క. ఆపదయగుచో నెందును
రూపించిన నంద [1]కలిగి రూపుగ భక్తుం
జేపట్టుదు నీ సరిగా
నోపునె యేదైవములు నహోబలనిలయా! 144

ఉ. నేరనివార మేమిటికి నిక్కము నీగుణరూపచింతకు
న్నేరము పెద్దయున్నియమనిష్ఠయు భక్తియుఁ బూని సల్పఁగా
నేరము మమ్ము నివ్విధము నేరమి చూడక యాశ్రితైకర
క్షారతబుద్ధివై కరుణఁగావు మహోబలతీర్థనాయకా! 145

వ. అని యిట్లు భారతీవల్లభుండు సల్లాపరూపంబుగా నభిరూ
పార్థసంస్తవంబు గావించినఁ గారుణ్యతరంగితాంతరంగుఁడై
దేవతాసింహుం డగు లక్ష్మీనరసింహుం డప్పితామహు దెస
మధురస్మితవికాసభాసురంబులుగా నాలోకించి యిట్లనియె.

సీ. మునుల తీవ్రపుశాపమునఁ జేసి మత్ప్రతి
హారులు దితిసూనులై జనించి
[2]రంధ్రజుఁడు హిరణ్యకశిపుఁ డభిహతుఁ
డయ్యె హిరణ్యాక్షుఁ డనుజుఁ డింక
నాదివరాహరూపాస్మదీయోగ్రతే
జంబుచేతన యుపశాంతిఁ బొందు
వినుము త్రేతాయుగంబున వీర రావణ
కుంభకర్ణాఖ్యరక్షోవరేణ్యు

---

1. కలఁగి. 2. రంధ్రజుండు హిరణ్యకశిపుఁ డభిహతుఁడై

గీ. లై సముద్భవ మందుదు రపుడు నేను
నవతరించి జయింతు మూఁడవయుగంబు
నందు శిశుపాలదంతవక్త్రాఖ్యఁబుట్టి
పడయుదురు మీరు మద్భావ భవ్యపదము 147

వ. అని యానతిచ్చి యిట్లను నహోబలనామధేయంబున నిమ్మహా తీర్థంబు మదీయనివాసంబై నేఁడుమొదలుగాఁ ద్రిభువన పూజనీయత్వంబునం బొగడొందు నిప్పుడు మత్సేవోత్సవం బునకుం జనుదెంచిన యియ్యమరగణంబును నిమ్మునిసముద యంబులును సాదర ద్వీపాదివిశేషంబులునుంగూడ నిన్నియు నిచ్చోటన నిరంతరంబును సన్నిధి చేసి యుండునది యిది [1]యస్మద్ధీయాజ్ఞాపనంబు. 148

చ. సకలసురైక[2]వాసమును సర్వమునీంద్రమయంబు విశ్వతీ ర్థకలితమున్ సమస్తసుకృతప్రభవంబును నై త్రిలోకదీ పకమగు నీయహోబలము భక్తి యెలర్ప భజించు నంచితా త్మకులకు నెల్లతీర్థములుఁ దథ్యముగా సమకూరు నెప్పుడున్.

సీ. విషువద్దినములరవిగ్రహసోమగ్ర
హణములఁ బున్నమనమవసలను
హరిదివసముల జయంతి బారసి వెండి
యును బేరుకల పుణ్యయుక్తతిథుల
భక్తి నేతెంచి యీభవనాశినీమహా
నదిలోన నభిషేచనంబు సల్పి

1. యస్మదీయవిజ్ఞాపనంబు. 2. వాసమగు.

గరుడాద్రికందర స్థిరమందరంబునఁ
బొలుపారు నన్నహోబలపురీశుఁ

ఆ. గొలుచువారు పుణ్యముల కెల్లఁ గుదురైన
వారు నన్ను నెపుడు వలచువారు
వలతు నెపుడు నేను వారికివారికి
నే నొనర్చు టరయ రెట్టివారు. 150

మ. భవరోగంబుల కౌషధంబు భవపాపజ్వాలకుఁ వైరి దు
ర్భవపంకప్రవిశోధనంబు భవభావస్ఫారతృష్ణాహరం
బవిరోధంబకలంకమక్షయరసోదాత్తంబు భక్తప్రియో
త్సవమొందుఁ భవనాశినీజలము నిత్యస్తుత్య మిష్టైదినిన్.

క. భవనాశిని భవనాశిని
భవనాశిని యనుచుఁబలుకు భక్తజనులకుఁ
భవనాశిని భవనాశిని
యవుటకు భువియందు సందియంబును గలదే. 152

ఉ. నాకరుణారసంబుభవనాశిని నాన వినాశనాకృతిఁ
శ్రీకరవాహినీ[1]తనుతఁ జేకొని నాకమనుష్యలోకద
రీకరగేహగాహితపవిత్ర[2]జలౌఘమునఁ మహాజన
శ్లోకితయైతనర్చునతిలోక విలోకసుపాకభవ్యతన్. 153

సీ. అసురాంగనాకుంకుమాంగభాగంబున
నరుణోదయచ్ఛాయ నమరునెడలు
మునివర నియమనిర్వర్తకశాశ్వత
ములఁ దెట్టువలుగట్టి పొలుచునెడలు

1. తనుజ. 2. గుణౌఘమునఁ.

శబరికా శ్రవణప్రశస్తబర్హిచ్ఛద
చిత్రితోర్వుల విలసిల్లునెడలు
మదకలకాంతార మాతంగమదజలో
ద్వేలాంబువుల నిగ్గుదేఱు నెడలు

గీ. నగుచుఁ బ్రతిదివసంబును నతినవంపు
టొప్పిదంబులు దనుఁ[1]జెంద నుల్లసిల్లు
సకలకళ్యాణ కాలీనసత్ప్రవాహ
భవ్య యీభవనాశినీపరమతటిని. 154

ఉ. ఈవనధిప్రసూతయును నేనును నింపెసలార వేడ్కమై
నీవనమధ్యభాగమున నెప్డు చరింతుము దానఁజేసి ల
క్ష్మీవననామ మివ్వనము శ్రీరమణీయము లోకపావనం
బావనజాప్తచంద్రవసుధాంబరసుస్థిరమిజ్జగంబులన్. 155

క. తనుఁదలఁచినఁ దనుఁజూచినఁ
దనుఁజెందిన తనుసమంచితస్తోత్రములన్
గొనియాడిన లక్ష్మీవన
మనుపమ సకలార్థసారమగు జనములకున్. 156

సీ. భవభానుతీవ్రతాపంబునఁ బడనీదు
తనతరుశాఖల [3]తనుపునీడ
దుఃఖవాసనములఁ ద్రోలఁగించుఁ దనలతా
వరపుష్పశోభితవాసములను
దనతనుగాలిసోఁకునఁ జాలఁజిగురొత్తుఁ
జతురమనోజ్ఞవిజ్ఞానలతలు

1. జెందె. 2. కాలీన. 3. తనువు.

వనవిహంగములు యనుఁగు బెలుంగు లా
హ్వానంబు సేయు కై వల్యఖగము

గీ. ననినఁ బొగడ నలవియగునె యహోబల
భూషణంబు సుకృతపోషణంబు
సాత్త్వికప్రియంబు సర్వాశ్రయంబు ల
క్ష్మీవనంబు భువనపావనంబు. 157

ఉ. [1]ఈవిపినంబుఁ గమ్మవిరు లిందిర[2]కుమ్ముడి కీపరాగముల్
శ్రీవదనాబ్జవాసనకుఁ జెన్నగు నీవనపల్లవంబు ప
ద్మావిలసత్పదంబుగరిమంబున కెందును దాన (?) మేని ల
క్ష్మీవనమంచు సంస్మృతులు సేయుదు రర్థిసమస్తలోకముల్.

క. ఈ వేదశైల మమరఁగ
నా వేదశిఖాగ్రవర్తి యగు నఁగను వి
ద్యావిభవము సాధులకుఁ
గావించుచునుండుఁ దన్నుఁ గని కొల్వంగన్. 159

క. వేదనగమఖిలకల్మష
[3]వేదవినోదమును వేదవేదాంగవిధా
వేదితము [4]నిఖిలభవని
ర్వేదాది [5]విధుతివివేకవేద్యము ధాత్రిన్. 160

ఉ. ఆగమ[6]శైలశృంగములయందు మృగేంద్రసకృద్విభూతి నే
[7]నీగతి నొప్పుదు న్మహిమ యింపుగ శ్రీనరసింహమూర్తి లీ
లాగరిమంబునం దనరులాగున[8]నిట్టిద దీనిమౌళి[9]యి
ట్టీగరుడాద్రి పేర్మి నుతియింపఁగ శక్యమె యెట్టివారికిన్. 161

1. ఈవలితంపుగమ్మవిరు. 2. క్రొమ్ముడి. 3. వేదవినోదమున. 4. విసర
భవ. 5. విదిత. 6. శృంగశైల. 7. నేగతి. 8. నిట్టిద. 9. యు.

క. గరుడాద్రి దురితవిషధర
గరుడాకృతిసిద్ధసాధ్యగంధర్వమరు
ద్గరుడాసేవ్యం బుజ్జ్వల
గరుడాయిత మస్మదీయకరస్థితికిన్. 162

ఉ. భాసురభానుభానునిభ భావిభవుర్ గరుడాద్రిదివ్యసిం
హాసను నన్ను నున్న తదయార్ద్రి మహాబలతీర్థనాథుల
శ్శ్రీసము పేతుఁ జాగుననసింహశరీరు భజించు నుత్తముల్
వే సకలార్థసార్థసుఖవీథులఁ గ్రాలుదు రెల్లకాలమున్. 163

వ. మఱియు నీయహోబలంబు సమస్తతీర్థసారంబు గావున నిందులఁదీర్థంబుల వివరింపనుం దత్ఫలంబు భూషింపనుం బహుతరంబైన కాలంబు వలయుఁ గృతత్రేతాద్వాపరకలి యుగంబుల నిమ్మహాతీర్థంబుమీఁదఁ దాత్పర్యంబు లేక నన్నుఁ గొల్వక యథేష్టచరితు లగుదురు భాగ్యంబున నెవ్వరేని యచ్చటికి వచ్చి భయభక్తి విశ్వాసంబులతో మదీయసేవా సక్తులయిన వారలు సకల మనోరథంబులు సఫలంబులుం గాఁగని దివిజులకుం బడయరాని యస్మదీయలోకాభిగమ నంబుఁ బడయుదురు. ఇది పరమరహస్యంబు. త్రైలోక్య హితార్థంబుగా నెఱింగించితి నని వెండియు నిట్లనియె. 164

క. విను కలియుగమున మానవు
లనయము నాస్తికులు దృష్టమైనది దెలియం
గనుఁగొనియు నమ్మరనియే
నొనరించితి ప్రత్యయంబు లొకకొన్ని గృపన్. 165

సీ. సంతానకాంక్షులై యెంతయుఁ జింతిల్లు
కాంతలు పురుషులు గలిగిరేని

చేరి జయార్థులై బీరంబు మిగులంగఁ
గడఁగెడు రాజులు గలిగిరేని
యధికరోగార్తులై యారోగ్యసంసిద్ధి
గావింప వెజ్జులు గలిగిరేని
బహువిపన్మగ్నులై పారంబు గానక
కలఁగెడు దీనులు కలిగిరేని

గీ. వారువారువారువారును భక్తియు
నమ్మికయును నెమ్మనముల మిగుల
ననుసహోబలేశు నరసింహదేవునిఁ
గొలిచి కాంతు రెల్లకోరికలును. 166

క. కన్నులు జాత్యంధునకుఁ
గన్నియకును జారుభర్త గర్భిణికి సుతుం
డున్నతవిద్య విమూఢున
కు స్నిజముగ నమ్మి నన్నుఁగొలిచిన నాదవున్. 167

క. నరహరి యహోబలేశ్వర
శరణంబగు మనుచుఁ బలుక సర్వావస్థాం
తరముల నెప్పుడు నతనికిఁ
[1]గరస్థములు భుక్తిముక్తికళ్యాణంబుల్. 168

సీ. క్షీరాబ్ధిభవనంబు శ్రీపురుషోత్తమం
బాదికేశవ మనంతాలయంబు
శ్రీకాంచిపురిహరిక్షేత్రంబు మధుర శ్రీ
ద్వారక శ్రీరంగభూరిపదము

---

1. కరస్థలము.

శ్రీకూర్మసదనంబు సింహాచలంబును
నాదివరాహసమాశ్రయంబు
మాధవాఖ్యంబు గదాధరనిలయంబు
బదరీవనము శార్ఙ్గపాణిగృహము

గీ. మొదలుగాఁ ద్రిలోకవిదితంబు లగు మహా
స్థానములును సుజనసంస్తవముల
నొప్పుఁగాని నా కహోబలతీర్థంబు
పగిది నధికవల్లభములు గావు. 169

ఉ. ఏదివసంబునందయిన నెమ్మెయినైనను నెవ్వఁడైన న
త్యాదరవృత్తి భక్తిమతియై చనుదెంచి యహోబలేశు న
న్నాదిమదైవతంబు గనినట్టిమహాత్ముఁడు సిద్ధసౌఖ్యస
మ్మోదమునొందు నెంతయు నమోఘము నాపలుకంబుజాసనా.

వ. విశేషించి మద్భక్తజనంబులును వసంతమహోత్సవంబు మిగులం బాటించి కొలువం గోరునప్పు డేను బ్రసన్నుండనై సేవకు మనోరథార్థంబులు నెరపుదు నమరాసురసంయమిసిద్ధ సాధ్యగంధర్వాదులు దమ యిష్టసిద్ధ్యర్థంబు వసంతయాత్రా ప్రసంగంబునం జనుదెంచి నన్ను నారాధించెద రాసమయంబున మర్త్య లమర్త్యులను భేదంబు దోఁపక సర్వంబును దేవతామయంబయ్యె నిప్పటిమహోత్సవం బిట్లొప్పినయట్లు వసంతోత్సవంబు నాకు మనఃప్రియంబై యుండు. 171

చ. అమరవసంతయాత్ర నఖిలావనిమండలిమధ్యవాసులుఁ
దమతమకల్మి భూజను లుదాత్తవిభూషణపత్రగంధమా

ల్యములు నొనర్చువారలు నుపాయనసంచయ మిచ్చువారునై
ప్రమదముతో నొనర్తురు కృపానిధి నన్ను[1]నహోబలేశ్వరున్ ?

ఉ. అట్టివసంతయాత్రఁ గొనియాడినవానిని రిత్త నెన్నఁడుం
బుట్టువు చావు నొందని ప్రభుత్వము వైష్ణవరాజ్యలీలఁ గం
గట్టుదుఁ బట్ట ముజ్జ్వలవికాసకృపాకమనీయబుద్ధి మైఁ
జుట్టలు వీరునాకు నని చూతుఁ జిరంబుగ నేను వారలన్.

గీ. హేమరత్నరజతభూమికన్యాదిక
దానములును సద్వ్రతక్రియలును
[2]నొకటికోటి ఫలము నొసఁగు నహోబల
తీర్థమున నొనర్చు ధీనిధులకు. 174

క. తపములు పితృకార్యంబులు
నుపవాసంబులును నియ్యహోబలమున ని
ష్కపుభక్తి [3]ననుష్ఠింప న
నుపమంబగు తీర్థఫలము లొందఁగఁగలుగున్. 175

సీ. అనవరతంబును నస్మదీయధ్యాన
శీలురై బుద్ధిరంజిల్లువారు
చక్రాంకతులసీవిశాలసాలగ్రామ
సేవ నస్మత్ప్రీతి సేయువారు
నతిభక్తి మచ్ఛరణాగతజనులను
గొనియాడి వేడుకఁ దనరువారు
మామకదివ్యనామస్తోత్రసంసక్తి
నానందపరత నింపారువారు

1. నిన్ను. 2. నొకటి నొకటి. 3. ననుష్ఠింపఁగ.

గీ. చేరి కొల్చువారు శ్రీమదహోబల
తీర్థనాథు దేవదేవు నన్ను
వారు భుక్తిముక్తివైభవభాగులు
వారు పుణ్యధనులు వారు ఘనులు. 176

క. యతులును సాత్త్వికులును సా
త్వతులును చక్రాంకభాగవతులును నిత్య
వ్రతులు నహోబలతీర్థ
స్థితు నరసింహాత్ము నను భజింపఁగ నర్హుల్. 177

శా. వేదార్థప్రతిపాలనైకనిపుణుల్ విప్రోత్తముల్ సత్కథా
స్వాదప్రీతులు భూపతుల్ గుణవశుల్ వైశ్యుల్ నిజాచార
సం, వేదుల్ తక్కటివారునుం గలియుగావిర్భావకాలంబునన్
వేదాతీతు నహోబలేశు నను సేవింపంగఁ బాత్రుల్ మహిన్.

ఉ. వారలకెల్ల కల్మషనివారిణియై మహనీయసంపుటా
కారిణియై విముక్తపదకారిణియై విలసిల్లుచుండు మ
త్కారుణికత్వలీల విను కష్టపుజాతియు నన్నహోబల
స్ఫారనివాసుఁ జేరి కనుఁ బ్రాజ్ఞనిషేవితపుణ్యలోకముల్.

ఉ. మానవకోటికింక [1]ననుమానము లేల విముక్తికల్మి వి
జ్ఞానవిహీనపక్షిపశుజాతములున్ దిటినీమహీధ్రముల్
మ్రానును రాయి లోనగు సమస్తచరాచరజంతుజాలమున్
బూని పునర్భవాతురత [2]బొంద నహోబలతీర్థవాసతన్. 180

1. ననుమానము. 2. బొందునహోబల.

తే. విను మహోబలతీర్థపవిత్రసేవ
యందు రుచి యొల్లవారికిఁ బొందనీను
మాయగావింతుఁ గష్టపు మానవులకు
దానఁ జెడుదురు మాత్సర్యదర్పనిరతి. 181

చ. అనితరతత్త్వశీలురగు నట్టి మహాత్ములు మాయ చేయు త్రి
ప్పునఁబడిపోక భక్తియుతభూతదయాకలితాంతరంగులై
యనఘు ననంతు నచ్యుతు ననాది నతర్క్యు నహోబలేశు న
న్ననుపమునారసింహుమహితాత్ము భజింతురు నిత్యధన్యులై.

తే. నీవు మద్భక్తుఁడవు మునిదేవసమితి
కెల్లఁ గురుఁడవు గావున నేను నీకు
నధికగోప్యంబు విబుధరూప్యంబునైన
సిద్ధమంత్రంబుఁ జెప్పెద చిత్తగింపు. 183

చ. ఇలఁగల పుణ్యతీర్థముల కెల్ల నహోబల మెక్కుడై తలం
పలవడఁజేయు మామకము లై చనుభూత భవద్భవిష్యద
త్యలఘుతరావతారముల కన్నిటికిన్ నరసింహమూర్తి య
గ్గలముగఁజూడు మివ్విధమ కాగనుమీశ్రుతిశాస్త్రవీథులన్.

చ. అని పరమాత్ముఁ డిట్లు పరమార్థకథాగసలీల వీనులన్
దనియఁగఁ గ్రోల్చినం దగ పితామహుఁ డుద్గతసమ్మదాశ్రులో
చనుఁడుఁ బరిస్ఫురత్పులకచారుశరీరుఁడు నై సురారిభం
జను నరసింహు శ్రీరమణు సన్నుతిలో నునిచెన్ దిరంబుగన్.

క. సురలు మునీంద్రులు నానం
దరసాబ్ధినిఁ దేలుచును సుదర్శనలక్ష్మీ
నరసింహమూర్తిమీఁదం
బరఁగించిరి తమ సమస్తభావము భక్తిన్. 186

వ. మఱియు సిద్ధసాధ్యచారణగంధర్వాదులును బరమరసావేశం
బునం దదాకారంబు గనుంగొనుచుం గౌతుకాశ్చర్యభక్తి
భరితభావంబులతోడ జయజయశబ్దతత్పరులై యుండిరి. లక్ష్మీ
నరసింహదేవుండును బ్రహ్మాదు నఖిలదానవకులైశ్వర్య
ధుర్యుఁగా నభిషేచనంబు చేసిన నతండును సాష్టాంగదండ
ప్రణామంబులతోడ బహువిధస్తోత్రపవిత్రార్చన లొనర్చినం
బ్రసాదమధురాలోకనంబు లతనిపై నొలయ నప్పరమేశ్వ
రుండు వరంబడుగుమనిన నమ్మహాత్ముం డిట్లని విన్నవించె. 187

క. ఏజన్మమున జనించిన
నాజన్మమునందు నీసమంచితచరణాం
భోజంబులపై [1]విగత
వ్యాజమయిన భక్తి భక్తవత్సల! యీవే. 188

క. ఖలులకు సంసారముపైఁ
గల వేడుకఁ బాపి మోక్షగరిమము గూర్పఁగ
వెలయవలయు నీమహిమలు
దలఁపుచు ని ట్లున్న నాదు తలఁపున వరదా! 189

వ. అనినం బ్రసన్నుండై భక్తవత్సలుం డిట్లనాను గ్రహించితి
నీవు యోగీంద్రులకు మద్భక్తజనంబులకునుం బ్రాజ్ఞజనంబు

---

1. విజిత.

లన్నియు (?) నీయరచేతిలోనివి మదీయసాలోక్యసారూప్య
సామీప్యసాయుజ్యసిద్ధులుఁ గ్రమంబునఁ బొందఁగలవాఁ
డవ యని యానతిచ్చి మఱియు ని ట్లనియె. 190

సీ. అధికబోధమ్మున నస్మత్పదాంబుజ
భక్తిరసంబునఁ బ్రకటమైన
నీమహానీయ వినిశ్చలచరితంబు
సంప్రీతి నేప్రొద్దు చదువువారు
వినువారు జనులకు వినిపించువారును
సకలకల్మషసముచ్చయము ద్రోచి
యాయురారోగ్యపుత్రార్థసమృద్ధులఁ
బొంది మద్భక్తి సొంపున వహింతు

గీ. [1]రన్యులు బడయరానియునాత్త నిత్య
పదము బడయుదు రానందభాగులగుచు
సర్వపూజనీయం బగు సాధుహితము
వాచకంబు మన్మహిమకు వాఙ్మయంబు. 191

క. అని యానతిచ్చి త్రిజగ
జ్జనకుఁడు ప్రహ్లాదదేవుఁ జరితార్థునిగా
నొనరించి విశ్వలోకము
ననిశము రక్షించుచుండె నధికప్రీతిన్. 192

చ. [2]సమధికభక్తియుక్తుఁడయి శార్ఙ్గి భజించు నరుండు సంతత
స్థిమితయశోవిలాసుఁడయి చెన్నలరారెడు భోగభాగ్యదు

---

1. రన్యులకుఁ. 2. ఇట వ్రాతప్రతియందు. చం. స... అని మాత్ర మున్నది. క్రిందిదంతయుఁ వెనుక యొరులచేఁ బూర్తిచేయఁబడినట్టున్నది.

ర్దము విభవంబుమై సుకృతి తద్దయుఁగాంచుచు మర్త్యలోకని
ర్గమనమునాఁడు విష్ణుసుపకంఠము నొందు వినిశ్చలంబుగన్.

క. అని దేవశ్రవుఁ డెఱిఁగిం
చిన దివ్యక్షేత్రమహిమఁ జిత్త మెలర్పన్
విని శాలవుండు ముదమును
దనువునఁ బెనగొన నృసింహుఁ దలఁచుచునుండెన్. 194

వ. అని రోమహర్షణుఁడు వినిపించుటయు సంయమిప్రవరులు
భక్తిరసావేశంబున నానందామృతధారల మునింగి యహో
బలనాథు నిచ్చలు దలంచుచు యథేచ్ఛం జనిరి. 195

ఆశ్వాసాంతము

క. గర్వితదైత్యవిఖండన
దర్వీకరశయన వరసుదర్శనశార్ఙ్గ
ఖర్వాయుధమండితభుజ
గీర్వాణావనముదాత్మ కేశవ నృహరీ. 196

శా. పారావారశయాన సింధుతనయాపాంగేక్షణోదార సు
స్మేరాలోకనమూర్తి దైత్యవిభవశ్రీవర్ధన వ్యత్యయా
కారుణ్యామృతవృష్టితర్పితసుభక్తవ్రాత నిత్యోదయా
రారాజచ్చరణాబ్జసంజనితగీర్వాణాపగా శ్రీహరీ! 197

మాలిని. ప్రకృతిగుణతరంగా ప్రస్తుతౌదార్యసంగా
సుకృతిజలధిభంగా సూరిచేతోబభంగా

నికృతిజనవిదూరా నిర్మలాకారమారా
వికృతిదనుజ వీరావేశసంహారకారా. 189

గద్యము. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వరచరణసరోరుహ
ధ్యానానందసౌందర్యధుర్య శ్రీసూర్యసుకవిమిత్రసంభవ
శంభుదాసలక్షణాభిధేయ యెఱ్ఱయనామధేయప్రణీతంబయిన
శ్రీలక్ష్మీనృసింహావతారం బను పురాణకథయందు సర్వంబును
బంచమాశ్వాసము.

నృసింహపురాణము సమాప్తము.



# పదములు అర్థములు

అ

*అంకనములు 2-84 గుఱుతులు.

అంచబోదలు 2-67 అంచకూనలు.

అంతఃకరణము 4-71 అతి ప్రీతి. తెలుఁగువారు అంతఃకరణపరిణామ మగు ప్రీతి దయ ఇష్టము మొ॰ అర్థములలో దీనిని లాక్షణికముగా ఉపయోగింతురు.

అందంద 1-80; 105. 2-14, 80, 119. 3-15, 44, 94. అచటనచట. మఱిమఱి - మిగుల- మాటిమాటికి—ఈ మొదలగు విశేషార్థములను ఊహించునది. శ. ర. లో దీనికి గల అర్థము లన్నియుం లేవు. సూ. ని. కొన్ని అర్థము లెక్కుడు చెప్పి ప్రయోగముల నుదాహరించెను.

అకరువుల్ 2-67 కింజల్కములు. పుప్పొళ్లు? చూ. కం.

అగ్గము 2-75 అధీనము.

అచ్చు 3-14 పడియచ్చు. 'కాదు' అని ప్ర. గంధరువు. 4-62. 5-118. విధము, దృష్టాంతము, వరవడి.

—కట్టు 1-8. 4-62, 5-63. ఏర్పఱచు.

అచ్యుత 1-55 విష్ణువు. అచ్యుత = జాఱని.

అజ్జ 4-184 అడుగు. ఇచట క్రింద ముందు అని లక్ష్యార్థము.

అట్టాలక 2-109 బురుజు నగరు.

అట్టె 3-6 ఈతని కూఁతు రట్టె? = ఈతని కూఁతురా?

అడంకువ 3-98 నమ్రత.

అతకరించుట 1-98, 4-93. అధఃకరించుట.

---

*ఇట్టి గుఱుతులు పెట్టిన పదముల అర్థము లింకను పరిశోధన చేయవలసి యున్నవి. వ్రాఁతప్రతులందలి కొన్ని పాఠములు అపపాఠములో సుపాఠములో భావ మంతయుం బయటఁబడనిదే తెలియదు. ఈ గ్రంథమందు చాల అపపాఠము లున్నవి. అపపఠిత పద్యము లర్థమగుట లేదు.

అదటు 2-90 గర్వము, మదము.

అదరు 5-97 భయమువలన చలించు.

అనుకు 2-56 పలుచన.

అనుగు—గోటలు, ఎలుంగు. 3-111. 5-157. మనోజ్ఞము.

అనుగలము 1-37. 3-5, 14. స్థానము అనుకూలము సమానము.

*అనుముదేఱు 5-125 ఒప్పు. ఇది వ్రాఁత ప్రతిలో పాఠము నందలి పదము.

అనురక్తావలోకనుఁడు 3-14 ఎఱ్ఱని చూపులు కలవాఁడు. అనురాగముతోఁ గూడిన చూపులు కలవాఁడు

అపువు 3-14 విధము.

అన్ను 2-102, 3-89 పారవశ్యము మదము.

అపదాన పీఠి-38. గొప్పపని.

అపశరణ్య రిపుఁడు 2-3 అపగత=తన నుండి పోయిన, శరణ్యా=శరణాకల రిపుడు=శత్రువులు కలవాఁడు.

అభిప్రాయము 3-45 ఆశయము తలఁపు. అస్థతో విను, చెవి యొగ్గి విను-ఈ మొ. అర్థములందు ఇచట ప్రయుక్తము.

అభియోగ్యము 2-13 ఎదిర్చి ఆక్రమింపఁదగినది.

అర్ఘాతీతము 2-18 వెల కెక్కుడు. ఇచట ఇనుమిక్కిలి.

అర్థకరులు 5-63 పనులు చేయువారు, భటులు.

అఱలు 5-63 వాసగృహములు.

అఱిముఱి 1-14 సంభ్రమము త్వర క్షోభము కలఁత.

అఱువుడు 1-4 శిథిలము. అఱువుల్లు - దే. వి. బ. ...ఇత్యాది బహువచనాంతములు వృత్తియం దేకవచనాంతము లగును. 'అఱువుడు గావి' ఉ. హరి. 4-శ. ర.

అలుఁగు 4-27 ఆయుధవిశేషము.

అవధిఁబోవు 2-90 అంతము నొందు, క్షీణించు. చూ. హరి. పూ. 5-106—'తనకుఁ' దివురు సేవా దుఃఖం బెల్ల నవధిఁ బోవ ఉ. 6. 201., 7-201. కొందఱు అవిధి బోఁవు అని పఠించి 'కష్టముల పాలగు' అని అర్థము చెప్పిరి.

అవ్యక్త 3-24 మూలప్రకృతి. చూ. షడ్వింశు. 3-91. కనఁబడనిది, మసకమసక ఐనది.

అశేషభోగ 1-55 శేష భోగ=పాము పడగ. ఎల్ల భోగములు.

## ఆ

ఆఁక 4-113 అడ్డు.

ఆకరము 1-37 గని.

ఆక్రాంత నియ త్యాపేలవుఁడు 1-10. ఆక్రమింపఁబడిన శుభాశుభ కర్త

యెడ పలుచబడనివాఁడు. శుభము కాని అశుభము కాని వచ్చినపుడు-చో లెక్క-చేయనివాఁడు. సమదర్శి అని తా.

అట 2-90 నింద.

అదట 3-94 ప్రేమము.

అర్చు 2-86 'అడు'కు ప్రేరణము. ఆడించు, త్రిప్పు.

అర్పు టెలుంగులు 2-73 అఱుపులు.

అఱుడివోవు 2-90 వ్యర్థమగు.

అలరి 4-11 మూర్ఖు.

ఇ

ఇట్టలము 3-14 అధికము.

ఇఱి 5-52 నలఁగు. 'ఇఱిసిన'లో 'సిన' లోపము. ఇటులే ఇఱి కౌఁగిలి ఇఱికౌను అని శ. ర. 'ఇఱుకైనది ఇఱుకౌఁగిలి సన్నమైనది ఇఱుకౌను' అని వావిళ్లనిఘంటువు. ఈ పక్షమున ఇకారాదేశ మొకటి అధికము. చూ. ఉఱు కౌఁగిలి. శల్య 2-46.

ఇఱిరాయు 4-48 నలఁగు

ఈ

ఈచపడు 5-51 వంకరయగు కుప్పించు.

ఈరసము 4-26 పగ.

ఈరికలెత్తు 3-102 మొలకెత్తు.

ఉ

ఉడిచి 1-65 ఉడుగు ప్రే. ఉడిగించి. చూ. ఆది. 6-175, 6-16.

ఉడివోవు 1-35 ఉడిగిపోవు.

ఉధరి 4-46 పూర్వముద్రణములలో ఒదరి = సంధ్రించి. ఉదరి = విజృంభించి కోపించి చూ. సీ. హుంకారఘోరమై యుం దరు బెబ్బులిమీద లంఘించ యెవ్వాఁడు నేఁ దూఁచికొనియె, అరణ్య. 6-315 5-277. 'అదరక యది సూచి బెదరక డెంద మందరక, చిత్తంబు చెదరక, మనసు గలఁగక' పండి. పురా. పు. 397.

ఉన్నయము పీఠి-17 పైకిఁదీయుట. సన్నయ లెక్కనలు విడిచిన భాగమును.

ఉపజాపము 4-155 భేదోపాయము.

ఉరలంద్రోచు 4-94 తోలఁగఁద్రోచు. ఉరలన్ + త్రోయు = త్రోసి వైచు. క. తరువం బెట్టిన బానల, పెరుపులు మును గిలకరించి పేర్చిన్న వెన్నల్, నురువు లెసఁగఁ గ్రోలి పిదప, నురలం ద్రోచుచును బోవు నుక్కివపు గలిగ్. హరి. పూ. 5-203. కూలఁద్రోయు 'అక్కోట యురలం ద్రోచి' - మార్కం. 1-89.

ఉరివి 2-56 పరిహరించి. వెనుకటి అచ్చులో ఉరగి. ఇది క్రాంత మగు ఉరువు ధాతువు! చూ. కల్యా 2-240. శాంతి 3-498.

ఉరియు 4-48 చలించు.

ఉఱక 4-135 అవలీలగా (ఉఱక పఠింపఁగావలయు.) 5-177. మూటాడక వ్యర్థముగా అకారణముగా అని వావిళ్లనిఘంటువు.

ఉలక 2-56 చులుక. సీ. చులుక చౌక, యులక యెల్లిద మన నొనరు లఘుత పేళ్లు. సాం మాన. 424.

ఉలివు 2-105 ధ్వని.

ఉగ్గడువుగ 3-88 అధికముగా.

ఉచ్చిపోక 2-47 చీలిపోవుట.

ఉత్తర్జ 2-18 తీవ్రమగు బెదరింపు గల. 'అర్శాదిభ్యోఽచ్.' చూ. ఉత్తర్జన గర్జా స్ఫూర్జితంబున 5-82.

ఉత్తాన 1-57, 4-168 లోఁతు లేనిది. వెలికిలినది. హరి. ఉ. 9.205 '...ఉత్తానకఠోరధార మగు దారుణ వజ్రము ..'

ఉప్పతిలు 3-98 పుట్టు.

ఉష్మ 2-75 ఊష్మము, ఉబ్బ.

ఊ

ఊఁకించు 3-75 ఉంకించు, త్రివిష్టప ములన్ గెల్వంగ నూఁకింతు. కర్ణ. 3-130.

ఊఁదుకొను 4-178 నాటుకొను. చూ. హరి. ఉ. 7-155, 9-231. ఆముక్త. 5-137. ఊఁదునకు స్వార్థమున కొను అని సూ. ని. పేర్చి శైలంబులు పెఱికి శైలములపై నూఁదుకొనంగ నొం డొంటి వైవ. హరి. ఉ. 7-156. ఇత్యాదులందు గ్రుచ్చుకొనిపోవు మొ. అర్థములు చెప్పవలెను.

ఎ

ఎండకన్ను 3-75 ఎండచూపు.

ఎడకొను 4-57 సందు చేసికొను.

ఎడను 3-75 చోటు, అవకాశము, నడిమిభాగము.

ఎడము 1-69 కాష్ఠ, అవధి.

ఎదురెదుర 2-56. ఎట్టయెదుట.

ఎరియు 4-48, 80 నశించు, మండు.

ఎఱమంటలు 2-14 ఎఱ్ఱని మంటలు. ఇటులే ఎఱగందు ఎఱగత్తులు ఎఱ సంజ మొ. చూ. హరి. పూ. 2-67. 4-113, 5-150.

ఎలయు 3-14 ప్రతిబింబించు.

ఎలరారు 1-58, 2-67 అతిశయించు. చూ. హరి. పూ. 6-105 ఆతపవారణంబు లెలరారఁగ, హరి. ఉ. 3-184, 4-70, 110, 227. 7-36. 'ఎలరు = సన్న గాలి. ఎలరారు = సన్నగాలికిఁ గదలు' అని మా. రామకృష్ణకవి గారు. స్వముద్రిత కు మా ర. 127-వ పుట.

ఎలర్చు 2-64 విచ్చు.

ఎక్కటి 2-3 ఒక్కటి.

ఎమ్ములు 2-124 ఎముకలు.

ఎల్ల-నాఁడు 1-35 ప్రతిదినము.

—వెంటలకు 1-54 అన్నిపరులకు.

ఏ

ఏ-చు 5-44 కాఱించు.

ఏచు 2-70 అతిశయించు.

ఏడుగడయుం 2-14 అవ్వ ఎల్ల. గీ. ఎనయుం సర్వపదార్థమై యేడు గడయుం నాఁగ. ఆం. భా. 3-79. క. గురుఁడును దల్లియుఁ దండ్రి యుఁ, బురుషుఁడు విద్యయును దైవమును దాత యునాఁ, బోరి నేడుగడయుఁ దానై, హరి నను రక్షించుఁగాత ననవరతంబున్. వా. 1. ఆ.

ఏలకో 1-93 ఏల+కో?

ఒ

ఒండొండ 2-61, 4-182, 5-111 మొ. ఒండు+ఒండు+అ (ఒకదాని తరువాత ఒకటిగా) క్రమముగా మొ.

ఒకరుల మాటలు 5-56 ఒకళ్ల మాటలు. ఒకఁడుకు. బ. వ.

ఒక్క-మరి 1-67 ఒక్క-తడవ-వారము 'ఒక, మరి గోష్ఠినిరతి నుండి మను జాధిపా!' అను. 2. ఆ.

ఒడిసి 2-119, 5-98 ఒడుపువేసి తిగిచి.

ఒడుపు 5-96 గుఱి పెట్టి దాఁటిన దాఁటు.

ఒఱలువారు 4-28 విలపించువారు. చూ. స్కా. 1-267. కర్ణ. 1-38. కల్య. 1-363.

ఒలయు 4-64, 79 ప్రవేశించు చూ. హరి. పూ. 2-31. 'క, వారిజనాభుని తేజం । బారా జోత్తముని యాత్మయం దొల యఁగ.' । వ్యాపించు. మొ.

ఒజ్జ 4-3 ఉపాధ్యాయుఁడు.

ఒడ్డారించు 4-28 ఎదురు తిరుగు.

ఓ

ఓగితము 2-90 (యుక్తమ్) తగు

పాలుపడు, వా. ని. పాత్రము. పరులనింద పడుటకు పాత్రము అని తా. సూ. ని. చూ.

ఓజ 1-8 క్రమముగా.

—పఱచు. 1-70. 2-130. 3-14. 4-56 సిద్ధముచేయు, అలవఱచు.

ఓడికల్ 3-33 ప్రవాహములు.

ఓర్తె 3-98 ఒకరితె.

ఓలంబు నొందు 2-50, భేద మొందు.

ఓలాడు 1-25 మునుగు.

ఓలి మై 3-141. వరుసగా. 'ఒగి వరుస యోలి సొరిది నా నోజ నాఁగఁ గ్రమమునకు నాఖ్యలు. ఆం. శ. 16.

ఔ

ఔడు 4-37 (ఓష్ఠ) పెదవి. దంతము. అలరు దంతంబు పే రౌడనంగ. ఆం. శ, 47.

ఔదల 2-99 తల (ముందల అను నర్థమున ఔదల. సీ. ఔదలఁ జదలేటి తేఁదరఁగలు బాలుఁ దగు చందమామ నుయ్యాల లూఁప. (హరి. ఉ. 6-38.)

ఔపచారిక దృష్టి 4-185 అప్రధానదృష్టి. ఆత్మభావము ప్రధానము. జీవభావ మప్రధానము.

మనసు కొంత వెలికిఁ గొనివచ్చి తాను ప్రహ్లాదుఁడాయెను. వెలికిఁ గొనిరాకున్నచో ప్రహ్లాద మే అనఁగా ఆనంద మే యగును.

ఔపనిషదుల్ 3-28 ఉపనిషన్మతము ననుసరించువారు, రామానుజాదులందఱును ఔపనిషదులేయైనను ఇచట అద్వైతులు అని అర్థము. అద్వైతులును ఔపనిషదులేగదా

క

కందు 3-14 నలుపు.

కందువ 1-37 ఏకాంత స్థలము. ప్రదేశము. జాడ. చూ. ఆర. 5-399.

కజ్జలము 3-113 కాటుక, చీఁకటి.

కటికి 2-3 అధికము.

కడలు - చేతులు 1-34 అలలు అను చేతులు.

—ఒత్తు 2-81 వ్యాపించు, చూ. కరమూలముల జిగి కడలొత్తి హరి. పూ. 8-168.

—పడి 1-70 అలలవలె అయి. తరంగితమై.

కడి 2-5 ముద్ద.

కడిఁది 4-24. కఠినము. అనుపమముల్ రతిస్మరులకూటకు నర్హము లంచుఁ గట్టిపెట్టిన పువు బంతు

లీసతి కడింది చసుంగవ కళా-7. చూ. శ. ర. ?

—కనలు 5-26, 98 తీక్ష్ణ మగు కోపము.

కనలు 2-3 మండు.

4-24 కోపము.

—అగ్ని 4-178 మండు నిప్పు.

కనుపుగొట్టు 5-31 ఖండించు, భంగ పఱచు.

కన్ను 2-21. శేకు, కన్ను (శ్లో).

*కప్పుబడి 3-50. ఆచ్ఛాదింపఁబడి.

కమలా, కర కమల 1-55. లక్ష్మీ హా స్త కమలములు.

కమలాకర, కమల చెఱువులలోని, కమలములు. (శ్లో).

కమియు 3-70 కవియు.

*కమ్ములు 2-66 ? ఇది శుద్ధపాఠమై యుండదు.

కర 1-42 ఒడ్డు

కరవటము 3-80 బరణి.

కరాళ 3-96 భయంకరము. రాహు వదనము 4-184 ఎత్తైనశైలము చూ. కరాళో దంతురే తుంగే కరాళో భీషణే పిచ.' విశ్వః.

కఱతలు 4-135 చేష్టలు దుశ్చేష్టలు.

కల్పతరుపాకము పీఠి-23 కల్పతరువు పంట.

కలితనంబు 2-21 సామర్థ్యము.

కలుచపడి 5-4 కలఁతపడి.

కల్ల 2-59 కల్లి.

కల్ల 2-5 ముద్దలు. కడి ఏకవచనము. 'కడి మాడ నీయఁగుడుచు.' క్రీడా.

కల్లోల 3-3 తరంగము.

కల్మి 1-7. కలుగుట; సంపద.

కవణము 2-127 గుఱ్ఱములు మొ. దానికి పెట్టు ఉలవలు మొ. దాణా.

కష్టుఁడు 4-25 పాపి.

కాకుచేయు 2-119 తిరస్కరించు.

కాదిలి 4-40, 79 ప్రేమమ్ము ప్రియభార్య. శ. ర. లో ఈపదము గాదిలిగా గ్రహింపఁబడెను. చూ. నన్నె చోడుని కుమార సంభవము 2-18.

కానుపు 4-157 కనుట; చూచుట. 'అది కలలోనికాను పయి' హరి. ఉ. 7-99.

కావలము 4-58. దురాచారము; పాపము,

కావులు 3-68 కాషాయవస్త్రములు.

కిటుకు 4-28 (క్రిక్కు.రూ) ఇదుము.

కీలించు పీఠి-73 ఉంచు. గీ. పెట్టె గీలించె నాఁగను వెలయుచుండు, నుంచె ననువల్కునకు. ఆం. భా. 3-130.

కున్న 5-17 కూన, శిశువు, కున్నఁడు, కున్నె - రూపాంతరములు. ఇది కుణశబ్దభవము. 'వెన్నుఁడ నినుఁబాసి వెడమాయ కోవిల । కున్నల కులకులు గులికేనిపుడు' అన్న. శృం. 116. 'ఓరి గున్న!' అని వాడుక.

కూడఁబడు 2-133, 5-90. చేరు. స్వార్థమున పడు చూ. 'గొల్ల లెల్లఁ గూడఁబడిరి' హరి. భూ. 5-246.

కృతంబులు 4-54 హింసలు. ఈ పద్యమున 3 పాదమునందలి కీడు కును దీనికిని పొత్తుకలదు

కృష్ణ 1-10 పాకము. (నలుపు పాకము తమస్సు మొ. వానికిని తెలుపు పుణ్యము సత్యము మొదలగు వానికిని లక్షితము.)

కేడయించు 4-178 కూల్చు పడ వయించు

కేతు 1-43 టెక్కెము

కొంకరవోవు 4-108 వంపు వోవు.

కొఁకవోరె 2-75, 119. భయపడరే, వెనుదీయరే.

కొఁడిక పాయము 2-61 చిఱుత పాయము.

కొఱకు 4-86 నీచుఁడు.

కొఱగామి 5-142 అకార్యము.

*కొలమే 5-45 ! కులమువాఁడా - అని తాత్పర్యము.

కొలుపు-పెద్దలు 1-78 పుట్టజేయు 4-103 కొలుచుట. సేవించుట.

కొలఁదులు 5-142 మేరలు, పరిమితులు.

కొలుపు 4-103 - సేవ.

కొనలు 4-170 (కన్ను) కొనలు.

కోర 3-94 కల్లుత్రాగెడు గిన్నె. చషకము.

కోర చెండాడు 4-121 కోరాడు. ఏనుఁగు లోనగునవి కొమ్ములతోఁ బొడిచి దుమ్ము ఎత్తి పైకిఁజల్లు. దీనికి గ్రంథములయందు కోరాడు అనియె ప్రయోగమని శ. ర. ఈ పైప్రయోగము శాచార్యులవారు గమనించి యుండరు.

కోఱదము 4-11 ప్రతికూలపు పలుకు.

కోలు 1-72 పెద్ద.

—మసఁగి 4-170 మిక్కిలి విజృంభించి

క్రందుగ 1-78, 2-64. తఱచుగ.

క్రందుకొను 4-132 మూఁగు, గుమిగూడు. చూ. పొడఁగన వేళ యబ్బెనని పొంగి కళింగ శకాంగ ముఖ్యు లయ్యెడ కాడ యాక క్రందుకొని. వసు. 1-147.

క్రాఁగు 4-130 ఉడుకు 4-144 నశించు. క్రి. క్రాఁచు 2-49, 5-94. నశింపఁజేయు.

క్రించు 3-19 అల్పుఁడు, మిమ్ము నీ క్రించుల యాదవాన్వయుఁల హరి. ఉ 1-108.

కుమ్ముడి 2-85 (క్రుంగు+ముఁడి, కఱు+ముఁడి అని కొందఱు) అందమగు ముడి అని తా. 5-158-'24 సం. ప్రతిలో క్రొమ్ముడి అని కలదు. బసవపురాణ పీఠికలో శ్రీ ప్రభాకరశాస్త్రిగారు క్రుమ్ముడి యను పదమే కాని క్రొమ్ముడి యను పదము లేదని వ్రాసిరి.

క్రుయ్యఁగఁబాఱు 3-67 కృశించు, వెనుదీయు.

క్రొవ్విదము 3-75 క్రొవ్వు.

క్రోడాడు 4-47 కోరాడు,

క్రోల్పు 1-7, 5-185 క్రోలఁజేయు. (క్రోలు+ప్రేరణము)

క్షోద 3-65 రేణువు.

5-40 ఒరగంటిపై నూఱుట.

ఖ

ఖలుడెందము 2-56. కలుడెందము - శ. ర. పాఠము. కలు = రాతియొక్క (డెంటము).

గ

గంటి 5-12 గాయము చేయు (గంటు క్త్వా.)

4-114 వి. గాయము.

గరుడాచల 3-1 వేదాద్రి చూ. 5-99, 5-122, 5-129.

గరువంపు టేఱులు 5-54 విరివియగు ఏఱులు లేక, పెద్దయేఱులు.

—దిట్టలు 1-50 'గరువం బగు తప్పరి బోధము. హరి. పూ. 2-217. గరువంపు విచారము లేల నీయెదన్. అరణ్య. 6-405.

—సూత్రధారి 3-78.

—ఁదకుంభ [విక్ర] 6-51.

—నిట్టూర్పు (కాశీ) 4-69.

—ఁగోటారులు (మను) 3-89.

గాఁడితూపులు (పలు) 2-74 పెక్కుగాఁడులు కల బాణములు.

గాంగేయ భవన 1-55 బంగారు టెండ్లు, భీష్ముని ఉనికి.

గాథలు త్రవ్వ 1-9 మిట్టలు త్రవ్వ. (శ.ర.) అనఁగా మిగుల శ్రమపడు. 'గొఱియల వార్తలు గూడు నే త్రవ్వ' బసవ. 5-339 పు. వావిళ్ల ప్రతి.

గానట బీసట (చదివి) 1-9 సలక్షణము కాని చదువు. 'గానట =

గాథా సప్తశతి. బీసట = బేతాల పంచవింశతి అనఁగా ఆధ్యాత్మిక దృష్టిలేని చదువు' అని శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు. చూ. భారతి. 26సం. 1 భా. 13 పుట.

గ్రామ్యలక్షణము అనుశీర్షికలో—

క. ఈసడములు గోరడములు, గాసర బీసరలు నైన కట్టిఁడి పలుకుల్, భాసిల్లు గ్రామ్యములు నా, హాస్యోక్తులఁ దెగడుచోట నవియొను నొప్పుల్. కావ్యాలంకార చూడామణి. ౯. ఉల్లాసము. ౨౦.

గినుము 4-99 వంచన.

గిరిశ పీఠి-18 శివుఁడు (గిరి=కొండపై, శేతే=నిద్రించు వాఁడు).

గిఱుపు 1-54 కదలించు ఇక్కడ నక్కడ నూడఁజూచి మే గిఱుపఁగ నిర్వ. 7. దువ్వు - సవరించు (సూ. ని.) చూ. భా. ఆది. 5-168. గిఱుపు నెడ.

గీటు 5-95 (కోఱలు, దౌడలు) కొఱుకు.

గీఱు చు 1-95 భేదించుచు. 'నాటుట' అని అప్పకవి. ఆ. 2 ఆ. చూ.

గుబ్బునన్ 4-8 ఒక్కుమ్మడిగా.

గురువులు వాఱు 2-67 పరుగువాఱు. అతిశయించు.

గుఱికొను 5-77 యత్నించు.

గుఱుతు 5-142 మేర. పరిమితి. సూ. ని. క. ఖలుఁడు మనుల యాశ్రమములు। గల యన్నియుఁ జొచ్చి చెఱిచెఁ గ్రతువులు ధర్మ, స్థలనం బొనర్చి సాధుల, యలజడికది 'గుఱుతుకోలఁది' యన లేదన ఘూ! హరి. 4-118.

గొనయము 2-74 వింటినారి.

గోత్ర 3-14 కొండ కులము. (శ్లే)

గ్రక్కదలు (గ్రక్కు+అదలు) కంపించు, అదరు.

ఘు

ఘుటికము 2-'27 గుళిక. రసమణి లోనగునది. చూ. 3-84 సుధామయ ఘుటికలు.

చ. ఇట క్రీతమెన్ని తోయముల నిందు ముఖీ ముఖ శేషమద్యమున్, గుటుకునఁ గ్రోల నీ కుటిలకుంతల యొంగిటి మాధ్విఁగల్గు విస్ఫుట మధురత్వవాసనలు చూడరు గాక దివౌకసుల్ సుధా,ఘుటికలలోని మేలు మఱి కోరుదురే యిది గ్రోలఁ గల్గినన్. (ప్రబోధ) 3-56.

చ

చక్ర 1-53 చక్రవాకము, చక్రము. (శ్లే)

చక్రాంక 5-176 చక్ర చిహ్నము. ఈ చిహ్నము తాల్చుటయుం ఒకసేవ.

—భాగవతులు 5-77 చూ.
క. శ్రీకర చక్రాంకితులగు, లోకులు శుద్ధులును బుణ్యులును నగుదురు వా, రీ క్రియలు లేకయుండినఁ బ్రాకృతులనఁ బలితు లనఁగఁ బడుదురుజగతిన్. పద్మపురాణము 321.

చట్టులు 1-3 శిష్యులు.

*చదుర్లు 2-84 చదురుకు బహువ. చతురోక్తులు.

చల్మరి 3-68 చలువ.

చవికాటు 2-66 చవిగొఱకు కఱచు.

చాఁగిలి 2-93 దండాకారముగా నేలకు వ్రాలు.

చిందిలి మందిలి 2-53 చెదరినది, చెడినది.

చిట్టలు 4-181 కొంత.

చిదురుపలు 4-31 తునియలు.

చివ్వ 2-68 యుద్ధము. చివ్వలనీన — యుద్ధములు కలిగింపగా.

చిరికిఁ గైకొనరు 2-102, 3-126. లేశమయినను లక్ష్యము చేయరు.

చుఱచుఱ 4-41 మండుటయందలి ధ్వనికి అనుకరణము.

చూడ్కిరేకులు 2-67 చూపులు అను పూరేకులు.

చూఱాడు-చూఱలాడు 2-67, 35, 177. కొల్లపెట్టు.

చెనకు 1-5 తాఁకు, ఎదిరించు.

చెనయు 2-135 ,,

చెరలు పట్టి 2-117 నిర్బంధము చేసి పట్టి.

చేయలఁతి 4-77 సమీపము.

చొక్కు 2-66 పారవశ్యము.

చోద్యపు మూల్యములు 1-46 వింత వెల కలవి. చోదనా మూల్యములు అని అర్థాంతరము.

జ

జంకెలు 2-84, 4-14, 6-108 బెదరింపులు.

జంత్రము 4-123 సూత్రపు బొమ్మ. ఇచట వెనుకపాదము నందలి మాయయే యీజంత్రము. ఇది 'ఒక అద్భుత కర్మ.' చూ. సూ. ని.

జడిగొనియుండు 2-135 నిరంతరమగు.

జతి 2-82 యతి. ఆటకు పాటకు తగిన స్వరసంతతి.

జవరము 2-50 సాంద్రము. ఇది శ. ర. పాఠము.

జయంతి 5-150 కృష్ణజయంతి నృసింహాజయంతి మొ.

జలాశ్రయ 1-53 జలము, జడము అని శ్లేష 'లడయో రభేదః.'

జాదుకొను - పీఠి-22 కలుగు. ఉద్భవించు. (జొదు-జాలిః) సీ. ఎలమిఁ గోరిక లీరిక లెత్తిన, సరణిమేఁ బులకలు జాదుకొనఁగ. విక్ర. 1-122.

జాఱె 3-108 జాఱినను అని సూ. ని. పాఠము. కడచినను, గతించినను.

డ

డ(ద)క్కఁగ నేలుదు 2-8 అనుభవయోగ్యముగా పాలింతును.

డించు 2-16 ఇంకు.

డించుకొఱుపనేరక 2-44 కుదురుపడఁజేయఁజాలక.

డెక్కొను 2-81 డెక్క+కొను నిలకొను. డెక్క+కొను-డెక్కొ వట్టు? 'సీ. చివురెల్లఁ గసి నొత్తి తొవరాకుగుత్తుక, డెక్కొని కోయిల వెక్కుచుండు' కుమా. 5-162.

డొంకు 3-110 ఇంకు.

డోలు 2-67 'దోలు. రూ' జాటలు. చూ. 'కుత్రచిన్ను లోప శ్చ.' అవహోబ.

త

తక్కద 5-7 తప్పద, తొలఁగద.

తగులు 5-131 నిత్యనివాసముచేయు, అంటిపెట్టుకొని యుండు.

తటమట 4-172 'తటపట. రూ'. కలఁత నొందినది.

తట్టాడు 3-147 మట్టాడు. తప్పటడుగులు వేయుచు తిరుగు.

తత్ప్రకారంబు 1-101 ఆరీతి. ప్రక్రియ - క్రియ-పని.

తనుగాలి 3-73, 5-157 (తనుపు-గాలి) చల్లగాలి.

తపోగ్రత 2-21 తపము నందలి ఉగ్రత. పకారాంతశబ్దములు అకారాంతములు నగు నను మతమూని యిటులు ప్రయోగించెఁగావలయు.

తరతరంబ 1-24 క్రమముగా, పరంపరగా.

తరి = మంథాచలము.

తరితాల్పు 1-54 శంఖము తాల్పినవాఁడు-విష్ణువు.

తఱికిన 1-91, 5-4. తఱిగిన.

తఱియు 3-57, 5-9. సమీపించు, దాఁటు.

తఱులు 1-4, 3-14. అలలు, వళులు.

తర్పిత 5-107 తృప్తిచేయఁబడినది.

తలఁకు 2-21 భయపడు.

తలకొను 1-22, 3-90.

తలఁగు 4-97 తొలఁగు. ఈ పదము ఇచట అతుకదు. ఇది 'తగిలి'యై యుండునా?

తలఁపు 5-189 హృదయము.

తానకము 1-37 స్థానము.

*తాలని 2-71 చూ. తాం తి 1-249.

తాళగించు 2-81 తాళము వేయు.

తిలకించు 1-6, 70. 2-61, 63. 3-14, 97. ప్రకాశించు, ప్రసన్నత నొందు కనఁబడు, పొడచూపు. 'క. కల నీలకంఠ కోలా, హాలలీలలు సెలఁగ రాజహంస కులములం, దిలకించె సప్తపర్ణా,వళి విగళిత కుసుమ కుటజ వాటికల గడన్. అరణ్య. 4-145. చూచు అను నర్థము ఆదికవుల ప్రయోగములందు కానఁబడదు అని శ. ర. కాని ఇందు 'అసూయాసౌందర్యంబునం దిలకించు నిందిరకు' 3-14 అనుచోట చూచు అను నర్థము, కనఁబడు, పొడచూపు అను నర్థములకంటె సుసంగతము. 'శా. నోరం జేతులు రెండు గ్రుక్కికొనుచున్ మో మెల్ల బాష్పాంబుజన స్మేరంబై తిలకింప నేడ్చుచు.' హరి. పూ. 5-171. గీ. సరస కింశుక కోరక సంచయంబు చెలువు తిలకించె..."నృసిం. 2-63' అను నీరెండు తావులను, అ. క్రి. కనఁబడు, పొడచూపు అను నర్థములు సూ. ని. చెప్పెను. చూచు అను నర్థమున— '...ప్రియముగఁ దిలకింపుము మల్లి, ప్రియుండవు నన్ ప్రియమునందుఁ బ్రియ మొందఁ దగన్' హరివంశ. ఉ. 7-27.

తివుట 2-47 కోరిక.

తీర్చు 5-12 చక్కఁబఱుచు.

తుప్పరఁదూలిపోవు 1-67 తుప్పరవలె తొలఁగిపోవు. కదు చలించు. భాస్కరరామాయణము, కుమారసంభవములందలి 'తుప్పలుదూలు (బాల. 32) తుప్పలఁదూలఁగ 1-3 మొదలగు ప్రయోగములను జూచి శబ్దసామ్యమును శబ్ద తత్త్వమును గమనించునది.

తుఱఁగలి 2-14 ప్రకాశము.

తూపరము 2-57 చిల్లి. భ్రష్టమై అని యిచట తాత్పర్యము. చూ. సూ. ని.

తూఱఁబోదుచు 4-121 చొరఁబడు నటులు పొదుచు.

తెట్టిన 5-3 తెట్టగా పెట్టిన. 'తెట్టు ధాతువు శ. ర. లో లేదు. సూ. ని. లో కలదు.

తెట్టువలు 1-40, 4-109. నీటి యందు గాలి కొక ప్రక్క చేరిన తృణాది సమూహము.

తెప్పలఁదేలు 1-84 ఆనందించు. ఓలలాడు, ఈఁదులాడు. ప్రవాహము

(నీరు) ఎక్కుడై నీరు పొంగినపుడు
తెప్పలుం దేలును. ఇది వాచ్యా
ర్థము. కాంతిలోఁ దన చూపులు
తెప్పలు తేలు ననఁగా కాంతి
యొక్క ఆధిక్యమును, అందు
చూపులు తెప్ప లనుటలో వాని
ఆనందాద్యతిశయమును ధ్వన్య
ర్థము. (సాగరకన్య కాంతిలోఁ అని
మూలపాఠ మై యుండును.)

తెరలు క్రి. 3-36, 4-44. మొ.
కలఁగు. చూ. అరణ్య. 5-180.
...కర్వ 2-72 పొంగిపొరలు.
...పొదువ 2-18 కలఁగునటులు
పొదువు. [లేచు

.. ఎత్తు 4-176 అలలు పైకి

*తెలియింపు 5-83.

తేటవొందు 1-18 నిర్మల మగు, కలఁక
దేఱు.

తెలుపు 4-103 ప్రార్థన. 'తెల్చుర్
త్రిలోకంబులన్.' హరి. చూ.
తెలుచు. శ. ర. (నమస్కారము
సూ. ని.)

తెలుపువాఱు 3-131 తెల్ల నగు.

తెల్ల పీఠి-9 విశదము - స్పష్టము-నిస్సం
దేహము.

తేప 1-42, 4-73 తెప్ప.

తేఁజను 2-90 వృథా యగు.

తొంగలి రెప్పలు 3-14 దట్టమగు
వెండ్రుకలు కల రెప్పలు.

తొక్కుచు 3-148 అణఁచుచు.

తొడఁగి 1-29. 2-105 ప్రారంభించి.
'ఆటకుందొడఁగి.' హరి భూ. 7-92;
...ఒదవఁదొడఁగి. 4-162. మర
గఁదొడఁగి. సూ. ని. తొడగుధాత్వను
బంధము లేకున్నను 'ఒదవు'నకు
మరగు అను అర్థము. హరి. ఉ.
౯-౭౭. కనఁబడును. 'క. చదువక
పెద్దలగోష్ఠికి, నొదవక ధర్మంబు
తెలియఁగ గూరక మిగులన్, జదివిన
వారై యెఱుకలు, పదివేలు నటింతు
రుర్విఁ బండితమానుల్.'
'యుక్తమగు' అని శ. ర. చూ.

తొడఁగు 4-161 చదువుదము.
ఒదవు - చూ. హరి. భూ 7-112.

తొడరు 1-20. 97 కలుగు.
2-142 ఎదిరించు.

తొడవు 3-33 భూషణము.

తొడిఁబడు 2-35 తొట్రుపడు,
చలించు, బెదరు.

తొప్పఁగదోఁగు 4-183 మిగుల
మునుఁగు.
...'దోఁచి 5-101 మిక్కిలి
మునిఁగించి, క్షాళనచేసి అని తాత్ప
ర్యము. [పడు.

తొలఁగు 2-47, 5-104 విడుచు. క్వచి దేకస్యైవ లఘుత్వం గురుత్వం చాప్యస్తి. 'లఘుర్భవే ద్గురుః క్వచి ద్గురుశ్చ లఘు స్తథా ఉచ్చారణస్యకల్ప్యత్వా న్నిదానం తత్ర సర్వ్వదః' ఇత్యథర్వణ వచనాత్. సీ. పరమాత్ముపదములఁ దొరఁగి పాతాళునీటి, తరఁగలపై లీల దాటి దాటి, 1-54. గీ. పొగడమ్రాకుల మొదలను బుష్ప రసము, దొరఁగి శాత్త్వాని యందున నారయఁ గప్పె' ఇతి నృసింహపురాణే ప్రయోగః 'మ్రాఁకులు, తొలఁగి, నీలయు' శ. ర. పాఠాంతరములు.

తొరఁగు 1-54, 3-14 స్రవించు - ప్రవహించు - పడు - తొరుగు. రూ. తొలఁగు తొరుగుల విభేదమునకు శ్రీ. వే. ప్రభాకర శాస్త్రిగారి బసవపురాణ పీఠికయు Journal of Sri Venkateswara Oriental institute Vol. IV- No. I. లో పండితారాధ్య చరిత్రము అనువ్యాసమును చూచునది.

తోఁగు 1-11 మునుఁగు.

తోఁపుఁజెంగర 3.78 ఎఱ్ఱని పెద్ద తెర.

తోలితోపులఁబెట్టు 2-74 తఱిమి బాధపెట్టు.

తోలు 4-43 చర్మము. 'క. అవిరళ విషఘన దంష్ట్రలు పవనజు వజ్రమయ తనువునను తోలును.' భా ఆది. 5-176 అను నెడ తనువు తోలుల భేదమువలె ఈ పద్యమున కాయము తోలుల భేద మారయునది.

త్రచ్చియూను 3-5 మథించు.

త్రవ్వితండము 2-117 అసంఖ్యాకము.

త్రిక్కు 2-121 తక్కు, తగ్గు.

త్రిప్పు 5-182 తిరుగుడు భ్రాంతి.

త్రిప్పుగాను 3-90, తిరుగుడుపను.

త్రెవ్వు 2-119 తెగు.

త్రొక్కు 3-35 పాదముచే అడఁచు.

## ద

దంటకెంపు 4-8 దంటయొఱపు. 'హరివంశమునందు తఱచు దట్టకెంపు' కనఁబడును. ఆ పాఠమున మిక్కిలి ఎఱుపు అని అర్థము.

దండియ 1-81 వీణ, కిన్నెర.

దండడి 1-36, 4-31. హరి. పూ. 164 అధికము. రాయిడి తఱచు. చూ. అశ్రమ 2-35 చూ దాందడి. ద్రో 4-129.

దట్టించు 4-59 అదలించు.

దడియంగఁబడు 1-90 దడి యం
త్రిక్కి లి సి యుండు. సూ. ని.
'వణఁకు'అని శ. ర.
దళము (గ) 2-68, 71 దట్టముగా,
అధికముగా.
...ఎక్కి 3-88 ఆధిక్యముఁబడసి.
...కొను 3-90 ,, పడయు.
దశ 3-113 అవస్థ, వ ర్తి. (శ్లో)
దర్శన 1-55 చూచుట-దర్శనములు.
దాఁటు 2-68 లంఘించు.
3-88 సమూహము.
దాడికాఁడు 2-60 వేగులవాఁడు.
*దిమ్మదిపురు 2-67
దీటు 2-86 చక్కఁబఱచు.
...కొను 5-109 నిండు.
...కొలుపు 1-175 నిండించు.
...గట్టుకొని 2-68 నిండుకొని.
దెస 1-68 ఇచట పక్షము(ననుండుట
క. కొండ వడ దాఁకి వాఁడి యొ,కొం
డును దెస లేక యేడ్చుచు కోమలతను
వా,ఖండలసముఁ డగుశిశువును, నిం
డిన కృపఁ గోరి చేర నెటి నంబుద
ముల్, హరి. ఉ. 9-10. ?-103
కాపు, ప్రాపు. 'అరయ దెస లేక
నీధనం బడవిలోనఁ జెల్లచెదరయ్యె'
హరి. పూ. 7. 4-64 ఇట దెసల
అను నది సరియగు పాఠమగుచో
'దశలు'కు తద్భవ మనవలయును.
4-114 ప్రదేశము.
దుద్దు 2-67 కర్ణిక.
దుఃఖపడి 4-152 కష్టపడి.
†దూఁదుకొను 2-14 ఎగురు. చూ.
అరణ్య. 4-384. వ......వాని
పదవ నిశ్వాసపవనంబు......భూ
నభోంతరం బెల్లను నిరంతర సిక
తారజఃపటలంబు దూఁటుకొనం
జేయు.'
దొంతులు 4-141 వరుసలు.
దృష్టము 5-38, 165 చూడఁబడి
నది. అనఁగా ప్రత్యక్షము 'భూనుత
యది నీకు దృష్టముగ నెఱిఁగిం
తున్.' అరణ్య. 5-113.
'ప్రత్యక్షం మమయో ధర్మ స్తం
పశ్య ద్విజస త్తమ. అరణ్య.
177-3 శ్లో. ఉదాహరణము.
'నినుము నేఁ గైలాసమునకు నేఁగు
టకు, జనులకు నెల్ల దృష్టముగ నీ
యున్న' బసవ. 7. పు. 219.
ద్రైవాటు 5-95 అతిశయించు.

ధ

ధట్టము 2-104 సేన.
5-31 సమూహము.
ధారాళ 2-92 అడ్డపాటు లేనిది.
ధ్రువ 1-55 ధ్రువుఁడు. చలనము లే
(శ్లో.)

న

నంతు 2-84 పరిహాసము. చూ.సూ.ని. 2-84 ఈ పద్యము సరిగా ఉన్నదని తోఁచదు. ఉన్న పాఠములనుబట్టి అంకనములు, నంకులు చదుల్లు, అను పదములు వ్యాఖ్యాతములు.

నఖర 5-107 గోరు.

నగధార 1-111 ధరతీతి = ధరః - ధర ఏవ ధారః; స్వార్థే ఽణ్ నగస్యధారః = నగధారః.

నదాభిసారము 1-32 నదముల ప్రవాహము. అభిసరణము అను శ్లేషకు నదగతమగు పుంలింగమననుగతము ఐనను కవులు దానిని నద్యభిన్నముగా సూచింతురు.

నయము - పీఠి 1-3 రమణీయము.

నలికొను 2-85 సన్నని నడుము.

నాచికొను 2-123 అపహరించు.

నాలుకలు క్రోయు 2-13 జ్వాలలు విషముగా చాఁచు.

నిట్టగ్రము 2-50 3-94 నిట్టవొడుచు, ఉప్పొంగు.

*నిన్కల 4-41

నినుచు 1-22 నించు, నిండించు.

నిరస్తవైకృతు 3-24 మహత్తత్త్వము నుండి భూతములవఱకును వికృతులు. వానిని నిరసించినవాఁడు- అనఁగా నిర్వికారుఁడు. చూ. షడ్వింశు.

నివ్వటిల్లు 5-109 వ్యాపించు.

నిస్సహాణ 2-105 నిస్సాణము = ఒకానొక చర్మవాద్యము.

నీలమణి 1-55 నల్లని మణి - విష్ణువు.

నెత్తఱులు-పీఠి 1-4 అలలు. తఱి = సమీపము, త్రాడు మొదలగు వాని ఒత్తుడు రేఖ.

నెరయు 3-141 వ్యాపించు. మొ. 4-48 సంధులు మొ. విడిపోవు, లేక దుర్బలములగు.

నెఱపు 2-76, 5-171, 187 నెఱవేర్చు.

నెరసు 5-125 కళంకము.

నెఱఁకులు 4-41 జీవస్థానములు.

నెఱఁకులు మీటు 4-135. (సూ.ని. పాఠము) = మర్మభేదనము చేయుట.

నెఱఁకులాడు మార్కు 2-163. 'ఎఱుకు నన్ను నుఱక యేసిన శరములు, నెఱఁకు లాడి నాకు నిశిత దివ్య, విశిఖతతులయట్లు వేదన గావించె, నిది యపూర్వ మీతఁ డెవ్వఁ డొక్కొ' అరణ్య. 1-314.

నెఱవాది 4-75 నేర్పరి

ప

పంచతపస్సు 2-14 ఐదు అగ్నుల నడుమ చేయు తపస్సు. దీనికి పం

చాగ్నిసాధనమనియుఁ బేరు. 'గ్రీష్మే పంచతపాస్తు స్యాద్వర్షాస్వభ్రావకాశికః। ఆర్ద్రవాసాస్తు హేమంతే క్రమశో వర్ధయం స్తపః' మను. 6-23

పచరించు 1-1 అలంకరించు
1-34. ఒప్పు చేయుఁ.
3-14 ప్రసరింపఁ జేయుఁ. చూ. హరి-భూ. 7-189. విహంగరాజు...అప్పద్మనాభు మీఁదఁ బచరించి బీఁటెండ మెఱయకుండ.

*పటుల 5-81 ఇది 'పటువా'యై యుండునా?

పడిరెఁ 5-87 శ్రమము నొందిరని.

పడిహారులు 1-80 ద్వారపాలకులు.

పతాక 1-43 టెక్కెపుఁగంబము.

పత్రకము 1-2 రేకు

పసఁగు 4-64 విశద మగు. 'కాంత కనుఁగొనఁ బసఁగుఁ' శ. ర. చూ. హరి. 8-21.

పసిక 2-3 పస. స్వార్థమున ఇఁక ప్రత్యయము.

పసిఁడినీరు 1-75 బంగారునీరు.

పదార్థపంచకము 3-26 మలము కర్మ మాయ రోధశక్తి బిందువు అని పదార్థములు ఐదు. ఇవియే పాశములు. "మిథ్యాజ్ఞానము అధర్మము సక్తిహేతువు (విషయసన్నిధానాదికము) చ్యుతి (సదాచరణభ్రంశము) పశుత్వమూలము (ఆణవాది సంస్కారము) అని మలమయిదు విధములు, కర్మ ధర్మాధర్మరూపము. మాయ సర్వమునకును మూలకారణము. ఇదియే అవిద్య. ప్రధానము ప్రకృతి. ఇచ్ఛాశక్తిని క్రియాశక్తిని అవరోధించు మలసాహిత్యము రోధశక్తి. బిందు వనఁగా మాయాత్మకమగు శివతత్త్వము. మిగిలిన నాలుగు పాశములను విడిచి యీ యొక్క పాశము చేతనే బద్ధుఁ డగువానికి శివపదప్రాప్తిరూపమగు ముఖ్యమోక్షము లేకున్నను గౌణ మగు అపరమోక్షము కలదు. కేవల మగు నీ పాశము విద్యేశ్వరాదిపదవీ ప్రాపకము. మిగిలిన పాశములవంటిది కాకపోవుటచే దీనిని పాశ మనిఅనరు. దాన పాశములు నాలుగనియుఁ ఐదనియును వ్యవహారము. చూ. సర్వదర్శన సంగ్రహ.

పరపు 2-86 విరివి.

పరిపాటి 1-1, 1-12 అనుక్రమము, సొరిది.

పరిమెయి 3-72 వేష్టనము, చుట్టుకొనుట. పరి చను దంతి నంటే కాలరులు వచ్చె ననుట. ఇది రేఫ యుఱు

ప్రవర్తించును. [విరాట. 4-68. శాంతి 3-69] చూ. అని కవి సంశయవిచ్ఛేదము.

పటపట 4-43 పీడితము, నుగ్గునుగ్గు.

పటుపనొల్లఁడు 2-124 పాటుపడఁ జేయఁడు.

పలక 4-116 కేడెము అను ఆయుధము.

పాటి 2-101 న్యాయము.

పాపఁడు 4-5 బాలుఁడు.

పావలు -8 4 పావకోళ్లు పాదుకలు.

పిండలి 3-182 ముద్ద.

పింపిళ్లుగూయు 2-67 బాలురును బాలికలును పెదవిమీఁదుగా ఒక విధమయిన ధ్వని కలిగించుచు నర్తించు. ఇచట జుంజుమ్మని తిరుగు.

పితామహుఁడు 3-14 తాత, బ్రహ్మ.

పినుఁగు 4-115 శోభి, పాడు పిశాచము అని తా.

పిఱుసనక 2-114 వెనుకకు పోక.

పిశాచి 4-115 పిశాచము. మహాదమహాన్మహాలీసాంకర్యము వాడు కనుబట్టి మహాకవులు చేసిరి. అపార మేయం నడచిన నది యఱచుచు' ఆది. 1-83 'ముసలావె యే వివేకి?' వై జ–

పీతాంబర 1-55 పచ్చని ఆకాశము పచ్చని వలువ, విష్ణువు.

పుండరీకాక్షుఁడు 3-14 తెల్ల తామరల వంటి కనులు గలవాఁడు, విష్ణువు.

పుక్కిటిబంటి 2-20 పుక్కిటికోలఁది. అనఁగా పుక్కిలి మునుఁగునంత.

పుయిలోడక 4-154 వెనుదీయక. సంకోచింపక.

పురుడు 1-40 సామ్యము.

పురుణించిన క్రియ 5-103 పోలిన రీతి.

పురుషాధీశ్వర 3-14 జీవులకు విభు.

పురుషోత్తము 3-14 ఉత్తముఁడగు పురుషుఁడు, 'ఉత్తమ శ్చాసౌ పురుష శ్చ' పురుషోత్తమః. రాజదంతాదులలోని దగుట పరనిపాతము. చూ. ఉత్తమః పురుష స్త్వన్యఃపరమాత్మే త్యుదాహృతః' లేక 'పురుషాణాం ఉత్తమః' అని శేష షష్ఠీసో సమాసము. చూ. శబ్దేందుశేఖరము. 'న నిర్ధారణే.'

పెద మోముపడు 1-116 వెను మొగ మగు.

పెంపు 2-60 వృద్ధి, మహత్త్వము.

పెఱలక్ 4-56 ఇతరులను.

పెల్కుఱు 2-46 విలవిలలాడు. విహ్వలించు.

పేదఱికంబు 5-12 పిఱికితనము, అశక్తత.

ప్రశాస్త్రి 4-14 గొప్ప ఒజ్జ. ఇది ప్రశాస్త కానోపు.

ప్రసన్న 1-6 ప్రసాదగుణముతోఁ గూడిన 'ఇది వాఙ్మయమునకు విశేషణము. చూ. 'ప్రసన్నకథాకలితార్థయుక్తి' ఆది. 1-25

ప్రెగ్గడలు 5-4. (పేరు+కడ) మంత్రులు, ప్రధాన పురుషులు. D. says ప్రగ్గడ, ప్రాపకుడు OG. says ప్రగ్గెడ, తీర్పరి. ప్రగ్గడకత్తె or గ్గె-n. s. A maid servant. పనికత్తె. S. I. 369. జయకేతనుని వార్త సారె విచారించి, వచ్చి ప్రగ్గడకత్తె లెచ్చరింప 'అని. బ్రౌ. (పార్శ్వము అను అర్థము కల పఱగడ,) (పార్శ్వవర్తి-ప్రగ్గడ) పరగడుపు— పరము+కడుపు, ఈ మొ. పదముల సంబంధ మారయునది.

*ప్రేపులు 1-32 ఊపులు అనుదానికి ప్రేపులు పూర్వరూపమా? ఈపదము పూర్వ ముద్రణమునఁ దక్క నాయెఱిఁగిన ముద్రితగ్రంథములం దెందును గానరాలేదు.

ప్రేలిపడు 4-40, 5-81 వేఁగిపడు.

ప్రొద్దువోకలు 2-127 కాలక్షేపము.

ప్రోక 4-70 ప్రోఁగు.

ప్రోగులు 1-8, 1-40 పోగులు. 'ప్రోవులు రూ. హరి. పూ. 1-49.

ప్రోది 1-54 పోషణము.

ప్రోపు 4-72, 159 పోషణము, పుష్టి.

ప్రోవు 4-159 (జడతత్త్వ) రాశి లేక సముదాయము. 'సీ. ప్రకృతియుం గుణములు ప్రకృతి జన్యం బగు, వికృతిసప్తకమును విను వికార, ములు పదియాఱు నై కలిగిన యీ ప్రోవు' హరి. ఉ. 6-75.

ప్లవన 2-92 'ప్లు-ప్లవనే' తేలాడుట.

బ

బగళమై (నిలుఁడు) 1-80 తొలఁగి నిలువుఁడు.

*బచ్చ్వులు 3-71.

బడిన్ 3-34 వెంబడి.

బత్తడిక 2-74 అంబులపొది.

బమ్మరించు 3-54 భ్రమించు.

బలవంతపు వెట్టి 5-74 బలాత్కరించి పట్టుకొన్న పిచ్చి. లేక పెద్దపిచ్చి. తెలుగువారు నన్ను బలవంతపెట్టకు 'బలవంతపు బ్రాహ్మణార్థము' అని యీ మొదలుగా పలురీతుల వాడుదురు. దీనికి బలాత్కారము, నిర్బంధము మొదలగునవి అర్థము. 1901 సం. ఆనందముద్రణాలయమున అచ్చయిన భారతమున 'క. బలవంతము జాదముఁనకు. బిలువం

బడి మగుడనగుచొ పెక్కులు కలు
కలో. అని కలదు. 1915 సం.
సదరు ముద్రణాలయమునందే అచ్చ
యిన భారతమున 'క. బలవద్ద్యూ
తార్థముగా' అని ప్రధాన పాఠము
గాను, 'బలవంతము జూదమునకు'
అని పాఠాంతరముగాను చూపఁ
బడినది. అసలు మొదటి పాఠమే
'బలవంతపు' అనుదానికి మార్పు.
పిదప బలవద్ద్యూత పాఠము 'బల
వంతము' అను తెలుగువారి జీవ
త్పదమును నులిమివైచెను.

బలసె 5-84 పరివేష్టించె.

బలువిడి 2-121 బలువగు పరా
క్రమము.

బాడుగల 2-116 'బాడు - తలఁ
గించు' బాడు=మునుఁగు తొలగిం
చుట. అనఁగా అవమానించుట.

బాడుదలవట్టు (శ్రీగిడుగు రామమూర్తి
పంతులుగారును, నేనును దీనికి
కొన్నాళ్లు తల పట్టుకొంటిమి.)
చ...బాహుదర్ప మేర్పడ నమ
రేంద్రు బాడుదల వట్టెక' (భాస్క
రామా. యు. 448) అనుచో
చెఱవట్టు అని అర్థము. క. బాడు
దల వట్టె కొలమునఁ, గూడని చెడు
గంచుఁ బెట్టుకొనఁ జూచియుఁ జే,
యూడక విడిచిరి' ...(కవిక. 2)
గీఁతగీచిన భాగము చెఱపట్టు అను
అర్థమునకు సాక్షి.

బారిసమరి 2-121 5-36 హింసించు.

బారసి-ద్వాదసి 'బారా - పండ్రెండవ
తిథి.' ఇటులే తేరసి=త్రయోదశి.

బిమ్మిటి 3-96 వివశత.

బుజ్జవములు 2-84 బుజ్జగింపులు.

బెండుచేసి 2-119 నిస్సారము చేసి.

బెట్టుగ 5-12 అత్యంతము.

బెరయు 2-85, 5-84 వ్యాపించు.

బెలయు 2-81, 3-130 వృద్ధి
పొందు. 5-127 వ్యాపించు.

బొక్కనిములు 2-127 బొక్కసలు.

బ్రాఁతి 3-73 ప్రియము.

బ్రుంగు 4-155 మఱుఁగు మునుఁగు.

## భ

భవనాశనీరాగాగత సాధు జన 1-55
భవనాశని అను నదిమీఁది, రాగ=
భక్తిచేత, ఆగత = వచ్చిన, సాధు
జనులు = మంచివారు, భవనాశ=
నశించిన సంసారము కలట్టియు,
నీరాగ = రాగాదులు లేనట్టియు,
ఆగత = వచ్చిన, సాధుజనులు =
సాధువులు.

భవ, ప్రియుఁడు 3-14 సంసారము
నందు, ప్రీతి కలవాఁడు. శివుని
మీఁద ప్రీతి కలవాఁడు.

భృతి 1-68 కూలి, వెల.

భ్రమరక 5-82 కమటోమలు.

మ

మతములు 5-142 అభిప్రాయములు- మార్గములు.

మదురువు 2-119 మద్యము, మత్తు.

మనస్కరించి 3-51 మనసుంచి.

మసిముట్టక 5-4 మసి అంటక. పారి. పూ. 8-117 లో 'మసిముట్టక' అని కలదు. ముసిముట్టక అనునది తప్పు కానోపు.

మాఁగవాఱు 2-10 మలినమగు, మాయు.

మాత 5-61 (మాఙ్ + తృచ్.) ఫలమునకు, ప్రమాణమైనవాఁడు.

మానికంపు టాకులు 2-36 చెవ్వాకు. కర్ణభూషావిశేషము.

మాపటికడ 3-75 సాయంకాలమున.

మాఱుమలయు 2-119, 25 ఎదిరించు.

మాసరంబులు 3-14 వ్యాప్తములు, దీర్ఘములు. ఇచట వ్యాప్తి అని చెప్పవలెను.

మిడుకు 4-159 బ్రతుకు, కదలు.

మిడుఁగుఱు 4-159-178 మిడుఁగుఱు పురుగు, అగ్నికణము.

మిట్టుగట్టు 1-40 ఎత్తు కేలగా నగు.

మిసిమింతుఁడు 4-42 అలసినవాఁడు.

ముందల 2-117 (మును+తల) శిరోగ్రము.

ముదుఁగు 2-90 ముడుచుకొనిపోవు.

ముదుఁగఁద్రోయు 2-136 చేష్టలుడుఁగఁజేయు.

మునమున 4-54 మున్ను మున్ను.

మునిమండల 1-55 మునుల గుంపు, సప్తర్షి మండలము. మరీచి అత్రి పులహుఁడు పులస్త్యుఁడు క్రతువు అంగిరుఁడు వసిష్ఠుఁడు. శతపథ బ్రాహ్మణాదులలో— 'కశ్యపుఁడు అత్రి భరద్వాజుఁడు విశ్వామిత్రుఁడు గౌతముఁడు జమదగ్ని వసిష్ఠుఁడు అని కలదు. పూర్వభాగమున మరీచి పిదప వసిష్ఠుఁడు పిదప అంగిరుఁడు పిదప అత్రి అతని ప్రక్క పులస్త్యుఁడు వాని ప్రక్క పులహుఁడు వాని ప్రక్క క్రతు వని వరాహమిహిరుఁడు.

మురియు 4-48 విఱుగు.

మెచ్చిన 4-6 లక్ష్యపెట్టిన.

మెఱయు 5-4 నాటిన శల్యాదికమును అటు ఇటు మెదల్చు.

మేపడి 5-7 అనుకూలము. చూ. మైపడి. గీ. మేఁతకై పోవు కదుపుల మెయిపడిన క్రిందకయ్యాతటంబుల నిందునందు,నాడుచును బాడుచును వల్లవాన్వితముగ, నరిగె బలదేవుఁ

దుసుడోన యరుగుదేఱ. హరి.
పు. 7-3 ఇచట అలమంద లెటు
పోయిన బలెఁ దటు పోయెనని
అర్థము.

మొక్కలము 4-116 ముష్కర
త్వము, కుటిలత్వము. [పోయి.

మొఱంగిపోయి 3-116 వంచించి

మొల్లము 1-87 సర్వస్వము.

మోడ్పడు 1-87 (మోడు+పడు)
మొక్క యగు.

*మోరత్లు 2-83 'మొరడులు'కు
'మ్రోత్లు'కు బహువచన రూపాంతర
ముగాఁ గనఁబడుచున్నది.

మోహకము 1-20, 4-90 మూర్ఖత.

*మోవి 2-66 (ఒకానొక చెట్టు.)

మైవడి 3-14, 5-7 అనుకూలము,
సౌమ్యము.ముద్రిత పుస్తకములందు
'ఏమి వడువుగల్గు నీ శిశుని మేవడి
తోడన' 5-7 అని కలదు. శ. ర.
లో 'మైవడి తోడన తెల్పి తెల్పి'
అని కలదు. ఈ పాఠమున యతి
'మై' అగుటవలన ఏ 'మి' అని
పాదాదిలో ఉండదు. ఈ పాఠమున
కాకరము చూడవలెను.

మైహికంబులు 2-20 మిహికా =
మంచు.

మ్రందు 2-64 సోలు.

*మ్రొంపులు 4-41

ర

రక్షామణి 1-16 చింతామణి.

రజ్జు సర్పసదృశ 3-28 త్రాటిని జూచి
పామని భ్రమయుంటతో సమానము.

రసబద్ధ గుళిక 3-84 పాదరసముపోసి
కట్టిన గుళిక. దీనికి రసమణి యని
పేరు. కొన్ని ప్రయోజనముల నుద్దే
శించి కొందఱు దీనిని కటిబంధము
నకు కట్టుకొందురు. ఇచట 'నల్లఁ
గలువలరసముపోసి బిగించిన గుళిక'
అని అర్థము.

రిపు, మిత్ర, మధ్య 4-157 అమి
త్రులు,ఉదాసీనులు.చూ. 4-153

ఱ

ఱేయం 1-32 అతిశయించు. విజృం
భించు వెనుకటి రెండు ముద్రణ
ములయందును, 'ప్రేపులు రేలుఁ
బెద్దయుఁను బేర్చి' అని కలదు. రేపు
లుకు ప్రేపులు పూర్వరూపమగుచో
'ఱేపులు' లేక రేపులు రేలుఁ బెద్ద
యుఁను ఱేసి అను పాఠముగూడ
సాధువు.

ల

లాయము 2-125 గుఱ్ఱాలసాల.

లీలాయితము 5-3 లీలవలె ఆచ
రితము. చూ. 'లోకవత్తు లీలా
కైవల్యమ్' బ్ర. సూ. 2-1-33.

వ

వడియుం 3-33 జాఱు - ప్రవహించు.

వదర 4-37 వదరుఁబోతు. క. వదు
నాలుగు లోకంబులు । బొదలింపం
ద్రుంపవలసి పాదవులు రెండై ।
తుదిఁ దా రొక్కటి యగుదురు ।
వదరలఁ జేయుందురు భేదవాదుల
నెల్లన్. ఉ. హరి. 2-69.

వనట 2-26 వగపు.

వనవాసి 3-14 అడవిలో నుండు
వాఁడు. నీరిలో నుండువాఁడు.

వలను 3-76 దిక్కు.

*వలిగవ్వులు 2-50 చల్లని మాఁతలు,
లేక నలుపులు.

వలిపము 3-63 పరిశుద్ధము, తెల్లనయి
నది. వృత్తిలో ముఁపము. వలిప
వెన్నెల. వలిప చెంగావిపావడ.

వాసనములు 5-157 సంస్కార
ములు,అనుభూతి సంస్కారములు.

విగతబంధు 3-14 పోయిన బంధు
గులు కలవాఁడు. వి = గరుడుని,
గత = పొందిన బంధ = బంధము,
వాత్సల్యము కలవాడు.

విచ్చిన 3-89 విరియఁబఱచిన.
3-111 మూతులు విచ్చు =
వికసించు.
,, నెమలిల యొఱకల పొదులు
విచ్చి = 'పే' విచ్చునటులు చేసి.

విమాన 1-57 ఏడంతస్థుల మేడ.
రాజసౌధము. చూ. 'యద్విమా
నాగ్ర భూమిః' మేఘ.
62 ఆకాశయానము.

విరవాది 2-68 విరవాజి విరజాజి.

విరియు 4-48 విచ్చిపోవు, పగులు.
నరి నెఱ. శ. ర. పాఠము. 'నరియు.'
చూ.

వివాహ 3-14 పెండ్లి. వి. పక్షి
అనఁగా ఇట గరుత్మంతుడు. అను
వాహ = వాహనము. శ్లే.

విలాసిని 1-55 వేశ్య, ఆఁడుది.

విషువద్దినములు 5-150 రేయుఁ బవ
లును సమమగు కాలము కల దిన
ములు.

విష్ణుపద 1-55 ఆకాశము, విష్ణువు
పాదములు. [ఇటు దటు పెట్టు.

వీడ్వడ నునుచు 5-109 అటుదిటు

వెంటలు 1-54 పనులు 4-179
ఒండొకవెంట.

వెంబడి 4-45 వెంట, పిమ్మట.

వెగ్గలము 1-8, 2-3 మిక్కుటము.

వెన్నకల్లు 3-98 కల్లు=రాయి. ఇచట
వెన్నముద్ద యని తా.

వెమ్ము 2-21 తప్తమగు.

వెరఁజు 2-121 చేతులతో పుప్పచేసి
యొత్తు.

వెఱచఱచు 5-31 భయపడు.

సుడియు 2-14 చుట్టి చుట్టి పీచు లేక 4-84 రోగతతిచేత 'క్షీణించు.' అనిఅర్థమై యుండును. చూ. హరి. ఉ. 8-47 'క. నీ కోడలు కొడుకు వక్షోరోగం బుడిగింపలేక సుడిసిన యది.' = చిక్కిపోయినది.

సూరెల 1-73 పార్శ్వములు.

సెజ్జ 1-37 శయ్య.

సేస ముత్తియములు 2-85 అలంకారమునకు తలపైఁదాల్చు ముత్తెములు.

సొగయు 3-108 సొక్కు. హరి. ఉ. 7-64 '...బ్రహ్మానుభవముగని సొగయుఁగలిక్.' (యద్దనపూడి సంజీవయ్యగారి ముద్రణము, 'సొగియుఁగలిగె' వావిళ్లవారిముద్రణము. సొగసియున్నట్లు వా. శ. ప్రో. 1-136. క. ఘనదండకాష్ణ కృష్ణా, జినములు సొగయింప సొక్కుజినముని చనుదెం,చె ననఁగ నమయవిరోధం, బని కవులఘనఁ జెప్పఁ గవిజనాశ్రయుఁడొనరఁగ్. కవిజనాశ్రయము - దోషాధికారము. 32.

సొగయించు 1-2,3-108 సుఖించు. 'గోటందు సురక్షలంబ యరవింద ముగా సొగియించియున్నయ నిలువు గోత యుయ్యెందిర.' చూ. శ. ర. 1-70 రాజమరాళంబులం విమలకమలాకరంబుల విహరణ కళాకౌశలంబులు 'సొగియింప'? 'ఇచట పై అర్థము కుదురదు. 'కౌశలంబుల' అని యుండునో? 'సత్యభామ విన్నఁగ గోష్ఠిఁ సొగియించు కడ' హరి. ఉ. 4-204. 'బిగియారు కౌఁగిట సొగయించి = 'చొక్కఁజేసి' హరి. ఉ. 7-96 'అచ్యుతుండు చొక్కన సొగియించి వర్ణించు హరి. ఉ. 9-151 దివ్యభోగములు తమకుఁ జొబ్బనచూఱలై సొగియింపవారుండ. (హరి. పూ.) 2-204 చొక్కఁజేయ 'సొగయింప' అని యే ఉభయముద్రణముల పాఠము.

సొమ్ముగ 1-21. స్వమ్ముగా, ఆత్మీయముగా.

సొరగు 2-15 లీనముగు.

సొలయక 1-87, 5-141; 142, 187 వైరస్యము నొందక. 'విశుంభితుఁడగుఁగాక వీఁడు సొలయకయుంకన్.' హరి. ఉ.7-253 వెనుదీయక, వైముఖ్యము పొందక.

*సోకి 2-33

సోమించు 5-19 పరాక్రమించు.

సైరణ 1-86 ఓర్పు

స్కంధావార 5-65 దండు విడిసిన చోటు, దండు.

స్నేహ 3-213 మైత్రి, చమురు.

హ

హరి 1-55 విష్ణువు, సింహము. (శ్లో)

హరిభద్ర 5-124 కూతురు బుడమ?

హిరణ్యకశిపు హిరణ్యాక్షులు 2-2. 'పురాణాంతరే హిరణ్యాక్షస్య జ్యేష్ఠత్వకథనం కల్పభేదాభిప్రాయమ్' హరివంశ వ్యాఖ్యాయాం. భవిష్యపర్వ 48-13.

హిరణ్యకశిపవే స్వాహా 2-128 హిరణ్యకశిపునకు హవి అర్పితము. ఇతని పరిపాలనలో దేవతలకు బదులు హిరణ్యకశిపునకే హవి యివ్వవలసి వచ్చెను. అదియే 'హిరణ్యకశిపవే స్వాహా' స్వాహా దేవహవిర్దానే శ్రౌషట్ వౌషట్ వషట్ స్వధా' అమర. చూ. 'స్వాహా స్వధా మతి ర్మేధా శ్రుతి స్మృతి రనుత్తమా' అను లలితా సహస్ర సౌభాగ్యభాస్కరవ్యాఖ్య

హిరణ్య కశిపు హీనులు 3-49 బంగారము, అన్నము, లేనివారు.

---

శ. ర. శబ్దరత్నాకరము.

సూ. ని. సూర్యారాయనిఘంటువు.

వా. ని. వావిళ్లనిఘంటువు.

# నిఘంటువులందును అప్పకవీయమునందును
# కనఁబడు పాఠభేదములు



| ఆశ్వా. పద్య. | | | |
|---|---|---|---|
| 1- 15 | పేరమ | ప్రేకమ - వీరేశలింగముగారి పాఠము. | |
| 2- 14 | సురిఁగిన | సుడిసిన. | అప్ప. 2. ఆ. |
| ,, | ప్రిదులనీక | వదలనీక. | ,, |
| 2- 16 | డిందు | డిందె. | శ. ర. |
| 2- 37 | రత్న సూత్న రుచి | నూతసార్క్య రుచి. | ,, |
| 2- 53 | మీఁ రిటు భ్రాని | మీరిటుఁ బూని. | ,, |
| ,, | దక్క | తక్క. | ,, |
| 2- 69 | ప్రాకుల - దొరఁగి | ప్రాఁకులు - తొఱఁగి. | ,, |
| | సొరయ | సొఱయ. | ,, |
| ,, | భ్రాచుకొఱకునై యున్న | భ్రాచుకొఱకును మున్న యుం (మున్న నిం) | అప్ప. 2. |
| ,, | యున్న | మున్న. | సూ. ని. |
| 2- 76 | ఇట్టి...నందు...సొఱపం | అట్టి...నందు...సొరపం. | ,, |
| 2- 82 | సరి తాళగింప | జతి తాళగింప. | శ. ర. |
| | పారగతుల | పారిగతుల | ,, |
| 2- 84 | జంకెలు ఋజ్జవములఁ నుంగింకలు | నంకులఁ జదుర్ష్ణ కరముల యంకనములు. | సూ. ని. |
| 2-119 | రాచి | దాఁచి(హరివంశ పాఠము.పూ 4-155) | |
| ,, | కోటుల | గణముల. | ,, |
| | ముడుఁగఁద్రోచి | మడుగఁద్రోచి | ,, |

| ఆశ్వా. పద్య. | | | |
|---|---|---|---|
| 2- 116 | పేర్చుచు | ప్రేల్చుచు | శ. ర. |
| 2- — | అదంచి | అడిచి | శ. ర. |
| 3- 25 | విభేదమై | అవిభేదమై. పూర్వముద్రణములు. (ఇదియు ఒప్పు) | |
| 3- 69 | తే. అదరిపాటున వేసవి పొదవి కొనినఁ । గలఁగి తలఁగి పో వేరక మలయ పవనుఁ। డిందుఁదల దూర్చికొనియె సా దింపొదర్చ।నమరు తాలవృంతముల మందానిలంబు. | ...వెస విచ్చి... । డొలఁగిపోవఁగఁ గూడక...। కొనియెనో యిప్పు డనఁగ। నమరుఁ దాళవృంతముల మందానిలంబు. | అప్పు. 2. |
| 3 80 | యుండు | యొడి | శ. ర. |
| | పొదలి - దిశలు - గ్రుక్కినట్టి | పొదవి-దిసలు-క్రుక్కినట్టు. | అప్పు. 2. |
| 3- 81 | సందికట్టునన్ | సందుకట్టునన్. | శ. ర. |
| 3- 97 | మ్రుచ్చిలించి చెచ్చెర | మ్రుచ్చిలింపఁ జెచ్చెర. | ” |
| | పదంతు చాడ్పునన్ | పదంతుకై పడిన్. | అప్పు. 1. |
| 3-123 | దిగిచికొనుచు వేగ చనిరో నని | నిగిడికొనుచు సరభసముగఁ జనిరో నవి. | శ. ర. & బ్రౌన్. |
| 3-131 | కాంతియ వెలిఁ బేర్చె నా | దా వెలిఁ బేర్చె నా. | శ. ర. |
| 3-134 | అంబుధియందు శయించు దేవు | అంబుధియందుదయించు దేవు | ప్రాథ |
| 4- 28 | పాప మడచె | పాప మడిచె. | మూ. ని. |

| ఆశ్వా. పద్య. | | | |
|---|---|---|---|
| 4- 32 | మదినునిచిన యుత్తమముని | మది నుంచుకొన్నవానిని. | అప్ప. 2. |
| 4-133 | అప్రమేయులు ఘనమాయ లధిప | అప్రమేయముల్ ఘనమాయలధిప | ప్రా. ఈ. |
| 5- 7 | మేవడి | మైవడి. | శ. ర. |
| 5- 77 | పొలయందగఁ దలఁడు | పొలయుఁగ ద వ్వతఁడు. | ,, |



# పద్యకావ్యములు

| ప్రతి 1-కి | రూ. | అ. |
|---|---|---|
| అచ్చ తెనుఁగురామాయణము ... | 2 | 8 |
| అనంతునిఛందము, (ఛందోదర్పణము) ... | 2 | 0 |
| అనిరుద్ధచరిత్రము, అబ్బయామాత్యునిది ... | 1 | 0 |
| అనుభవసారము, పాలకుఱికి సోమనాథప్రణీతము ... | 1 | 0 |
| అంబరీషోపాఖ్యానము, సటీక ... | 0 | 8 |
| ఆముక్తమాల్యద, (విష్ణుచిత్తీయము) సటీక ... | 8 | 8 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము ... | 0 | 4 |
| అన్యవాదకోలాహలము, ద్విపద, లఘుటీక ... | 0 | 12 |
| ఆంధ్రమహాభారతము:— | | |
| ఆదిపర్వము, టీక (పాతది) ... | 8 | 0 |
| ఆదిపంచకము ... | 11 | 4 |
| యుద్ధపంచకము, స్త్రీపర్వం ... | 7 | 8 |
| శాంతిసప్తకము ... | 7 | 8 |
| అరణ్యపర్వము ... | 4 | 0 |
| భీష్మద్రోణపర్వములు ... | 4 | 0 |
| విరాటోద్యోగపర్వములు ... | 4 | 0 |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు ... | 4 | 0 |
| శాంతిపర్వము ... | 4 | 0 |
| ఆది సభాపర్వములు ... | 4 | 0 |
| అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములు ... | 4 | 0 |
| ఆనందరంగరాట్ఛందము ... | 3 | 4 |

| | ప్రతి 1-కి | రూ. | అ. |
|---|---|---|---|
| ఆంధ్రనామసంగ్రహము, మూలము | ... | 0 | 0 |
| ,, టీకతో | ... | 0 | 10 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక | ... | 1 | 8 |
| కవికంఠోక్తి | ... | 0 | 4 |
| కవిజనాశ్రయము | ... | 1 | 0 |
| కవిసంశయవిచ్ఛేదము, అడిదము సూరకవి | ... | 1 | 4 |
| కవిజనరంజనము | ... | 0 | 12 |
| కళాపూర్ణోదయము, సూరనార్యునిది | ... | 4 | 0 |
| డిటో టీకతో | ... | 6 | 0 |
| కవిగజాంకుశము | ... | 0 | 4 |
| క్రీడాభిరామము, శ్రీవల్లభరాయప్రణీతం | ... | 1 | 8 |
| గణికాగుణప్రవర్తనతారావళి | ... | 0 | 4 |
| గయోపాఖ్యానము, ద్విపద (కృష్ణార్జునసంవాదము) గోపమంత్రిది | | 0 | 4 |
| ఛందోదర్పణము (అనంతునిఛందస్సు) | ... | 2 | 0 |
| జైమినిభారతము | ... | 2 | 8 |
| తెనుఁగుసమస్యలు | ... | 0 | 3 |
| దసరాపద్యములు | ... | 0 | 3 |
| దేశింగురాజుకథ (జంగంకథ) | ... | 0 | 8 |
| ధనాభిరామము | ... | 0 | 12 |
| ధ్రువోపాఖ్యానము, సటీక | ... | 0 | 12 |
| నలోపాఖ్యానము, సటీక | ... | 1 | 0 |
| నలచరిత్ర, ద్విపద, క్యాలికోబైండు | ... | 2 | 4 |
| నరసభూపాలీయము, సటీక (కావ్యాలంకార సంగ్రహము) | | 3 | 0 |
| నిర్వచనోత్తరరామాయణము | ... | 2 | 8 |
| నిరంకుశోపాఖ్యానము | ... | 0 | 12 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| నీతిపద్యసంగ్రహము, సటిప్పణము ... | 0 | 6 |
| నీలాసుందరీపరిణయము ... | 0 | 12 |
| నృసింహపురాణము, ఎఱ్ఱాప్రగడది ... | 2 | 8 |
| పంచతంత్రము, నారాయణకవిది ... | 2 | 8 |
| డిటో వెంకటనాథరాజకవికృతము ... | 2 | 8 |
| పల్నాటివీర చరిత్రము ... | 3 | 8 |
| ప్రభావతీప్రద్యుమ్నము, పింగళిసూరన ... | 2 | 8 |
| పరమయోగివిలాసము, ద్విపద, తాళ్లపాక తిరువేంగళనాథుడు | 2 | 8 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు ... | 1 | 8 |
| ,, సాంధ్రటీకాతాత్పర్యము ... | 5 | 0 |
| బ్రహ్మోత్తరఖండము | 3 | 0 |
| బసవపురాణము, ద్విపద, చిన్నసైజు ... | 4 | 8 |
| బిల్హణీయము ... | 1 | 4 |
| బేరీజుపద్యములు | 0 | 4 |
| భగవద్గీతా కందార్థములు | 1 | 8 |
| భారతసావిత్రి ... | 0 | 4 |
| భీమేశ్వరపురాణము, శ్రీనాథునిది ... | 3 | 0 |
| భోగినీదండకము ... | 0 | 4 |
| భోజరాజీయము, అనంతామాత్యకృతము ... | 4 | 0 |
| మల్లభూపాలీయము, నీతిశతకము, ఎలకూచి బాలసరస్వతి, వేదము లక్ష్మీనారాయణశాస్త్రి టీకతో ... | 1 | 8 |
| మార్కండేయపురాణము, మారనకృతము ... | 4 | 0 |
| మొల్లరామాయణము ... | 1 | 8 |
| యయాతిచరిత్ర, పొన్నిగంటి తెలగనార్య ... | 2 | 0 |
| డిటో ఆకొండి వ్యాసమూర్తిగారిది ... | 0 | 3 |



వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

పోస్టుబాక్సు 1372. 292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. 1.